ఫిబ్రవరి 2015 వెల రూ.10/-

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY







# ఐక్య ఉపాధ్యాయ

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక




## యుటియఫ్ రాష్ట్ర మహాసభలు

2014 డిసెంబర్ 13,14; ఏలూరు

1 Uvo1A555


ఐక్య ఉపాధ్యాయ
విద్యా విషయక మాసపత్రిక
ఫిబ్రవరి - 2015
సంపుటి- 41 సంచిక: 1,2




ఈ సంచికలో...




| | | |
|---|---|---|
| దశాబ్దిచందా | : | ₹ 1000-00 |
| 5 సం॥ చందా | : | ₹ 550-00 |
| సం॥ చందా | : | ₹ 120-00 |
| విడి ప్రతి | : | ₹ 10-00 |

SBI Online
A/c No. 30206957939



ఐక్య ఉపాధ్యాయ
యుటిఎఫ్ ఆఫీస్, పాలపర్తివారి వీధి,
గవర్నర్‌పేట, విజయవాడ-520002

Ph.No. : 0866-2573763
Website : www.aputf.org.
E-mail : ikyopadhyaya@gmail.com


# పునరంకితం

కొత్త రాష్ట్రంలోకి కొత్త సంవత్సరం కోటి ఆకాంక్షలతో రెక్కలు విప్పుకొంటూ వచ్చివాలింది. అనంతానంతకాల గమనంలో ఇది చాలా చిన్న వ్యవధేగానీ 'ఐక్య ఉపాధ్యాయ'కు కూడా ఇప్పుడు నలభైఏళ్ళొచ్చాయి. ఈ జన్మదినాన కొత్త యేడాది నిమ్మళంగా మనల్ని వెనక్కి చూచుకొమ్మనీ, నమ్మకంగా ముందుకు దృష్టి సారించమనీ హెచ్చరిస్తోంది.

ఈ కాలంలో మనం మహోన్నత సోషలిస్టు సమాజాల విశ్వమానవతా పరిమళాల్ని ఆఘ్రాణించాం. వాటి విషాద పతనాలకు విచలితమూ అయ్యాం. సకల శృంఖలాలూ తెంచుకున్న విశ్వ మానవుణ్ణి దర్శించాం. మార్కెట్లు, సామ్రాజ్యవాదులు చేస్తున్న సామాజిక విధ్వంసాన్నీ చూస్తున్నాం. సమానత్వాన్ని ఆధునిక ప్రజాస్వామిక యుగలక్షణంగా ప్రవచించుకొన్న రోజుల నుంచి అసమానతల్ని అభివృద్ధిగా నిర్వచించుకొనే కాలం దాకా మనం ప్రయాణించాం. సామాజికంగా ఇది చాలా సంక్లిష్ట కాలం. శాస్త్ర సాంకేతికంగా ఇది అసాధారణ విజయాల యుగం.

ఉపాధ్యాయ ఉద్యమచరిత్ర దీనికి ప్రతిబింబవే. రాజకీయ రాబందులనుంచి టీచర్లు విముక్తులయ్యారు. అధికార్ల పీడనను ఉపాధ్యాయుడు వదిలించుకొన్నాడు. బతకలేని స్థితి నుంచి బడిపంతులు నిలదొక్కుకొని, పిడికిలి బిగించి రాజ్యాన్ని ప్రశ్నిస్తున్నాడు. క్యాడర్‌నీ, యాజమాన్యాలనీ, ప్రాంతాల్నీ అధిగమించి ఒక జండా నీడలోకి ఉపాధ్యాయ లోకం చేరుకొంది. ఇదొక అసాధారణ ప్రస్థానం. ఈ ప్రస్థానంలో యుటిఎఫ్ అనితర సాధ్యమైన పాత్ర పోషించింది. అడుగడుగునా 'ఐక్యఉపాధ్యాయ' దీనికి చుక్కానిగా నిలబడింది.

ఇప్పుడు రాష్ట్రం విడిపోయింది. మనమూ రెండు వేదికలుగా మారాం. కళ్ళముందు మన చదువులు పరాయీకరణ నుంచి కాషాయీకరణకు చేరుకొన్నాయి. మానవీకరణను, సామాజీకీకరణను వెనక్కినెట్టి వ్యాపారీకరణ విద్యారంగాన్ని శాసిస్తోంది. సామ్రాజ్యవాదం అన్ని రంగాల్ని ఎంతగా శాసిస్తోందో మన రంగాన్నీ అంతే శాసిస్తోంది. ఉపాధ్యాయుడు మళ్ళీ ఒంటరివాడవుతున్నాడు.

కొత్త సంవత్సరం దీన్ని హెచ్చరిస్తూ సమైక్యత, సమరశీలత, సైద్ధాంతికతా ప్రాణాలుగా మన ఉద్యమం విస్తరించాలనీ, నిగ్గుదేలాలనీ ప్రబోధిస్తోంది.

ఈ చారిత్రక పాత్రని సమర్ధవంతంగా పోషిస్తానని వినమ్రంగా ప్రతిజ్ఞ చేస్తూ 'ఐక్య ఉపాధ్యాయ' తన కర్తవ్యానికి తాను పునరంకితమవుతూ నలభై ఒకటవ యేట ప్రవేశిస్తోంది.

# మైనేనికి నివాళి

యుటియఫ్ నేత, ఐక్య ఉపాధ్యాయ వ్యవస్థాపక ప్రధాన సంపాదకులు మైనేని వెంకటరత్నం 1990 జనవరి 12న మరణించారు. యుటియఫ్ ఆవిర్భావంలోనూ, ఐక్య ఉపాధ్యాయ పత్రిక స్థాపనలోనూ కీలక పాత్ర పోషించిన మైనేని అజాత శత్రువు, ఆదర్శ ఉపాధ్యాయుడు, మంచి వక్త, కవి, రచయిత, విమర్శకుడు. సామాజిక స్పృహతో పలు ప్రజా సంఘాలకు సహకారం అందించేవారు. 1975 జనవరిలో ఐక్య ఉపాధ్యాయను ప్రారంభించిన నాటి నుండి మరణించే వరకు ప్రధానసంపాదకుడిగా బాధ్యతలు నిర్వహించి వినూత్నమైన శీర్షికలు, విభిన్నమైన రచనలతో విజ్ఞానదాయకంగా పత్రికను తీర్చిదిద్దడం వల్ల అచిర కాలంలోనే అత్యధిక పాఠకాదరణను పొందగలిగింది. అదే ఒరవడి ఈనాటికీ కొనసాగుతున్నది. ఆ మైనేని ఆదర్శాలను పాటిస్తూ ఆశయాల సాధనకు కృషి చేస్తామని ప్రకటిస్తూ, 25వ వర్థంతి సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అమరజీవి మైనేనికి జోహార్లర్పిస్తున్నది.

1974 ఆగస్టులో ఒక చారిత్రక అవసరంగా ఏర్పడిన ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ నాలుగు నెలల్లోనే తన వాణిని రాష్ట్ర వ్యాప్తం చేసేందుకు 1975 జనవరిలో మైనేని సంపాదకత్వంలో ఐక్య ఉపాధ్యాయ మాసపత్రికను ప్రారంభించింది. యుటియఫ్ భౌగోళికంగా రాష్ట్రమంతటా విస్తరించక మునుపే ఐక్య ఉపాధ్యాయ రాష్ట్రం మూల మూలలకు విస్తరించింది. ఉపాధ్యాయుల పోరాటాల వార్తలు, అధికారుల అవినీతిపై "గుసగుసలు శీర్షిక, సమస్యలపై సమాధానాలు సమకాలీన సాహిత్య వ్యాసాలు, అభ్యుదయ సాహిత్యంపై సమీక్షలు ఒకటేమిటి పత్రిక ఆ సాంతం చదివి, భద్రపరచుకోవలసిందే. పత్రికకు అంతటి ఘనతను తెచ్చిపెట్టింది మైనేని రచనా విశిష్టత, సామాజిక స్పృహ.

చెరగని చిరునవ్వు, ఆప్యాయత నిండిన పలకరింపు ప్రతి పలుకులో సాహితీ గుబాళింపు, అన్యాయాన్ని అక్రమాలను సహించని ఖచ్చితత్వం మైనేని స్వంతం. విద్యార్థుల పట్ల ప్రేమ, ఆప్యాయతలు, కార్యకర్తల బాగోగులూ అన్నీ పట్టించుకునే మానవతా మూర్తికి తీవ్రమైన వామపక్షభావాలెలా అబ్బాయా అని ఆశ్చర్య పోయిన పెద్దలు అనేకులు.

అవకాశ వాదం అంటేనే మండి పడేవారు మైనేని. తనవారైనా, పర వారైనా మినహాయింపు లేదు. విలువల కొరకు జీవించాలే తప్ప గెలుపు ఓటములు ప్రధానం కాదని, అవకాశవాదులను గట్టిగా ఎదుర్కొనేవారు మైనేని.

మైనేని మంచి క్రీడా కారుడు, కళాకారుడు కూడా ఉన్నారు. యుటియఫ్ విద్యా వైజ్ఞానిక మహా సభల గీతాల కాసెట్లు రూపొంది ంచడం, సాంస్కృతిక, సాహిత్య కళారూపాలను ప్రదర్శించడం లోనూ మైనేని మార్గ దర్శకత్వం చిరస్మరణీయం. విద్యార్థులను వ్యాసరచన లకు, వకృత్వ పోటీలకు, బాల్యంలోనే ముఖానికి రంగేసుకుని నాటకాలాడిన అనుభవంతో తన విద్యార్థులను అందుకు ప్రోత్సహిం చేవారు. మైనేని మంచి కబడ్డీ ఆటగాడు కూడా. ఫ్రెండ్లీ మాచెస్ అనేక మార్లు ఆడేవారు. గుంటూరు జిల్లా తుళ్ళూరులో పని చేస్తున్న పుడు క్రీడల్లో టీచర్సు టీమును ఆర్గనైజ్ చేశారు.


మైనేని వెంకటరత్నం

ఆర్గనైజేషన్ విషయాల్లో కఠినంగా ఉండాలి, నాయకుల, కార్యకర్తల వ్యక్తిగత సంబంధాల్లో ఆత్మీయంగా ఉండాలని చెప్పే మైనేని నిరంతరం మనకు స్ఫూర్తినిస్తూనే ఉంటారు.

మైనేని జనవిజ్ఞాన వేదికకు యుటియఫ్ రాష్ట్ర కమిటీ పక్షాన బాధ్యులుగా కూడా పని చేశారు. 1990 జనవరి 11వ తేదీన నెల్లూరులో జనవిజ్ఞాన వేదిక సమావేశానికి హాజరైనారు. జె.వి.వి. నిర్వహించాలనుకున్న ప్రతికకు 'చెకుముకి' అన్న పేరు మైనేని సూచించిందే. పత్రిక నిర్వహణకు తన వంతు సహకారాన్ని అందిస్తానని ప్రకటించి, తిరిగి విజయవాడ ప్రయాణమై మార్గ మధ్యంలో గుండెపోటుతో జనవరి12 వేకువ జామున అశువులు బాశారు. కర్తవ్య నిర్వహణలోనే కనుమూసిన ధన్యజీవి, ఆదర్శమూర్తి మైనేని వెంకటరత్నం ఉపాధ్యాయలోకానికి వేగుచుక్క.

**అన్ని జిల్లాల యుటియఫ్ శాఖలు ఐక్యఉపాధ్యాయ సర్క్యులేషన్ పెంపుదలపై కేంద్రీకరించాలని యుటియఫ్ కోరుతున్నది. అదే మైనేనికి మనం ఇచ్చే ఘననివాళి.**

## ముఖ్యగమనిక

**ఐక్యఉపాధ్యాయ** పత్రిక జనవరి నెల నుండి విజయవాడ కేంద్రంగా నడుపబడుతున్నది. ఇకపై పత్రికకి పంపే వ్యాసాలు, ఉద్యమ వార్తలు, కథలు-కవితలు-గేయాలు, ప్రశ్నలు అన్ని రకాల వార్తలు **ఎడిటర్ ఐక్యఉపాధ్యాయ, యుటియఫ్ ఆఫీస్, పాలపర్తివారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ-520002 అడ్రసుకు పంపాలి, లేదా**

**E-Mails : ikyopadhyaya@gmail.com; aputf2000@yahoo.com**కి పంపాలి.

పత్రిక చందాలుకూడ విజయవాడకి పంపవలెను. జనవరి నుండి ప్రత్యేక క్యాంపెయిన్ నిర్వహించాలి. పత్రికల సంఖ్య పెంచాలి. ప్రతి పాఠశాలకు పత్రిక వెళ్ళేలా చూడాలి. అడ్వర్‌టైజ్‌మెంట్లు సేకరించి పంపాలి.




# నవ్యాంధ్రప్రదేశ్‌లో
# యుటియఫ్ రాష్ట్ర మహాసభలు

నవ్యాంధ్రప్రదేశ్‌లో తొలిసారిగా జరిగిన రాష్ట్ర విద్యావైజ్ఞానిక మహాసభలు డిసెంబర్ 13న ఏలూరు (సిఆర్ రెడ్డి కళాశాల) ఎస్ఆర్ పొలిశెట్టినగర్‌లో అత్యంత ఉత్సాహభరితంగా జరిగాయి. మహాసభలు ప్రారంభ సూచికగా యుటియఫ్ పతాకాన్ని రాష్ట్ర అధ్యక్షులు ఐ.వెంకటేశ్వరరావు, ఎస్‌టియఫ్ఐ పతాకాన్ని సీనియర్ నాయకులు సిహెచ్.సుభాష్‌చంద్రబోస్ ఆవిష్కరించారు.

యుటియఫ్ రాష్ట్ర గౌరవాధ్యక్షులు ఎస్.కె.సాబ్జీ మహాసభకు విచ్చేసిన ముఖ్య అతిథులను, సీనియర్ నాయకులను పిడిఎఫ్ ఎమ్మెల్సీలను వేదికపైకి ఆహ్వానించగా ఐ.వెంకటేశ్వరరావు అధ్యక్షతన సభ ప్రారంభం అయ్యింది.

ప్రారంభంలో ఉపాధ్యాయ ఉద్యమ పితామహుడు చెన్నుపాటి లక్ష్మయ్యగారి చిత్రపటానికి యుటియఫ్ సీనియర్ నాయకులు చిట్టి బాబు పుష్పమాలంకరణ చేసి, ఘనంగా నివాళులర్పించారు. చెన్నుపాటి ఆశయాలతో నేటితరం ఉపాధ్యాయ ఉద్యమాన్ని నిర్మించాలని పిలుపు నిచ్చారు. మరో సీనియర్ నాయకులు సుభాష్ చంద్రబోస్ మాట్లాడుతూ యుటియఫ్ ఏర్పాటు చేయడంలో నాటితరం నాయకుల కృషి, త్యాగం, నీతి నిజాయితీలను గుర్తుచేశారు. సభాధ్యక్షులు ఐ.వెంకటేశ్వరరావు తొలి పలుకుల్లో ఉపాధ్యాయ ఉద్యమం ప్రారంభ దినాల్లో, యుటియఫ్ నిర్మాతలైన అప్పారి వెంకటస్వామి, మైనేని వెంకటరత్నం, సూర్య నారాయణ రాజు, పోలిశెట్టి లాంటి నాయకుల త్యాగాలతో అందించిన స్ఫూర్తితో ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్దామని పిలుపునిచ్చారు.

అనంతరం మహాసభల ఆహ్వాన సంఘం అధ్యక్షులు, ఏలూరు నగర మేయర్ శ్రీమతి షేక్ నూర్జహాన్ ఆహ్వాన సంఘం పక్షాన సభకు వచ్చిన వేలాదిమంది ఉపాధ్యాయులకు స్వాగతం తెలుపుతూ రాష్ట్రంలో పశ్చిమగోదావరి జిల్లాను అక్షరాస్యతలో ముందుండేలా కృషి చేసిన ఉపాధ్యాయులందరికీ అభినందనలు తెలియజేశారు. స్థానిక శాసన సభ్యులు బడేటి కోటరామారావు మాట్లాడుతూ ప్రభుత్వ విద్యారంగ అభివృద్ధికి కృషి చేస్తున్న యుటియఫ్‌ని అభినందిస్తూ, ఉపాధ్యాయ, విద్యారంగ సమస్యల పరిష్కారానికి తమ సహకారం ఉంటుందని అన్నారు.

**ఎస్‌టిఎఫ్ఐ ప్రధానకార్యదర్శి కె.రాజేంద్రన్ :**



రాష్ట్ర మహాసభల్లో ముఖ్య అతిథిగా పాల్గొన్న కె.రాజేంద్రన్ మాట్లాడుతూ దేశంలో ఇంకా 26%మంది నిరక్షరాస్యులున్నారు. విద్యా హక్కు చట్టం అమలులోకి వచ్చి నాలుగేళ్ళు అయినా అన్ని రాష్ట్రాల్లో సమానంగా అమలు కావడం లేదన్నారు. విద్యాహక్కు చట్టం అమలుకు కావలసిన బడ్జెట్ కేటాయింపుల కోసం పోరాడాల్సి ఉందన్నారు. క్రొత్తగా అధికారంలోకి వచ్చిన కేంద్ర ప్రభుత్వం విదేశీ యూనివర్సిటీలకు తలుపులు బార్లా తెరుస్తోందని విద్యని కార్పొరేటీకరణ చేయడంతోపాటు. కాషాయీకరణ చేసేందుకు రంగం సిద్ధం చేస్తోందని ఈ పరిణామాలను ఎదుర్కొనేందుకు అందరు సిద్ధం కావాలని పిలుపునిచ్చారు.

**ఉపాధ్యాయులు అంకితభావంతో పనిచేయాలి - డి.రామిరెడ్డి**



యుటియఫ్ నిర్మాతల్లో ఒకరు ఎస్‌టిఎఫ్ఐ మాజీ అధ్యక్షులు డి. రామిరెడ్డి మాట్లాడుతూ ఉపాధ్యాయుల ఆర్థిక స్థాయి పెంచేందుకు సంఘాలు కృషి చేశాయని, ఇప్పుడు ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడేందుకు అంకితభావంతో పని చేయాలన్నారు. యుటియఫ్ కార్యకర్తలు అవినీతికి వ్యతిరేకంగా పోరాడాలని, ఆర్థిక క్రమశిక్షణ కలిగి ఉండాలని, విద్యావికాస ఉద్యమాన్ని అమలు చేయడం ద్వారా ప్రభుత్వ విద్యా రంగాన్ని కాపాడుకోవాలన్నారు.

**విద్యా సదస్సు**

యుటియఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి అధ్యక్షతన విద్యా సదస్సు జరిగింది. ఈ సదస్సులో విద్యారంగ విశ్లేషకులు ఎమ్మెల్సీ వి.బాలసుబ్రహ్మణ్యం, ఇన్స్యూరెన్స్ ఎంప్లాయీస్ యూనియన్ మాజీ జాతీయ ప్రధానకార్యదర్శి, 10 టీవీ చైర్మన్ కె.వేణుగోపాల్ పాల్గొన్నారు.

గత రెండు దశాబ్దాలుగా విద్యారంగంలో చేసిన ప్రయోగాల ఫలితంగా ప్రభుత్వ విద్యా వ్యవస్థ నిర్వీర్యం అయిందని, మంచి పాఠశాలల పేరుతో క్లస్టర్ స్కూల్స్ ప్రతిపాదనలు తేవడం ద్వారా ఉన్న పాఠశాలల మూసివేతకు తెరలేపుతున్నారని యుటియఫ్ రాష్ట్ర

ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి అన్నారు. ప్రభుత్వరంగంలో అరకొర సౌకర్యాలతో అనేకరకాల పాఠశాలలు ఏర్పాటు చేసి ప్రైవేట్ పాఠశాలలకు పరోక్షంగా సహకారం అందిస్తున్నారు. పబ్లిక్ ప్రైవేట్ పార్టనర్‌షిప్ (పిపిపి) పద్ధతిని అమలులోకి తెచ్చి పాఠశాలల నిర్వహణ కార్పొరేట్‌వారికి అందించేందుకు రంగం సిద్ధం చేస్తున్నారు. ఈ దశలో "క్లస్టర్ స్కూల్స్ కాదు కామన్ స్కూల్స్ కావాలి" అనేది యుటియఫ్ డిమాండ్ అని బాబురెడ్డి అన్నారు.



**కార్పొరేట్‌లకు రెడ్ కార్పెట్ - ప్రధానవక్త వేణుగోపాల్** మాట్లాడుతూ కేంద్రంలో ఏర్పడిన నూతన ప్రభుత్వం గత యుపిఏ ప్రభుత్వ విధానాలనే అత్యంత వేగంగా అమలు చేస్తుందన్నారు. ఇన్సూరెన్స్ కంపెనీలతోపాటు, రక్షణరంగం నుండి రైల్వే శాఖల వరకు అన్ని రంగాలు కార్పొరేట్ శక్తులకు అప్పజెప్పు తున్నారు. విదేశీ కార్పొరేట్ కంపెనీల కోసం ఈ దేశంలో కార్మిక చట్టాల మార్పు చేస్తున్నారు. కార్మిక చట్టాలు మార్చడం ద్వారా కనీస ప్రజాస్వామిక హక్కులు రద్దు అవుతున్నాయి. ఈ దేశంలో చౌకగా ముడి ఖనిజాలు, శ్రమశక్తి దొరుకుతుంది. కాబట్టి ఇక్కడ తయారు చేసి ఎక్కడైనా అమ్ముకోండి అనేది కేంద్రం విధానంగా ఉందన్నారు. కార్పొరేటీకరణ పట్ల ప్రజల్లో వ్యతిరేకత రాకుండా మత విద్వేషాలు సృష్టించి ప్రజల్ని తప్పుదోవ పట్టించడం అజెండాగా అమలు చేస్తున్నారన్నారు.

విద్యారంగంలో సిలబస్ సైతం మార్పులు చేయనున్నట్లు వార్తలు వస్తున్నాయి. ప్రజాప్రతినిధులుగా ఉన్నవారే లౌకిక రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకంగా మాట్లాడుతున్నారు. విశ్వ విద్యాలయాల్లో సైన్సు కాదు జ్యోతిష్యశాస్త్రాలు బోధించాలని ప్రబోధిస్తున్నారు. విద్యారంగ కార్పొరేటీకరణ, కాషాయీకరణ పట్ల అప్రమత్తంగా ఉండాలని పిలుపు నిచ్చారు.

**రాష్ట్ర విద్యారంగంలో ప్రయోగాలు - వి.బాలసుబ్రహ్మణ్యం**



నవ్యాంధ్రప్రదేశ్‌లో విద్యారంగం పట్ల ప్రభుత్వం తీసుకున్న అస్పష్ట నిర్ణయాలవల్ల పాఠశాలలు తీవ్రంగా నష్టపోతున్నాయన్నారు. విద్యా సంవత్సరం పూర్తికావస్తున్నప్పటి పరీక్షల విధానం పట్ల ఉపాధ్యాయుల్లో సరైన అవగాహన కల్పించలేదన్నారు. నూతన సిలబస్, నూతన పరీక్ష పద్ధతులు విద్యార్థులకు భారంగా మారాయి. పనివేళలు పెంచి, పీరియడ్ల సంఖ్య పెంచడం వల్ల ఉపాధ్యాయులకు భారం పెరిగిందన్నారు. 15వేలుపైగా ఉన్న ఖాళీలు ఇక ఈ విద్యాసంవత్సరంలో భర్తీ కానట్లే. పర్యవేక్షణ అధికారులు దశాబ్దంపైగా లేరు. పండిట్, పిఇటిల అప్‌గ్రేడేషన్ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉంది.

ఎయిడెడ్ పాఠశాలల పోస్టులు భర్తీ చేయకపోవడం వల్ల ఆ వ్యవస్థ మూతపడే దశకు చేరుకుంది. మున్సిపల్ పట్టణాల్లో పెరిగిన జనాభాకి అనుగుణంగా పాఠశాలలు లేవు, పోస్టులు లేవు. ఉన్నత విద్య ఇప్పటికే కార్పొరేట్‌మయం అయింది. జూనియర్ కాలేజీలు, డిగ్రీ కళాశాలలు, విశ్వ విద్యాలయాలలో పోస్టులు భర్తీ కాకపోగా కాంట్రాక్ట్ ఉద్యోగులతో నిండిపోయాయి. ప్రతిష్ఠాత్మకంగా ప్రారంభం అయిన గురుకులాలు సైతం అనేక కష్టాల్లో ఉన్నాయి. మోడల్ స్కూల్స్‌లో టీచర్లు లేరు. హాస్టల్ లేదు. భవనాలు పూర్తికాలేదు. ఇవన్నీ ఉన్న వ్యవస్థలో బలహీనతలు.

బలహీనమైన ఈ ప్రభుత్వరంగంలో నాణ్యమైన విద్య లేదని ప్రజలు ఇంగ్లీషుమీడియం, కార్పొరేట్ సంస్థలవైపు వెళ్ళారు. వ్యవస్థను బలోపేతం చేయాల్సిన ప్రభుత్వం బయోమెట్రిక్ విధానంతో బాగు చేస్తామంటున్నారు. తాజాగా క్లస్టర్ పాఠశాలల ప్రతిపాదనలు తెస్తున్నారు. మండలానికి 5-10 పాఠశాలలు అన్ని సౌకర్యాలతో ఏర్పాటు చేస్తామని వార్తలు వస్తున్నాయి. మిగిలిన పాఠశాలలు మూసివేస్తారా? కొనసాగిస్తారా? అనేది తేల్చలేదు. ఇప్పటికే రాజస్థాన్‌లో 17వేలు, మహా రాష్ట్రలో 14వేలు పాఠశాలలు మూతపడినాయి. ఈ అనుభవాలు చూస్తే మన రాష్ట్ర పాఠశాల విద్య ఏమవుతుందో అని ఆందోళన కలుగుతోంది.

నూతన రాజధాని నిర్మాణం సింగపూర్, జపాన్ మోడల్ అంటున్నారు మన పాలకులు. అక్కడ యూనివర్శిటీలు, పాఠశాలలాగా మన రాష్ట్రంలో విద్యావిధానం అమలు చేస్తామని మాత్రం చెప్పడం లేదు.

మారుతున్న పరిస్థితులను అధ్యయనం చేయడం ద్వారా యుటియఫ్ ప్రభుత్వ విద్యారంగం కాపాడుకోవడం కోసం అప్రమత్తంగా ఉండాలన్నారు. అందుకోసం ఐక్యఉద్యమాల్లో ప్రజల సహకారం కూడా తీసుకోవాలన్నారు. ఎమ్మెల్సీలు వై.శ్రీనివాసులురెడ్డి, బి.నాగేశ్వరరావులు సందేశాలిచ్చారు.

ఈ మహాసభలో సోదర సంఘాల నాయకులైన ఆక్టా ప్రధాన కార్యదర్శి శ్రీమతి ఎస్.మహేశ్వరి, జిజెసి లెక్చరర్స్ అసోసియేషన్ జోనల్ అధ్యక్షులు బివి శ్రీనివాస్, సోషల్ వెల్ఫేర్ రెసిడెన్షియల్ ఎంప్లాయీస్ అధ్యక్షులు కె.మోహన్‌రాజ్, కాంట్రాక్ట్ లెక్చరర్స్ అసోసియేషన్ అధ్యక్షులు బిజె గాంధీ, ఏజెసిఐఏ ఏపి ప్రధాన కార్యదర్శి విఎల్‌పి రాజు, ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయాల ఉపాధ్యాయ సంఘం ప్రధానకార్యదర్శి దామచర్ల మధుసూదనరావు, టిఆర్ఐటిఏ అధ్యక్షులు డి.లక్ష్మణరావు సందేశాలు ఇచ్చారు.

**మహాప్రదర్శన**

రాష్ట్ర మహాసభల సందర్భంగా 13వ తేదీ మధ్యాహ్నం విద్యా సదస్సు అనంతరం రాష్ట్ర నలుమూలల నుండి వచ్చిన వేలాదిమంది ఉపాధ్యాయులతో ఏలూరు నగర వీధుల్లో భారీ ప్రదర్శన నిర్వహించారు. మహాసభ ప్రాంగణం నుండి ప్రారంభమైన ర్యాలీ ఆర్టీసి బస్టాండ్, డిఇఓ, కలెక్టర్ కార్యాలయాల మీదుగా తిరిగి సభా ప్రాంగణానికి చేరుకుంది. ర్యాలీలో ఎమ్మెల్సీ బొడ్డు నాగేశ్వరరావు, ఎస్‌టిఎఫ్‌ఐ జాతీయ ప్రధానకార్యదర్శి కె.రాజేంద్రన్, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల ఎమ్మెల్సీ అభ్యర్థి రాము సూర్యారావుతోపాటు రాష్ట్ర నాయకులు ఐ.వెంకటేశ్వరరావు, పి.బాబురెడ్డి, కె.విజయగౌరి, ఎన్.నర్సింహులు, ఎస్.కె.సాబ్జీ, కె.ఎస్.ఎస్.ప్రసాద్, ఎన్.తాండవకృష్ణ, ఎన్.సోమచంద్రా రెడ్డి, ఎం.వెంకటేశ్వరరెడ్డి, జిల్లా అధ్యక్షులు ఎస్.శ్రీకాంత్ తదితరులు పాల్గొన్నారు. ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షిం... కుందాం, కార్పొరేటీకరణ వ్యతిరేకిద్దాం, యుటియఫ్ జిందాబ... ఎస్‌టిఎఫ్‌ఐ జిందాబాద్ లాంటి నినాదాలతో హోరెత్తించిన ర... నగర ప్రజల్ని ఆకట్టుకుంది.

### ఎమ్మెల్సీగా రాము సూర్యారావుని గెలిపించుకుందాం

యుటియఫ్ రాష్ట్ర మహాసభల్లో త్వరలో జరగనున్న ఎమ్మెల్సీ ఎన్నికల్లో ఉభయగోదావరి జిల్లాల ఉపాధ్యాయ నియోజకవర్గం నుండి పోటీ చేస్తున్న రాము సూర్యారావుని పరిచయం చేశారు. సూర్యారావు సిఆర్ రెడ్డి కళాశాల ప్రిన్సిపాల్‌గా రిటైరయినారు. నిత్యం ప్రజాసేవ కార్యక్రమాల్లో ఉంటూ, తన జీతం, పెన్షన్ ఎక్కువ భాగం పేద విద్యార్థుల చదువుకు సహాయం చేసిన మానవతావాది. రాము సూర్యారావుని గెలిపించుకుందామని మహాసభలకు విచ్చేసిన ఉపాధ్యాయులు, వివిధ ఉద్యోగ, ఉపాధ్యాయ, అధ్యాపక సంఘాలు, కాంట్రాక్ట్ లెక్చరర్ల సంఘాలు, గురుకులాల ఉపాధ్యాయ సంఘాల నాయకుల మద్ధతు ప్రకటించారు. ఉభయగోదావరి జిల్లాల నియోజకవర్గం ఎమ్మెల్సీగా కార్పోరేట్ శక్తులని కాకుండా ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడేవారిని గెలిపించు కుందామని ముక్తకంఠంతో ప్రకటించారు.



### 40వ రాష్ట్ర కౌన్సిల్ సమావేశం

డిసెంబర్ 13వ తేదీ సాయంత్రం 6 గంటల తర్వాత నూతన రాష్ట్ర కౌన్సిల్ సమావేశం రాష్ట్ర అధ్యక్షులు ఐ.వెంకటేశ్వరరావు అధ్యక్షతన ప్రారంభం అయ్యింది. వివిధ జిల్లాల నుండి ఎన్నికైన రాష్ట్ర కౌన్సిలర్‌లు 200కు 186మంది హాజరైనారు. ప్రారంభంలో ప్రకాశం జిల్లా గిద్దలూరు మండల సహాధ్యక్షులు ఎన్.బాలరమేష్ మృతికి సంతాపం తెలియజేశారు.

నూతనంగా ఏర్పడిన 13 జిల్లాల ఆంధ్రప్రదేశ్‌లో 96వేలు సభ్యత్వం చేర్పించడంతోపాటు నిర్ణయించుకున్న షెడ్యూల్ ప్రకారం జిల్లా కౌన్సిల్ సమావేశాలు నిర్వహించిన వారందరికి అభినందనలు తెలిపారు. నూతనంగా ఎన్నికైన వారంతా రాబోవు సంవత్సరకాలంలో అంకితభావంతో సంఘ అభివృద్ధికి కృషి చేయాలని అధ్యక్షులు పిలుపునిచ్చారు.

సంఘం నివేదికను రాష్ట్ర ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి ప్రవేశ పెట్టారు. గత సంవత్సరకాలంగా అంతర్జాతీయంగా, జాతీయంగా రాష్ట్రంలో జరిగిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిణామాలతోపాటు, ఈ మధ్య కాలంలో విద్యారంగంలో వచ్చిన మార్పులు వివరిస్తూ పాఠశాల విద్య ప్రమాదంలో పడిందన్నారు. గత రెండు సంవత్సరాలుగా వచ్చిన రాష్ట్ర విభజన ఉద్యమాల్లో సంఘాన్ని కాపాడుకోవడంలో కార్యకర్తలు ఎంతో కృషి చేశారన్నారు. విభజన ఉద్యమాల వల్ల స్వతంత్ర పోరాటాలు పెద్దగా లేకపోయినా జూన్ 2 తర్వాత ఏర్పడిన నూతన రాష్ట్రంలో ఉపాధ్యాయ సంఘాల ఐక్యవేదికగా ఫ్యాప్టో ఏర్పాటు మంచి పరిణామం అన్నారు. ఇందుకు యుటియఫ్ తనవంతు పాత్ర పోషించిందన్నారు. అన్ని స్థాయిల్లో సంఘ నిర్మాణాలు పటిష్టం చేసుకోవాలని, ఆర్థిక క్రమశిక్షణ పాటించాలన్నారు. స్థానిక సమస్యలపై పోరాటాలు చేపట్టాల న్నారు. ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణకు విద్యావికాస ఉద్యమాన్ని పాఠశాల స్థాయి వరకు తీసుకెళ్ళాలని అన్ని శాఖలు దాన్ని ప్రధాన కర్తవ్యంగా తీసుకోవాలన్నారు.

ఎయిడెడ్, మున్సిపల్ టీచర్ల సమస్యలతోపాటు పండిట్, పిఇటిల అప్‌గ్రేడేషన్ సమస్యలు పట్ల రాష్ట్ర ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుం దన్నారు. కొత్త సిలబస్, పరీక్షా విధానం, పనివేళల మార్పు, డిసిఇబిలు రద్దు లాంటి ఏకపక్ష నిర్ణయాలతో విద్యా సంవత్సరం తీవ్ర గందరగోళంలో పడింది. ఫ్యాప్టో ఆధ్వర్యంలో రెండు దశల పోరాటాలు చేశాము. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు అన్ని సమస్యల పట్ల మంచి తోడ్పాటు నందించారు. సమస్యల పరిష్కారానికి పోరాటాలు కొనసాగించాల్సిందన్నారు. కోశాధికారి ఎన్.తాండవకృష్ణ ఆర్థిక నివేదికను, ఆడిట్ కమిటీ కన్వీనర్ బి.వి.రమణమూర్తి ఆడిట్ నివేదికను, ఐక్యఉపాధ్యాయ సంపాదకులు సిహెచ్.సుభాష్‌చంద్రబోస్ పత్రికా నివేదికను ప్రవేశ పెట్టారు.

నివేదికలపై జరిగిన చర్చల్లో మురళీమోహన్, సిహెచ్.రవీంద్ర (శ్రీకాకుళం), జాజులు (విశాఖ), శేషగిరి (విజయనగరం), రాఘవులు, కోటేశ్వరరావు (తూర్పుగోదావరి), ప్రకాశరావు, శ్రీకాంత్ (పశ్చిమ గోదావరి), మనోహర్, రమేష్ (కృష్ణా), హనుమంతరావు, మల్లేశ్వర రావు (గుంటూరు), కె.శ్రీనివాసరావు, పి.రమణారెడ్డి (ప్రకాశం), కె.పరంధామయ్య, సిహెచ్.శ్రీహరి (నెల్లూరు), సోమశేఖర్ నాయుడు, గుణశేఖర్‌రెడ్డి (చిత్తూరు), లక్ష్మీరాజా, ఓబుల్‌రెడ్డి (కడప), కె.సురేష్ (కర్నూలు), జిలానీ, కోటేశ్వరప్ప (అనంతపురం) మహిళల తరపున అరుణ (తూర్పుగోదావరి) చర్చల్లో పాల్గొన్నారు.

**తీర్మానాలు :**

1. విద్యాహక్కు చట్టం 3-18 వయసు గల వారికి వర్తింప జేయాలి. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి 1:20గా సవరించాలి. మధ్యాహ్న భోజన పథకంలో విద్యార్థికి రూ.10/-లు కేటాయించాలి. జిడిపిలో 6%, కేంద్ర బడ్జెట్‌లో 10% నిధులు కేటాయించాలి.
2. 60% ఫిట్‌మెంట్‌తో 01.07.2013 నుండి ఆర్థిక లాభంతో అమలయ్యేలా వెంటనే పీఆర్‌సీని ప్రకటించాలి.
3. ఉమ్మడి సర్వీస్‌రూల్స్ రూపొందించి ఖాళీగా ఉన్న డిప్యుటీఇఓ, ఎంఇఓ, జూనియర్ లెక్చరర్ పోస్టులు ప్రమోషన్ల ద్వారా భర్తీ చేయాలి.
4. ఉన్నత పాఠశాలలోని పండిట్, పిఇటి పోస్టులన్నిటిని స్కూల్ అసిస్టెంట్స్‌గా అప్‌గ్రేడ్ చేయాలి. 11,12 జిఓలను సవరణ చేయాలి. ప్రకటించాలి.
5. స్పెషల్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలి.
6. పనివేళలు సవరించి అందరికి ఆమోదయోగ్యమైన నిర్ణయం తీసుకోవాలి.
7. ఉపాధ్యాయినులు, ఉద్యోగినులకు 2 సం॥ శిశు సంరక్షణ సెలవును మంజూరు చేయాలి. ఉద్యోగినుల అత్తమామలను హెల్త్‌కార్డులలో డిపెండెంట్‌గా అనుమతించాలి. మార్చి 8న ఉపాధ్యాయినులకు ఆన్ డ్యూటీ సౌకర్యం కల్పించాలి.
8. మున్సిపల్ శివారు ప్రాంతాలలో కొత్త పాఠశాలలను ప్రారంభించాలి. ఉపాధ్యాయులకు ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలు తెరుచుటకు అవకాశం ఇవ్వాలి. సర్వీస్ రూల్స్ వెంటనే ప్రకటించాలి.

9. సిపిఎస్ మొత్తాలను డిడిఓలకు స్పష్టమైన ఉత్తర్వులు ఇస్తూ ఆయా ఉపాధ్యాయులకు చెల్లించాలి. సిపిఎస్ ఖాతాలకు జమ గాని మొత్తాలను ఉపాధ్యాయుల ఖాతాలకు జమ అయ్యేలా చర్యలు తీసుకోవాలి.

10. కౌన్సిలింగ్ నిబంధనలకు విరుద్ధంగా ఇచ్చిన ప్రభుత్వ బదిలీలను ఈ కౌన్సిల్ ఖండిస్తూ తీర్మానించనైనది.

11. ఎంప్లాయిస్ హెల్త్‌స్కీమ్‌పై ప్రభుత్వం స్పష్టమైన విధానాలు ప్రకటించి అన్ని కార్పోరేట్, ప్రైవేట్ ఆసుపత్రులు అనుమతించేలా చర్యలు తీసుకోవాలి.

11. ఆదర్శ పాఠశాలల ఉపాధ్యాయులకు తక్షణమే సర్వీస్ రూల్స్ రూపొందించాలి. అరియర్స్ వెంటనే మంజూరు చేయాలి. ఖాళీ పోస్టులను వెంటనే భర్తీ చేయాలి. హెల్త్‌కార్డులు మంజూరు చేయాలి. సిపిఎస్ విధానం వర్తింపజేయాలి. ఏపి జిఎల్ఐ, విద్యార్థులకు యూనిఫామ్స్, రవాణా సౌకర్యం కల్పించాలి. అసంపూర్తి భవనాల నిర్మాణం వెంటనే పూర్తి చేయాలి.

12. ఎయిడెడ్ పాఠశాలల్లో ఖాళీలను భర్తీ చేయాలి. స్కూల్ అసిస్టెంట్స్ ప్రమోషన్లు కల్పించాలి. ప్రతినెలా ఒకటవ తేదీన జీతాలు చెల్లించాలి. విద్యార్థులకు ఏకరూప దుస్తులు అందించాలి. యాక్ట్ 37/2005ను ప్రాస్పెక్టివ్‌గా అమలు జరపాలి. రిటైర్మెంట్ వయస్సు 60 సం॥ పెంచుతు ఉత్తర్వులు ఇవ్వాలి. హెల్త్‌కార్డులు మంజూరు చేయాలి.

రాష్ట్ర కౌన్సిల్‌నుద్దేశించి సీనియర్ నాయకులు డి.రామిరెడ్డి మాట్లాడుతూ యుటియఫ్ కార్యకర్తలు సమాజంలో పరిణామాలు విద్యారంగంపై ఎలా ఉన్నాయో అధ్యయనం చేయాలన్నారు. విద్యావికాస ఉద్యమం ద్వారా ప్రభుత్వరంగాన్ని రక్షించుకోవాలని, పాఠశాలలు దత్తత తీసుకొని ఆదర్శంగా నడపాలని పిలుపునిచ్చారు. జిల్లాల కార్యదర్శులు అందరూ హైస్కూల్స్‌లో తిరగాలి, కౌన్సిలింగ్ విధానాన్ని కాపాడుకోవాలి, మహిళా కార్యకర్తల్ని కార్యక్రమాల్లో పాల్గొనేట్లు ప్రోత్సహించాలి, ఉద్యమ చరిత్ర తెలుసుకొని ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళాలని అన్నారు.

**టిఎస్‌యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎ.నర్సిరెడ్డి సందేశం**

పాలకవర్గాల రాజకీయ నిర్ణయంతో రాష్ట్ర రెండుగా విభజన జరగడంతో అనివార్యంగా మనం రెండు కమిటీలుగా ఏర్పడాల్సి వచ్చింది. రాష్ట్రాలు రెండు అయినా పాలక వర్గాల స్వభావం ఒక్కటే. రెండు రాష్ట్రాల్లోనూ పాఠశాల విద్య సంక్షోభాన్ని ఎదుర్కొంటుంది. విద్యలో నాణ్యత తగ్గుతుంది. పాఠశాల విద్య అధిక లాభాలు వచ్చే రంగంగా మారడంతో కార్పొరేట్ సంస్థలు రంగప్రవేశం చేశాయి. ఉపాధ్యాయ సమస్యలు పెరుగుతున్నాయి. ఈ ప్రమాదాలని ఎదుర్కోవాలి. అందుకనుగుణంగా మన ఉద్యమాన్ని నిర్మించాలి. ప్రభుత్వరంగంలో పాఠశాల విద్యను రక్షించుకోవాల్సిన కర్తవ్యం నేటి ఉపాధ్యాయ ఉద్యమంపై ఉన్నదని అన్నారు.

**ముగింపు సందేశం :** రాష్ట్ర కౌన్సిల్ సమావేశాన్ని ఉద్దేశించి పిడిఎఫ్ డిప్యూటీ ఫ్లోర్ లీడర్ వి.బాలసుబ్రహ్మణ్యం మాట్లాడారు. యుటియఫ్ కార్యకర్తలు సామాజిక స్పృహతో పనిచేయాలని, సమాజంలో వచ్చే పరిణామాలు, పాలకవర్గాల నిర్ణయాలు విద్యారంగం మీద తీవ్ర ప్రభావం చూపుతున్నాయి. అవి ఉపాధ్యాయుల జీవితాలపై కూడ పడతాయి. అభివృద్ధికి కీలకమైనది విద్య. విద్యారంగంలో పనిచేస్తున్న యుటియఫ్ సమాజాభివృద్ధిలో భాగస్వాములు కావాలి. ప్రజలతో మమేకం అయి పనిచేయాలి. ఆర్థిక పోరాటాలే గాక విద్యారంగం బలోపేతం చేయడానికి విద్యావికాస కార్యక్రమాన్ని అమలు చేయాలి. ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి స్వతంత్ర కార్యక్రమాలతో పాటు ఐక్య ఉద్యమాలు చేసే దిశగా కర్తవ్యాలు, ప్రణాళికలు రూపొందించు కోవాలన్నారు.

## కవిత

### బడి పిలుస్తోంది

– ఆర్.సురేష్, కూచివాడ, ఎస్‌పిఎస్ఆర్ నెల్లూరు

పల్లవి : తరలిరండి.... తరలిరండి... పిల్లల్లారా
చదువుకునే వయసు మీది బాలల్లారా
మన ఊరు పిలుస్తోంది, మన బడి పిలుస్తోంది
తరలిరండి... తరలిరండి.... పిల్లల్లారా

చరణం : ముద్దుముద్దు మాటలతో బడిలోకే అడుగులు
అక్షరాల్ని నేర్పించే ఎన్నెన్నో పాటలు
విజ్ఞానం, వినోదమే రేడియో పాఠాలు
శారీరక మేలుకే ఆడుకునే ఆటలు ॥తరలిరండి॥

చరణం2 : విద్య విలువ తెలుసుకో, నీ విలువ పెంచుకో
విరివిగా విషయాలు బడిలోనే నేర్చుకో
క్రమశిక్షణ, ఐకమత్యం అందరితో పంచుకో
విద్య పట్ల నిర్లక్ష్యం కొందరికి ఎందుకో ॥తరలిరండి॥

చరణం3 : చిన్నారుల చేతుల్లో పలకలే అందాలు
ఉండరాదు... ఉండరాదు, కార్ఖానా పనిముట్లు
పిల్లలంతా బడిలోనే చదువుతూ పెరగాలి
బాలకార్మిక వ్యవస్థే సమూలంగా నశించాలి

కోరస్ : అందరూ చదవాలి.... అందరూ ఎదగాలి
అనేదే నినాదం... ప్రభుత్వ విధానం

### నూతన రాష్ట్ర కమిటీ

**రాష్ట్ర ఆఫీసు బేరర్లు :** గౌరవాధ్యక్షులు ఎన్.నర్సింహుడు, అధ్యక్షులు ఐ.వెంకటేశ్వరరావు, సహాధ్యక్షులు కె.విజయగౌరి, ఎన్.వెంకటేశ్వర్లు, ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి, కోశాధికారి కె.సంజీవరెడ్డి.

**కార్యదర్శులు :** కె.ఎస్.ఎస్.ప్రసాద్, ఎన్.సోమచంద్రారెడ్డి, సి.చంద్ర శేఖర్, కె.శ్రీనివాస రావు, ఎం.రామకృష్ణ, ఎం.రాము, జి.గిరిధర్, పి.లీల, ఎస్.జయప్రభ.

**ఆడిట్ కమిటీ :** కె.సత్తిరాజు (కన్వీనర్), సభ్యులు : కె.కృష్ణమూర్తి, బి. మాణిక్యంశెట్టి, మహ్మద్‌గౌస్.

**ఐక్యఉపాధ్యాయ :** పి.బాబురెడ్డి (ప్రధానసంపాదకులు), సభ్యులు : ఐ.వెంకటేశ్వరరావు, సిహెచ్.సుభాష్‌చంద్రబోస్, ఎన్.కుమార్ రాజా, టిఎస్ఎల్ఎన్ మల్లేశ్వరరావు, సిహెచ్.శ్రీహరి.

80 మందితో కూడిన రాష్ట్ర కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికయ్యింది.

# ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడేవారినే శాసనమండలికి ఎన్నుకుందాం

శాసనమండలి పునరుద్ధరణ సమయంలో విద్యారంగం పట్ల, ఉపాధ్యాయ, అధ్యాప కుల సమస్యల పట్ల సమగ్ర అవగాహన కలిగి పరిష్కారానికి నిజాయితీగా కృషి చేసే వారిని ఎమ్మెల్సీలుగా ఎన్నుకోవాల్సిన అవసరం ఉందని యుటియఫ్ భావించింది. అలాంటి వారినే బలపర్చింది. వారే పిడిఎఫ్ బృందంగా ఏర్పడి నేడు శాసనమండలిలో ఉపాధ్యాయుల, అధ్యాపకుల సమస్యల పరిష్కారానికి తోడ్పాటునిస్తూ, సంఘాలకు, ఉద్యమాలకు సహకారం అందిస్తున్నారు. విద్యారంగంలో వస్తున్న పరిణామాల పట్ల స్పష్టమైన అవగాహనతో ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ కోసం, శాసనమండలి వేదికగా కృషి చేస్తున్నారు.

ఉపాధ్యాయ సంఘాలు, అధ్యాపక సంఘాల పోరాటాల్లో ప్రత్యక్షంగా పాల్గొంటున్నారు. రాష్ట్రంలో అప్రెంటీస్ విధానం రద్దు కోసం కాంట్రాక్ట్ లెక్చరర్ల జీతాలు పెంపుదల కోసం ఆమరణ నిరాహారదీక్షలు చేపట్టి విజయం సాధించారు. గురుకులాల్లో పనిచేస్తున్న సిఆర్‌టిల రెగ్యులర్ చేయుటకు కృషి చేయడంతోపాటు ఎయిడెడ్ టీచర్ల, అధ్యాపకుల 60 సం॥ల రిటైర్మెంట్ వయస్సు ఉత్తర్వుల సాధనలో వారి కృషి ప్రధానమైనది. గత పీఆర్‌సీలు మెరుగైన స్కేళ్ళు, అప్రెంటీస్ నోషనల్ ఇంక్రిమెంట్లు సాధన, మున్సిపల్ పాఠశాలలకు పోస్టుల మంజూరు, 010 హెడ్‌తో జీతాల సాధన వంటి విజయాలు వారి సహకారం ఎంతో ఉంది. ప్రాథమిక పాఠశాలల నుండి యూనివర్శిటీల వరకు బోధన, బోధనేతర సిబ్బంది సమస్యల పరిష్కారానికి శాసనమండలి వేదికగా ఉపయోగించుకోవడంతోపాటు నిజాయితీగా పారదర్శకంగా ఉండడమే పిడిఎఫ్ ఎమ్మెల్సీల ప్రత్యేకత. పేదలకు ఇళ్ళ స్థలాలు ఇవ్వని ప్రభుత్వాలు ఎమ్మెల్సీలుగా ఎన్నికైన వెంటనే కోట్లాది రూపాయాలు విలువచేసే ఇంటి స్థలాన్ని కేటాయించింది. ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకించి ఇంటి స్థలాలు నిర్ద్వందంగా తిరస్కరించింది. పిడిఎఫ్ ఎమ్మెల్సీలు మాత్రమే కావడం గమనార్హం. అలాంటి వారిని ఎమ్మెల్సీగా గెలిపించినందుకు ఓటర్లు సైతం గర్వపడుతున్నారు.

ఈ నేపథ్యంలో త్వరలో ఉపాధ్యాయ రెండు నియోజకవర్గాలలో ఎమ్మెల్సీ ఎన్నికలు జరుగనున్నాయి. కృష్ణా, గుంటూరు నియోజకవర్గంలో పిడిఎఫ్ ఎమ్మెల్సీల్లో ఒకరైన కెఎస్ లక్ష్మణరావు గారిని మరోసారి బలపరచాలని, అలాగే తూర్పు, పశ్చిమగోదావరి నియోజకవర్గంలో పిడిఎఫ్ ఎమ్మెల్సీల విధానాలతో, లక్ష్యాలతో వారిలాగే నిజాయితీగా ప్రభుత్వ విద్యారంగానికి అండగా నిలిచే వ్యక్తిగా శ్రీ రాము సూర్యారావు గారిని బలపరచాలని యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గం నిర్ణయించింది. ఉపాధ్యాయులు, అధ్యాపకులు, సోదర సంఘాలు, విద్యావంతులు, విజ్ఞతతో ఆలోచించి, నీతి నిజాయితీలకు విలువనిచ్చి, నిస్వార్థంగా విద్యారంగం, ఉపాధ్యాయుల సమస్యల పట్ల పోరాడే వారినే గెలిపించాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయాలు, విద్యారంగంలో తీవ్ర మార్పులు తేనున్నాయి. క్లస్టర్ స్కూల్స్ ప్రయోగంతోపాటు, పట్టణ / నగరాల పాఠశాలలు కార్పోరేట్ వారికి అప్పజెప్పే ప్రయత్నాలు జరుగుతున్నట్లు సమాచారం. తమ విధానాల అమలుకు అడ్డు అనుకుంటే విద్యాహక్కు చట్టాన్ని సైతం సవరించాలని కేంద్రం అంటోంది. ఈ నేపథ్యంలో జరుగుతున్న ఎమ్మెల్సీ ఎన్నికల్లో ప్రభుత్వ విద్యారంగాన్ని బలపరిచేవారిని గెలిపించాలని యుటియఫ్ విజ్ఞప్తి చేస్తోంది.



## రాము సూర్యారావు

**ఉభయ గోదావరి జిల్లాల ఉపాధ్యాయ శాసనమండలి నియోజకవర్గ అభ్యర్థి**

రాము సూర్యారావు గారు సర్ సిఆర్ రెడ్డి కళాశాల, ఏలూరు లెక్చరర్‌గా, ప్రిన్సిపాల్‌గా పనిచేసి 2007లో రిటైర య్యారు. 1973 నుండి 2007 వరకు 34 సం॥లు అధ్యాపక వృత్తికి అంకితమై పని చేశారు.

తన సర్వీసు ద్వారా లభించిన జీతభత్యాలు మొత్తం వెచ్చించి "సిద్ధార్థ ఎడ్యుకేషన్ నీడ్స్" ట్రస్టు ఏర్పాటుచేసి వేలాది బడుగు, బలహీనవర్గాల పేద పిల్లలు చదువుకునే ఏర్పాటు చేశారు. మరోపక్క ఎయిడెడ్ అధ్యాపక సంఘంలో జిల్లా స్థాయి బాధ్యతలు చేపట్టి సమస్యల పరిష్కారానికి కృషి చేశారు. రిటైరైన తర్వాత కూడా వారి సేవలు కొనసాగిస్తూనే, ప్రజా రోగ్యాన్ని కాంక్షించి పనిచేస్తున్నారు.

వారి సేవలు, ఆశయాలు గుర్తించి విద్యాభివృద్ధి కాంక్షించే పలు ఉపాధ్యాయ, అధ్యాపక సంఘాలు, మిత్రులు, శిష్యులు, శ్రేయోభిలాషులు మద్దతు తెలుపుతున్నారు.

పాలకుల విధానాలు ప్రభుత్వ విద్యారంగాన్ని బలహీన పరుస్తున్నాయి. ప్రభుత్వ విద్యారంగం లేకపోతే బడుగు, బలహీన వర్గాలకు విద్య అందకుండా పోతుంది. అభివృద్ధి చెందిన దేశాలలోలాగా ప్రాథమిక, సెకండరీ విద్య ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడు కోవాలనే లక్ష్యంతో పోరాడుతున్న పిడిఎఫ్ ఎమ్మెల్సీల తో కలసి పని చేయాలని నిర్ణయంతో పోటీచేస్తున్న రాము సూర్యారావు గారిని గెలిపించుకుందాం.



## కె.ఎస్.లక్ష్మణరావు

**కృష్ణా, గుంటూరు జిల్లాల ఉపాధ్యాయ శాసనమండలి నియోజకవర్గ అభ్యర్థి**

కె.ఎస్.లక్ష్మణరావు గారు గతంలో రెండుసార్లు టీచర్ ఎమ్మెల్సీ గా గెలిపొందారు. పిడిఎఫ్ బృందంలో సభ్యునిగా ఉద్యోగ, ఉపాధ్యాయ, అధ్యాపక, విద్యార్థి, కార్మిక సంఘాల ఉద్యమాల కు తోడుగా నిలిచారు. అందరికీ అందు బాటులో ఉండే వ్యక్తిగా, నిజాయితీగా పనిచేశారు.

అప్రెంటీస్ విధానం రద్దు కోసం 8 రోజులు ఆమరణ నిరాహారదీక్ష చేశారు. ఎయిడెడ్ టీచర్ల, అధ్యాపకుల 60 సం॥ల రిటైర్మెంట్ వయస్సు ఉత్తర్వుల సాధనలో వారు ప్రత్యేక కృషి చేశారు. నూతన సిలబస్‌తో ఉపాధ్యాయుల్లో ఏర్పడిన గందరగోళం తొలగించేందుకు అనేక చోట్ల శిక్షణా తరగతులు నిర్వహించడమే గాక, ప్రత్యేక సిడిలు తయారుచేయించి ఉపాధ్యాయులకు అకడమిక్ విషయం లో సైతం సహకారం అందించి, రాజకీ యాలకు, సంఘాలకు అతీతంగా పనిచేస్తూ అనునిత్యం ప్రజలకు అందు బాటులో ఉంటూ ప్రజా ఉద్యమాలకు సైతం అండగా నిలిచారు.

ఉద్యోగ, ఉపాధ్యాయ, అధ్యాపక, కాంట్రాక్టు అవుట్ సోర్సింగ్ సంఘాలు మద్దతుతో మరోసారి పోటీ చేస్తున్న కె.ఎస్.లక్ష్మణరావుని ఎమ్మెల్సీగా గెలిపించుకుందాం. ప్రభుత్వ విద్యా రంగాన్ని కాపాడుకుందాం!

## ప్రథమ ప్రాధాన్యత ఓటు (1) వేసి గెలిపించ విజ్ఞప్తి




# చిరస్మరణీయుడు
# మల్లవరపు రాయన్న

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ గుంటూరు జిల్లా ఉద్యమ నిర్మాతల్లో ప్రముఖులు, సీనియర్ నాయకులు మల్లవరపు రాయన్న (84 సం॥) డిసెంబర్ 13న అమరులైనారు. గత కొంతకాలంగా శ్వాస సంబంధిత వ్యాధితో చికిత్స పొందుతూ మరణించారు.

**వ్యక్తి నుంచి ఉద్యమ శక్తిగా మారిన కా॥ రాయన్న జీవిత ఘట్టాలు:**

1931లో అమరావతి మండలం, అత్తలూరులో జన్మించిన రాయన్న గ్రామంలోనే ప్రాథమిక విద్యను పూర్తిచేసుకొని, ఫిరంగి పురంలో హైస్కూల్ విద్యను, హిందూ కాలేజీలో ఇంటర్ విద్యను, ఫిరంగిపురంలో సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్ (1953-55)ను పూర్తి చేశారు. 1956లో అత్తలూరు ఆర్‌సిఎం పాఠశాలలో ఉపాధ్యాయునిగా చేరారు.

టీచర్ ట్రైనింగ్ చేసే సమయంలో విశాల భావాలతో సమాజాన్ని పరిశీలించే క్రమం మొదలైంది. ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా లాంటి అస్థిత్వ వాదాలను వ్యతిరే కించటం, భూస్వాముల పెత్తందారీ తనాన్ని ప్రశ్నించడం దానికి వ్యతిరేకంగా పోరాడటం కన్పిస్తాయి. అలా మొదలైన ఆయన జీవన పోరాటం మరణించే వరకూ కొనసాగుతూనే ఉన్నది. రాయన్నను అక్రమంగా బదిలీ చేసిన సమయంలో ఆయన చూపిన తెగువ నేటి ఉపాధ్యాయులకు మంచి స్ఫూర్తి. 9 సం॥ల 6 నెలలు జీతం లేకుండా చేసినా అదరని, బెదరని ఆయన ధైర్యం, తిరిగి ఉద్యోగం తెప్పించింది.



ఉపాధ్యాయ ఉద్యమంలో ప్రవేశించిన కా॥ రాయన్న చెన్నుపాటి నాయకత్వాన గల ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్‌లో చేరి తాళ్ళూరులో సమితి శాఖ ప్రధానకార్యదర్శిగా, గుంటూరు జిల్లాశాఖ కార్యదర్శుల్లో ఒకరుగా పనిచేశారు. చెన్నుపాటి మరణానంతరం వచ్చిన వేర్పాటు ఉద్యమాల నేపథ్యంలో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌లో (1974 ఆగస్టు 10న) చేరి గుంటూరు జిల్లా సంఘాన్ని నిర్మించడంలో కీలక భూమిక పోషించారు. 700 సభ్యత్వంతో ప్రారంభమైన సంఘ సభ్యత్వం నేడు 10వేలకు చేరింది. 1975 సం॥ నుంచి 1999 యుటియఫ్ రజతోత్సవాల వరకు ఆయన యుటియఫ్ పూర్తి కాలపు కార్యకర్తగా పనిచేశారు. జిల్లా సంఘానికి 1976-79, 1980-84, 1993-94 మధ్య అధ్యక్షులు గా పనిచేశారు. సమాజం బాగుపడనిదే ఉపాధ్యాయుడు బాగుపడడు అని, సమాజ సంక్షేమంలోనే ఉపాధ్యాయుని సంక్షేమం ఉన్నదన్న చెన్నుపాటి లక్ష్యాన్ని సాధించడమే ధ్యేయంగా యుటియఫ్‌ను నిర్మించారు. సామాజిక సమస్యల పరిష్కారం రాజకీయాల ద్వారానే సాధ్యమవుతుందని అవగాహన చేసుకొన్న కా॥ రాయన్న వామపక్ష ఉద్యమాల ప్రేరణతో అసమానతలు లేని సమాజ నిర్మాణానికి తన వంతు కృషి చేశారు.

పదవీ విరమణ తరువాత కూడా ఆయన ఖాళీగా కూర్చొని ఎరగడు, పెన్షనర్స్ అసోసియేషన్‌లో పనిచేశారు. వృధాప్యం కారణంగా ఇంటికే పరిమితం అవటమో లేక ఆధ్యాత్మికవైపో కాకుండా ఈ సమాజం మారాలి అనే వైపు ఆయన ప్రయత్నాలు కొనసాగాయి. "మల్లవరపు రాయన్న ఆత్మకథ" అనే పేరుతో ఆయన రాసిన గ్రంథం జిల్లా ఉపాధ్యాయ ఉద్యమాన్ని మనముందు ఉంచుతుంది.

ఈ రోజు జిల్లాలో ఉన్న నాయకత్వం మొత్తం ఆయన మార్గదర్శకత్వంలో తయారైనదే. ఆయన సహచర్యంలో పనిచేసిన అనేకమంది ఉపాధ్యాయులు ఆయన పని విధానం గురించి చెబుతుంటే ఎంత నైరాశ్యంలో ఉన్న వారిలోనైనా నూతన ఉత్తేజాన్ని తెప్పించకమానదు. ప్రపంచవ్యాప్తంగా వస్తున్న అనేక మార్పులు విద్యారంగం మీద, ఉపాధ్యాయుల మీద ప్రతికూల ప్రభావం చూపుతున్న నేటి కాలంలో రాయన్న గారి లాంటి క్రమశిక్షణ, నిబద్ధత కలిగిన, ఒక పరిణితి కలిగిన ఉపాధ్యాయ నేత మరణం ఉపాధ్యాయ ఉద్యమాలకు పూడ్చలేని లోటు. ఆయన చూపిన, నడిచిన మార్గాన్ని అర్థం చేసుకొని ఆ బాటలో ప్రయాణిస్తూ ఆయనకు నివాళి అర్పిద్దాము.

**అంతిమయాత్ర :** డిసెంబర్ 13న ఉపాధ్యాయుల సందర్శ నార్థం రాయన్న పార్థివ దేహాన్ని యుటియఫ్ కార్యాలయంలో మధ్యాహ్నం వరకు ఉంచడం జరిగింది. అనంతరం వారి నివాసమైన పలకలూరు రోడ్డులోని గృహానికి తరలించి, మహాప్రస్థానంలో అంత్యక్రియలు నిర్వహించడం జరిగింది. రాయన్న అంత్యక్రియల్లో యుటియఫ్ సీనియర్ నాయకులు మాజీ ఎమ్మెల్సీ డి.రామిరెడ్డి, సీనియర్ నాయకులు ఎంఏకె దత్తు, రాష్ట్ర కోశాధికారి ఎన్.తాండవకృష్ణ పాల్గొని నివాళులర్పించారు.

రాయన్నగారికి నివాళులర్పించిన ప్రముఖులు యుటియఫ్ రాష్ట్ర పూర్వ అధ్యక్షులు కె.జోజయ్య, శాసన మండలి సభ్యులు కెఎస్ లక్ష్మణరావు, యుటియఫ్ సీనియర్ నాయకులు టి.అంజిరెడ్డి, వి.విశ్వనాథం, వై.ఎల్.నారాయణ, టి.శ్రీనివాసరావు, వై.భాస్కరరావు, ఎం.వెంకటరత్నం, జి.కోటేశ్వర రావు, ఏపిటిఎఫ్ (257) నాయకులు నేతాంజనేయులు, ప్రసాద్, ఏపిటిఎఫ్ (1938) నాయకులు, తెలుగునాడు టీచర్స్ యూనియన్ నాయకులు, సిపిఎం పార్టీ జిల్లా ప్రధానకార్యదర్శి పాశం రామారావు, ఐద్వా నాయకులు డి.రమ, సిపిఐ నాయకులు ముప్పాళ్ళ నాగేశ్వర రావు, ఎస్‌టిఎఫ్ఐ నాయకులు జి.ప్రభుదాస్, యుటియఫ్ జిల్లా నాయకులు కె.నాగమల్లేశ్వరరావు, ఎం.హనుమంతరావు, జిల్లా ఆఫీస్‌బేరర్స్, జిల్లాలోని వివిధ ప్రాంతాల నాయకులు, కార్యకర్తలు, సిఐటియు, ఎల్ఐసి, ఎండిఎం, అంగన్వాడీ తదితర ప్రజా సంఘాల నాయకులు హాజరై నివాళులర్పించారు.

# బడుగులకు బడులు పెట్టిన స్ఫూర్తి ప్రదాయిని తొలి భారతీయ ఉపాధ్యాయిని సావిత్రీభాయిపూలే

(సావిత్రీభాయి పూలే జనవరి 3 జయంతి సందర్భంగా...)

భారతదేశంలో అనేకమంది సంఘ సంస్కర్తలలో సావిత్రీ భాయి పూలే ఒకరు. అంతేకాదు దేశంలో తొలి ఆదర్శ ఉపాధ్యాయిని. ఈమె జీవితం అన్ని కోణాల నుండి ఆదర్శనీయం. ఆనాడు ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాలలో జాతి విముక్తి పోరాటాలు ఉధృతంగా జరుగుతున్నాయి. స్త్రీల సమగ్ర అభివృద్ధి కోసం అన్ని వర్గాల మహిళలు విముక్తికోసం ఉద్యమాలు మరోవైపు జరుగుతున్నాయి. సామాజిక దాడి, ఆర్థికదాడి స్త్రీ అస్థిత్వాన్ని నాశనం చేసే కుట్ర జరుగుతున్న రోజులవి.

దేశంలో బ్రిటీష్‌వారి పాలన ప్రజలను అష్టకష్టాలపాలు చేసింది. ఆనాటి ప్రజల స్థితి గతులు, విద్య, సాంఘిక దురాచారాలు, సతీ సహగమనం, బాల్య వివాహాలు సావిత్రీబాయిని కదిలించాయి. అప్పటికే రాజారామ్మోనరాయ్, ఈశ్వర చంద్ర, జ్యోతిరావుపూలే, కందుకూరి వంటి వారి కృషి, తపన, ఉద్యమాలు స్త్రీల పరిస్థితులలో మార్పులకు ప్రేరణ కలిగించాయి.



కె.విజయగౌరి
యుటియఫ్ సహాధ్యక్షులు

మహారాష్ట్రలో సతారా జిల్లాకు చెందిన నయ్‌గావ్‌లో 1831వ సంవత్సరం జనవరి 3వ తేదీన సావిత్రీబాయి జన్మించింది. ఈమెది కూడా బాల్య వివాహమే. ఆమె వివాహం ప్రముఖ సంఘ సంస్కర్త అయిన జ్యోతిరావు పూలేతో జరిగింది. బ్రిటీష్ ఇండియాలో ఆయనొక సామాజిక విప్లవ కారుడు. వివాహానంతరం సావిత్రీబాయికి విద్యాభ్యాసం చేసి ఉపాధ్యాయ శిక్షణ ఇప్పించారు జ్యోతిరావు పూలే. చదువు ఒక్కటే ఈ సమాజాన్ని మార్చ గలదని నమ్మిన వ్యక్తి. సాంఘిక దురాచారాల చెర నుండి బయట పడాలంటే విద్య అవసరమని సావిత్రిబాయి గుర్తించింది.

1. **కులవ్యవస్థ నిర్మూలనే కర్తవ్యంగా :** కులవ్యవస్థ నిర్మూలనకు, పీడిత ప్రజానీకం పట్ల ఆమె మనసులో ఆలోచనలను గుర్తించిన జ్యోతిరావుపూలే బాలికల పాఠశాల ప్రారంభించడానికి ప్రయత్నం చేశారు. చదువుతోపాటు స్త్రీల అస్తిత్వాన్ని నిలబెట్టడానికి తన శక్తి సామర్థ్యాలను వినియోగించింది. పరాయి పాలనలో ఉన్న దేశంలో పీడిత ప్రజలను సంఘటిత పరచి బానిస పీడన నుండి విముక్తి కోసం చేసే కృషితో పాటు స్త్రీలకు మానవ హక్కులు ఉండాలని గళంవిప్పిన దంపతులు వారు. నేటి సమాజం లో ఆర్థిక వెసులు బాటుకు వేడినీళ్లకు చన్నీళ్లు అంటారు, ఆ దంపతులు సమసమాజం కోసం, పీడన విముక్తి కోసం వేన్నీళ్లకు చన్నీళ్లు.

**ఆనాటి విద్య**

బ్రాహ్మణ పిల్లల కోసం కొందరు పండితులు నడిపే వీధి బడులు, వర్తకులకు, ధనవంతులైన రైతుల పిల్లలకు చదువునేర్పే గ్రామ బడులు ఉండేవి. అగ్రవర్ణ బ్రాహ్మణాధిక్య ధోరణులు కఠినంగా ఉండేవి. శూద్రులు, అతిశూద్రుల సామాజిక, ఆర్థిక స్థితిగతులు భయంకరం. దళితుల ఉద్ధరణ కోసం సత్యశోధక సమాజ్‌ను ఏర్పాటు చేశారు. కులమత వ్యత్యాసాలు తీవ్రంగా ఉండేవి. మహర్, మాంగ్ కులస్థుల వారికి చదువు ఉండేదికాదు. బానిస, పేద బతుకులు. మహమ్మదీయులకు భాష సమస్య ఉండేది. అసలు బాలికలు చదువుకోవటానికి ఎక్కడా అవకాశం లేదు ఆనాటి సమాజంలో.

2. **సమాజ పరిస్థితుల అధ్యయనమే ప్రేరణ :** 1848వ సంవత్సరంలో మహారాష్ట్రలోని పూనేలో ఒక ఇంట్లో బాలికల పాఠశాలను ప్రారంభించింది. ఆమె ప్రధానోపాధ్యాయినిగా 9మంది పిల్లలతో బడి నడిపేది. ఆ బడి 6 నెలలు మాత్రమే కొనసాగింది. కొన్ని నెలల తరువాత మరొక భవనంలో ప్రారంభించింది. ఈ పాఠశాల నడపటం ఉన్నత, అగ్రవర్ణాలకు నచ్చలేదు. ఈ నేపథ్యం లో సావిత్రిబాయిపై వేధింపులకు, భౌతికదాడులకు పూను కున్నారు. పాఠశాలకు నడిచేదారిలో ఆమెపై బురద చల్లడం, రాళ్లు విసరడం, అసభ్య పదజాలాన్ని వాడటం వంటివి చేశారు. దీనికి మత ఛాందసులు నాయకత్వం వహించారు. బురదతో మలినమైన చీరను పాఠశాలకు వెళ్లిన తరువాత మార్చుకుని, మరల వచ్చేటప్పుడు బురద చీరను కట్టుకుని వచ్చేది. ఎవరికైనా "ధైర్యంగా నా విధిని నేను నిర్వహిస్తున్నాను" అని చెప్పేది. అయినా రోజూ వేధింపులకు విసిగి ఒకరోజు ఒకడి చెంప పగులకొట్టింది. కొన్నాళ్లకు సహనం తగ్గి ధైర్యం సన్నగిల్లడం గమనించిన భర్త జ్యోతిరావుపూలే అండగా నిలిచాడు. రక్షణగా ఒక బంట్రోతును ఏర్పాటు చేశాడు.

పట్టువీడక వారు సాగించిన విద్యా ఉద్యమానికి తక్కువ కాలంలోనే సహకారం, గుర్తింపు లభించాయి. ఒక ముస్లిం వ్యక్తి తన ఇంటిని బడికి కేటాయించాడు. కొంతమంది పుస్తకాలు సేకరించారు. మోరో విఠల్, వాల్వేకర్, దియోరావ్ వంటి ప్రముఖులు పాఠశాల నిర్వహణకు పూర్తిగా సహకరించారు. 1851లో మరల పాఠశాల ప్రారంభించారు. బాలికల చదువుకోసం, విద్యాభివృద్ధి కోసం సహకరించాలని దేశానికి విజ్ఞప్తి చేసింది. ఈ కృషిని గుర్తించిన ఆనాటి ప్రభుత్వం 1851 నవంబర్ 16న విద్యాశాఖ ఆధ్వర్యంలో శాలువాలతో ఘనంగా సత్కరించింది. అప్పటి పర్యవేక్షణ అధికారులు బాలికా విద్యపై వ్యతిరేకభావం తగ్గు తుందని, టీచర్లు విద్యార్థులను ప్రేమిస్తున్నారని అందువలన బాలికలు విద్యపై ఆసక్తి పెంచుకుంటున్నారని ప్రకటించారు.

3. **ఉత్కృష్టమైన సామాజిక కార్యకర్త :** తన జీవితాన్ని త్యాగం చేసి విద్యాబోధనకు, బాలికలకు అంకితమైంది. రచయిత్రిగా కావ్య పూలే, అభంగ్, ప్రకృతి కవితలతోపాటు, సామాజిక జానపద అంశాలను తన కవిత్వంలో చూడవచ్చు. భారతదేశ చరిత్రను

ఉపన్యసించే సంపుటాలుగా రాసింది. స్త్రీలను పురుషులతో సమానంగా చూడాలని, మూఢవిశ్వాసాలను దూరంగా పారద్రోలితే మహిళల అక్షరాస్యతకు ఆటంకం ఉండదని జానపద కళారూపాలను రూపొందించింది. సాంఘిక దురాచారాలపై పెద్దలతో ఘర్షణ పడవలసి వచ్చినా బెదరలేదు. వితంతువులకు శిరోముండనం చేయబోమంటూ క్షురకులను చైతన్యవంతులను చేసింది. అనాథ స్త్రీలకు, పిల్లలకు శరణాలయాలు, ఆశ్రమాలు ఏర్పాటు చేయించింది. సత్యశోధక సమాజపు మహిళా విభాగాన్ని ఏర్పాటు చేసి కులాంతర, వితంతు వివాహాలు జరిపించింది.

1890లో భర్త జ్యోతిరావుపూలే మరణిస్తే, అంత్యక్రియలు జరిపే సందర్భంలో బంధువులు, దత్తపుత్రులు ఘర్షణ పడుతుంటె తానే చితికి నిప్పు అంటించి అంత్యక్రియలు పూర్తిచేసింది. ఆమె తెగువకు యావత్ భారతదేశము దిగ్భ్రాంతి చెందింది. పురోహితులు లేకుండానే వివాహాలు జరపడం సాహసకార్యం ఆనాడు. భర్త ఆశయాలతో గళం కలిపి, స్వతంత్ర వ్యక్తిత్వంతో, అత్యంత ధైర్యశాలిగా ఆయన అడుగు జాడల్లో నడిచి దాంపత్య జీవితం ఇదే అనే సందేశాన్ని భారత మహిళలకు అందజేసింది. ఆమె దగ్గర చదువుకున్న బాలికలు విశాల భారతదేశంలో కుల, వర్ణ, మతతత్వానికి వ్యతిరేకంగా ఉద్యమాల్లో పాల్గొని వ్యతిరేకించారు. ఆమె అదే ఆశించింది.

ఇక్కడ ఒక మాట చెప్పాలి, సావిత్రి భర్త జ్యోతిరావు స్వాతంత్ర్యం రావడానికి 120 సంవత్సరాలకు పూర్వం, అంబేద్కర్ పుట్టుక కంటె కాస్తముందు మరణించారు. కుల,మత వ్యత్యాసాలు నశించాలని తన జీవితాన్నంతా ఆ పోరాటానికే అంకితం చేశాడు. తన చరిత్రను అధ్యయనం చేసిన అంబేద్కర్ తన మాటల్లో నాకు ముగ్గురు గురువులు అందులో ఒకరు పూలే. మిగతా ఇద్దరు బుద్ధుడు, కబీరు అన్నారు.

4. **సామాజిక సేవలో అంతిమశ్వాస :** 1890వ దశకంలో ప్లేగువ్యాధి బారినపడిన పిల్లలకోసం 2వేలమంది పిల్లలకు భోజనాలు పెట్టించింది. 1897వ సంవత్సరం, మార్చి 10న ఒక పిల్లవాడికి సేవ చేస్తుండగా ఆమెకు ఆవ్యాధే సోకి మరణించింది. క్రాంతి బాయిగా ప్రజలందరు పిలుచుకునే సావిత్రిబాయి పూలే ఆధునిక భారతదేశ చరిత్రలో ధృవతారగా వెలుగొందుతూనే ఉంటుంది. ఉద్యమాల్లో ప్రధానపాత్ర పోషించడం ఉపాధ్యాయులకు ప్రధాన కర్తవ్యమని ప్రబోధించింది.

అంతేకాదు విద్యా వ్యవస్థకు సూచనలు చేసింది. 1881లో లార్డ్ రిప్పన్, హంటర్ అధ్యక్షతన విద్యా కమిషన్‌ను నియమించేటప్పుడు మాతృభాషలో విద్య ఉండాలని, శూద్ర, అతిశూద్ర కులాల వారికి పాఠశాలలు పెట్టాలని, పేదరికం వల్ల దిగువ కులాల పిల్లలకు 12 సం॥ల వయసు వరకు ఉపకార వేతనం మంజూరు చేయాలని, మహర్, మాంగ్ (గిరిజన తెగ) కులస్థులకు ప్రత్యేక పాఠశాలలు పెట్టాలని, 3 నెలలకు ఒకసారి పర్యవేక్షణ, ఉపాధ్యాయులకు శిక్షణ వంటివి హంటర్ విద్యా కమిషన్‌లో చేర్చాలని ప్రతిపాదనలను పూలే దంపతులు సమర్పించారు. విద్యావ్యవస్థ పట్ల, విద్య సమాజానికి దారిచూపే తీరు పట్ల వారికి ఎంతో స్పష్టత ఉండటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఉపాధ్యాయులంతా పూలే దంపతుల చరిత్రను అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

5. **నేటి ప్రభుత్వాల పాత్ర ఏమిటి? :** ఆనాటి సావిత్రిబాయి త్యాగాల



ఫలితంగా బాలికా విద్య, వర్ణవ్యవస్థ నిర్మూలన, కులతత్వం, మతతత్వంనకు వ్యతిరేకంగా చేసిన పోరాటం, అట్టడుగు వర్గాల వారికి బడులు పెట్టి విద్యనందించటం, సమాన మానవ హక్కులు నినాదంగా చేసిన కృషి ఫలితంగా స్వాతంత్ర్యం రాక మునుపు బ్రిటీష్ పాలకుల ఎజెండాలో, స్వాతంత్ర్యం వచ్చాక మన దేశ రాజ్యాంగంలో పై అంశాలన్నింటికీ చట్ట భద్రత కల్పించాలని, సమసమాజం కావాలని జ్యోతిరావుపూలే, సావిత్రిబాయి పూలే ఆశించారు. వారికృషి ఫలితమే నేటి సాంఘిక సంక్షేమ పాఠశాలలు, గిరిజన పాఠశాలలు, బాలికల పాఠశాలలు. కాని నేటికి కులవ్యవస్థ విద్య అభివృద్ధికి ఆటంకంగానే ఉంది. బడుగు వర్గాల పిల్లలు చదువుకు దూరంగా ఉన్నారు. రాజ్యాంగపరమైన హక్కులు కాలరాయబడుతున్నాయి. ఆనాడు మన దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం లేకపోయినా ప్రగతిశీల భావాలతో, అధికారం చేతిలో లేకపోయినా పాఠశాలలు పెట్టించారు, కుల వ్యవస్థపై పోరాడారు. విద్యాకమిషన్‌లు వేయించారు. నేడు మన దేశ పగ్గాలు మన పాలకుల చేతుల్లో ఉన్నా రాజ్యాంగానికి విరుద్ధమైన అంశం కుల వివక్షతను అరికట్టలేక పోతున్నారు. పాఠ్య పుస్తకాలలో మతోన్మాద ధోరణులు సృష్టిస్తున్నారు. బడుగు బలహీనవర్గాలకు సంస్కరణల పేరుతో చదువుకు దూరం చేస్తున్నారు. ఇవన్నీ సమాజాభివృద్ధికి ఆటంకాలని పరాయి పాలనలోనే గుర్తించాము. ఇటువంటి అవశేషాలన్నీ ఎందుకు కొనసాగుతున్నాయి? అంటె అవి పాలకుల విధానాలని చెప్పక తప్పదు.

ఇంత ప్రగతిశీల భావాలను సమాజానికి అందించిన సావిత్రి బాయి పూలే జీవిత చరిత్ర యావత్ భారతదేశానికి తెలియజేయాల్సిన కర్తవ్యం పాలకులపై ఉంది. స్త్రీలు చదువు నేర్చుకోవడమే అరుదైన కాలంలో బాలికల పాఠశాలలో విద్య నేర్పడానికి తన భార్య సావిత్రిని విద్యావంతురాలిని చేసి భారత దేశానికి తొలి భారతీయ ఉపాధ్యాయు రాలిని అందించారు జ్యోతిరావుపూలే. ఆమె ఆదర్శనీయత పాఠశాల విద్యారంగానికి ఎంతో అవసరం. కనుకనే ప్రభుత్వం జాతీయ మహిళా ఉపాధ్యాయ దినోత్సవంగా సావిత్రి బాయి పూలే జయంతిని (జనవరి 3) ప్రకటించడం ఎంతైనా అవసరం.

**శ్రమించి పనిచేయండి!**
**శ్రద్ధగా అధ్యయనం చేయండి!!**
**మంచి మార్గంలో నడవండి!!**
**"మనసుల నిండుగా నివాళులర్పిద్దాం, మార్పుకి దగ్గరవుదాం"**

(చరిత్రపుటలు, సావిత్రిబాయి జీవిత విశేషాల సంపుటాల నుండి సేకరించిన విషయాల ఆధారంగా ఈ వ్యాసం)




# గణతంత్ర దేశంలో సమస్యల ఘంటారావాలు!

భారత్ నూతన రాజ్యాంగాన్ని రచించుకుని గణతంత్ర రాజ్యంగా అవతరించింది. రాజ్యాంగం ద్వారా దేశంలో వంశపాలనకు చోటు లేదు.... అందరికీ పదవులు..... అందరి అభివృద్ధి లక్ష్యంగా భారత్ రాజ్యాంగం ద్వారా పురోగమిస్తుందని.... రాజ్యాంగం ద్వారా పరాయి పాలనలో పడిన కష్టాలన్నీ కడతేరతాయని ప్రజలు ఆశించారు. కాని మర్నాడన్నీ ఎప్పటి లాగానే ఉన్నాయి కాని ఏ మార్పులేదు. అభివృద్ధి స్వల్పం. సమస్యలు అనేకం.

**సమస్యల సుడిగుండాలు :** దేశాభివృద్ధి పరిస్థితి ఎంత ఆశావహంగా వున్నా సమస్యల సుడిగుండాలు కూడా ఇబ్బడి ముబ్బడిగా పెరిగాయి. నేటికీ దేశ ప్రధాని, రాష్ట్రపతి బుల్లెట్ ప్రూఫ్‌ల మధ్య సందేశాలిస్తూ. అభద్రతను చాటుతున్నారు. కాశ్మీరు సమస్య రావణకాష్టంలా రాజుతూనే వుంది. అందరికీ విద్య అందనంత దూరంలో వుంది. బాల కార్మికులుగా బాలలు తమ బాల్యాన్ని తాకట్టుపెడుతున్నారు. బాల కార్మిక చట్టాలు అయినవారి చుట్టాలుగా మిగిలిపోయాయి. ఫలితంగా అధికారిక లెక్కల ప్రకారం దేశంలో 45 లక్షల బాలకార్మికులు ఉన్నారు. బడి మొహమెరుగని 1.3 కోట్ల బాలల్లో అత్యధికులు బాల కార్మికులే. దేశంలో యేటా లక్షమంది బాలలు అదృశ్యమవుతున్నారు. దేశంలో అయిదేళ్లలోపు బాలల్లో 20% పిల్లలు పోషకాహార లోపంతో అనేక రోగాల బారిన పడుతున్నారు. సకాలంలో సరైన వైద్యం అందక దేశంలో ఒక్క యేడాదే 63 లక్షల పిల్లలు కళ్లు తెరిచిన అయిదేళ్లలోపే కన్నుమూశారు. దేశంలో బాలల మీద జరుగుతున్న లైంగిక దాడులు పెరిగిపోతున్నాయి. 2001-2011 మధ్య దశాబ్ద కాలంలో దేశంలో బాలల మీద లైంగిక దాడుల సంఖ్య 336% పెరిగింది. 2012లో 9500మంది బాలలు, యువకులు హింసకు బలయ్యారు. ఇక బడుల్లో విద్యా ప్రమాణాలు ఆశాజనకంగా లేవు. మూడో తరగతికి వచ్చిన తరువాత కూడా తప్పుల్లేకుండా ఒకటో క్లాసు పుస్తకం చదవ గలిగిన పిల్లలు కేవలం 59% మాత్రమే. ఇక ఇంజనీరింగ్ లాంటి వృత్తి విద్యా కోర్సుల్లో ప్రమాణాలు నానాటికి దిగజారిపోతున్నాయి. సైన్స్‌పట్ల యువతలో ఆసక్తి తగ్గిపోతున్నది. మరి పడే భారత్.... బడే భారత్‌గా భారత్ ఎదిగేది ఎన్నడు?



జి.సి.మధుసూదనరావు
నెల్లూరు జిల్లా

**డోంట్ టచ్ మీ :** భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 17 అంటరాని తనం, కులరహిత సమాజంగా దేశాన్ని పేర్కొంది. కానీ నేటికీ ప్రతి నలుగురిలో ఒకరు అంటరాని తనాన్ని సమర్థిస్తున్నారని ఓ సర్వే పేర్కొంది. ఈ సర్వే వారు 42వేల గృహాలలో సర్వేచేస్తే 27% అంటరాని తనాన్ని పాటిస్తున్నారు. అది తమ వ్యక్తిగతం అంటూ ధీమాగా చెబుతున్నారు. రిజర్వేషన్ల వలన సమర్థులకు ఉద్యోగాలు రావడం లేదు అంటూ చెప్పడం ఆందోళన కల్గిస్తోంది. ఈ వివక్షత ఉత్తరభారత దేశంలో అధికం. మరి ఈ వివక్ష సమసిపోవాలంటే మనలో మార్పు రావాలి... మరి ఆ మార్పు ఎప్పుడు?



**భారత నారీ కష్టాలు తీరేదెన్నడో? :** భూమి, ఆర్థిక, విద్య, మార్కెటింగ్ రంగాల్లో పురుషులతో సమానంగా స్త్రీలు అవకాశం పొందడం లేదు. దేశంలో ప్రతి 26 నిమిషాలకు మహిళపై అసభ్య ప్రవర్తన. 34 నిమిషాలకు ఆత్యాచారం. 42 నిమిషాలకు లైంగిక వేధింపులు, 43 నిమిషాలకు మహిళలు అపహరణ, 93 నిమిషాలకు వరకట్న వేధింపులు, అగ్నికి ఆహుతి. ఇక జరిగే 10 అత్యాచారాల్లో ఆరు బాలికల పైనే. ఇందులో 97.3% తెలిసినవారే. 1.3% సమీప బంధువులు, 6.3% బంధువులు, 36% ఇరుగుపొరుగు వారు. ఇక లింగ వివక్షత చెప్పనలవికాదు. ఆడపిల్ల భారంగా నేటికీ చదువుకున్న వ్యక్తులే భావించడం ఆందోళన కల్గిస్తోంది. అందుకే ప్రపంచంలో లింగ వివక్షతలో మన దేశ స్థానం 136. ఇటీవల ఐక్యరాజ్య సమితి దేశంలో సర్వేచేస్తే 60% భారతీయ పురుషులు భార్యల్ని కొడుతుంటామని చెబితే, 52% మహిళలు ఏదో ఒక రూపంలో హింసను ఎదుర్కొంటున్నామని వెల్లడించారు. మహిళలకు ఎన్నికల్లో సీట్లు కేటాయించినప్పటికి వారి భర్తల, బంధువులదే అధికారంగా వుంటున్నది.. గెలిచిన 70% మహిళా ప్రతినిధులలో వారి భర్తలు లేదా రక్త సంబంధీ కులదే పెత్తనం.

**ప్రజాస్వామ్యం ! :** దేశంలో ప్రజాస్వామ్యం కొన్ని కుటుంబాల వారసుల చేతిలో రాజకీయ చట్రంలో వుండటం విచారకరం. సామాన్యులకు నేటి ఎన్నికలు ఖరీదైపోయాయి. రిజర్వేషన్లు అమలులో వున్న నియోజక వర్గాలలో సామాన్యులకు పోటీచేసే వీలుంది కాని, మిగతా నియోజక వర్గాలలో ధనవంతులు, కుల ప్రాబల్యం ఎక్కువ వున్న వారే నిలబడు తున్నారు. ఈ స్థితి మారాలి. నిస్వార్థవ్యక్తులు రాజకీయాల్లోకి రావాలి. వారిని ప్రజలు ఆదరించాలి. మరి ఆ రోజు ఎప్పుడో?

**అందరికీ వైద్యం - అందేది ఎన్నడు ? :** దేశంలో నేటికీ అందరికీ ఆరోగ్యం అందమైన స్వప్నమే. దేశంలో సాలీనా 115 మిలియన్‌ల మంది అంటువ్యాధులకు గురవుతున్నారు. సరైన వైద్యం అందక పోవడం వల్ల పలువురు అకాల మృత్యువాత పడుతున్నారు. గుండె జబ్బులతో బాధపడే వారు 50 మిలియన్‌లు, మధుమేహవ్యాధి ఉన్నవారు 63 మిలియన్లు, క్యాన్సర్‌కు గురవుతున్న వారు 1.2 మిలియన్లు. గుండెపోటుకు గురవుతున్న వారు 1.7లక్షలు. ఇలా అనారోగ్య బాధితులు ఎందరో. వీరికి అందుబాటు లో వైద్యులు లేరు. నిధులు లేవు. మన పాలకులు మాత్రం జాతీయస్థూల ఉత్పత్తిలో ఒక శాతమే కేటాయిస్తున్నారు. ఈ నిధుల్లో సిబ్బంది జీతభత్యాలకే ఎక్కువ ఖర్చవుతున్నది. దేశంలో ప్రతి మూడు నిముషాలకు ఇద్దరు క్షయ వ్యాధితో మరణిస్తున్నారు. ఇక పిల్లలందరికీ టీకాలు అందుబాటులో లేవు. రేబిస్ నివారణ టీకాలు లేవు. మాతృ మరణాలు ఇంకా జరుగుతూనే ఉన్నాయి.

**నిరుపేదల్లో మూడోవంతు మనవాళ్లే :** 2010 నాటికి ప్రపంచంలోని 120 కోట్ల నిరుపేదల్లో మూడో వంతు భారత్‌లోనే నివసిస్తున్నారని 2014లో ఐక్యరాజ్య సమితి నివేదిక ద్వారా తెలుస్తుంది.



ప్రపంచ ఆకలి సూచీలో భారత్ స్థానం 55. దేశంలో దాదాపు 60% కుటుంబాలు 2012 నాటికి కూడా మరుగుదొడ్డి సౌకర్యం లేకుండా జీవిస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో 31.9%, పట్టణ ప్రాంతాల్లో 63.9% కుటుంబాల కు ప్రత్యేకంగా మరుగుదొడ్డి సదుపాయాలున్నవి. గ్రామీణ ప్రాంతాల్లో 50.2%, పట్టణాల్లో 21.1% కుటుంబాలు మంచినీటి కోసం దాదాపు అరకిలో మీటరు దూరం వెళ్ళాల్సి వస్తోంది. మంచిగాలి, వెలుతురు పరిశుభ్రంగా వచ్చే ఇళ్ళు కలిగిన కుటుంబాలు గ్రామీణ ప్రాంతంలో 26.3% ఉండగా, పట్టణాల్లో 47.1% ఉన్నాయి. అలాగే మెరుగు పరచిన డ్రైనేజీ సౌకర్యం కలిగిన కుటుంబాలు గ్రామీణ ప్రాంతాల్లో 31.7% ఉండగా, పట్టణాల్లో 82.5% ఉన్నాయి. మానవ అభివృద్ధి సూచీ ర్యాకింగ్‌లో భారత్ 134వ స్థానం నుంచి 136కు దిగజారింది. ఈ సూచీని మూడు ప్రాథమిక పరామితులు ఆధారంగా నిర్ణయిస్తారు. 1.దీర్ఘకాలం ఆరోగ్యవంతమైన జీవితం గడపడం. 2. విద్యావంతులై ఉండడం. 3. సరియైన ఆర్థిక ప్రమాణాలతో జీవించటం.

ఇక ప్రపంచంలో ఏ దేశంలో లేని విధంగా మన దేశం 35.6 కోట్ల మంది యువతతో తొణికిసలాడుతుంది. ఈ యువతకు సరియైన విద్య, ఉపాధి, వైద్య సేవలు అందుబాటులో లేకపోవడం విచారకరం. యువతకు సరియైన అవకాశాలు కల్పించి వారిని సమాజ, దేశాభివృద్ధిలో భాగస్వాములుగా చేసిననాడే “జయహొ యువ భారత్” అనగలం. దేశంలో అవినీతిని అరికట్టాలి. ఈనాడు వేలకోట్ల రూపాయలు విదేశీ బ్యాంకుల్లో ఎక్కడ లెక్కలు చూపక మూలుగుతున్నాయి. ఈ నల్లధనాన్ని దేశానికి తెచ్చిననాడే దేశాభివృద్ధి సాధ్యం. అవినీతి సూచికలో ప్రపంచంలో నేడు మన స్థానం 85.

**పర్యావరణ హాని:** అభివృద్ధి పేరిట దేశంలో అడవులను నిర్మూలిస్తున్నారు. నీటి, విద్యుత్ సదుపాయాలకై డ్యామ్‌లను నిర్మిస్తూ అడవులను నిర్మూలించడం వలన పర్యావరణానికి తీవ్ర విఘాతం ఏర్పడుతున్నది. ఫలితంగా ఋతువులు గతి తప్పాయి. విపరీతంగా ఎండలు పెరిగి పోతున్నాయి. నీటి ఎద్దడి తీవ్రమవుతున్నది. కాలుష్యం పెరిగి శ్వాస కోశ వ్యాధులు తీవ్రమవుతున్నాయి. పర్యావరణ విధ్వంసం కారణంగా దేశం ప్రతి సంవత్సరం 100 కోట్ల డాలర్ల మేరకు నష్టపోతున్నట్లు అంచనా. పట్టణ వాతావరణ కాలుష్యం వల్ల 130 కోట్ల డాలర్లు, నీటి ఎద్దడి, జల సంబంధ వ్యాధుల కారణంగా 570 కోట్ల డాలర్లు, భూమి కోతతో 240 కోట్ల డాలర్లు, అడవుల నాశనం వల్ల 21 కోట్ల డాలర్లు భారత్ కోల్పోతున్నది. ఇలా దేశంలో సమస్యలు అనేకం. ఈ సమస్యలు పరిష్కారం కావాలంటే అందరిలో మార్పులు రావాలి. పాలకులు చిత్తశుద్ధితో ప్రణాళికలు రచించాలి. విద్య, వైద్య రంగానికి నిధులు భారీగా పెంచాలి. ప్రభుత్వ అధికారులు అంకిత భావంతో, అవినీతిరహితంగా తమ బాధ్యతలు నిర్వహించాలి. విద్యార్థిలో చదువు పట్ల ఆసక్తి, సమాజం పట్ల మక్కువ, దేశం పట్ల గౌరవాన్ని, నిస్సహాయుల పట్ల చేయూత భావాన్ని అలవరచాలి. ఇలా అందరూ స్పందించిన నాడే రాజ్యాంగ నిర్మాతలు కలలుగన్న గణతంత్ర రాజ్యానికి సార్థకత.



**కథలు, కవితల పోటీలలో ప్రచురణకి ఎంపికైన కవిత**

## రేపటి కోసం

**-టి.వెంకటేశ్వర్లు**, మైదుకూరు, కడప జిల్లా

ప్రేటు ప్రేటుకు కన్నీరు కారుస్తున్న
మమ్ము నరకొద్దని ఆక్రందన చేస్తున్న
ఇది మీకే ముప్పు అని ఘోషిస్తున్న
మనుషుల కుత్తుకలను నరికే మాకు నువ్వెంత?!
అన్న తీక్షణంగా పచ్చటి వృక్ష సంపదను
ఇనుప గొడ్డలి పదును దెబ్బలకు బలి చేస్తుంటే
ఆ ఆవేదన రాదా మన పాలిట శాపమై
ఎటు చూసిన ఎడారి, వర్షపు చుక్కకు నోచుకోని ధరణి
నాకు పనీ, పాటా కరువై, పంట కూడా సగమై
నేను అప్పుడప్పుడు గోడక్రింద మంచం ఎక్కేస్తుంటా
కుక్కిమంచం కిర్రు కిర్రుమని రొదపెడుతుంటే
అందులోనే పడి మురిసిపోతుంటా
రవి తాకిడికి భూమి సెగలు కక్కుతుంటే
వెనుకా ముందా అని వచ్చే సినిమా వర్షాలు
తడిసీ, తడవని నేలతల్లీ, పేదవాని గుండె వెలసిపోతుంటే
నీళ్ళన్నీ తాగిన మేఘాల సమూహాలు
సినీ తారల్లా కనపడీ, కనపడనట్లు మాయమవుతుంటే
సెలమె తీసిన బావి అడుగు నీళ్ళు నోరూరిస్తుంటే
రేపటి సంగతి మర్చిపో, నేటి దప్పిక తీర్చుకోమంటుంటే
పడిన ప్రతీ చినుక్కి ఓ మొలక అందిస్తానని
మరీ ఆత్రంగా నేలతల్లి ఆకాశంవైపు చూస్తుంటే
కారు పంట ధాన్యం, మూణ్నాళ్ళ ముచ్చట్లకు చాలకుంటే
అప్పులకు జమక్రిందే గాదెలు ఖాళీ అవుతుంటే
రోజు రోజుకీ గుండె బరువును పెంచే
కూతరు పెళ్ళి సంవత్సరాలు దాటేస్తుంటే
“నా దెబ్బ చూడు” అని పిల్లోడి చదువులు సమ్మెట దెబ్బల్లా బాధేస్తుంటే
వీటన్నిటికీ తాళలేని నా గుండె
‘లబ్‌డబ్’మని అనలేక బావురుమని రోదిస్తుంటే
జీర్ణకోశాంతరాలు బీటలు పడిపోతున్నా
పదును చినుకుల కోసం నేలతల్లి పడిగాపులు కాస్తుంటే
రారా! వాన దేవుడా మమ్ము కరుణించు
అని దీనంగా పైకి చూస్తుంటే
పచ్చని చెట్ల ఉసురు పలు సంవత్సరాలు
పచ్చని చెట్లకు నిప్పు రగిల్చినందుకా ఈ శాస్తి
అటు నవ్వలేక ఏడ్వాలనుకొన్నా, ఏడ్వలేక నవ్వాలనుకొన్నా
అటు చావలేక, ఇటు బ్రతకలేక
బతుకు తెరువు కోసం ఉన్న ఊరు వదలాలనుకొన్నా
నే కన్న తండ్రీ నన్ను వదల వెళ్లకురా
నేల తల్లి పిలుపుకు పనివానిలా ‘ఊ’ కొడుతూ
రండి రేపటికోసం జీవం పోస్తా, భళ్ళున వర్షం కురిపిస్తా
పచ్చని పంటలు పండిస్తా, భవిష్యత్తుకు బాటను వేస్తా
బతుకును హాయిగా గడిపేస్తా....

# యుటియఫ్ ప్రాతినిధ్యాలు

### ఎన్.ఓ.సిల మంజూరు ఆర్‌జెడి/ డిఇఓలకు - బదలాయింపు

ఎన్.ఓ.సి.లు మంజూరు చేసే అధికారాలు ఆర్‌జెడి/డిఇఓలకు డెలిగేట్ చేయాలని అక్టోబర్ 27న పాఠశాల విద్య కమీషనర్ & డైరెక్టర్ వారికి ప్రాతినిధ్యం చేయడమైనది. ఆ మేరకు ఆర్.సి.నెం.438, తేది: 18.12.2014 ద్వారా గ్రేడ్-2 ప్రధానోపాధ్యాయులకు, మండల విద్యాశాఖాధికారులకు రీజనల్ జాయింట్ డైరెక్టర్ వారు, స్కూల్ అసిసెంట్లు, సెకండరీగ్రేడ్, పండితులు, పిఇటిలకు జిల్లా విద్యాశాఖాధి కారి వారు ఎన్‌ఓసి.లు మంజూరు చేయాలని ఆదేశాలు యివ్వడమైనది.

### జెడ్‌పి, పియఫ్ నిర్వహణ ట్రెజరీలకు అప్పగించాలి

మండల పరిషత్, జిల్లా పరిషత్ ఉపాధ్యాయులకు ప్రావిడెంట్ ఫండు నిర్వహణ జిల్లా పరిషత్ నుండి ట్రెజరీలకు బదలాయించాలని డిటిఎ మరియు ఆర్థిక శాఖ అధికారులతో పలుమార్లు చర్చించడమైనది. సానుకూలంగా ఉత్తర్వులు యిచ్చేదానికి ఫైలునడుస్తున్నది. వచ్చే ఆర్థిక సంవత్సరం నుండి అమలులోకి వచ్చే అవకాశం ఉంది. ప్రస్తుతం జిల్లా పరిషత్ సిఇఓ/అకౌంట్స్ ఆఫీసర్ ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న జిల్లా పరిషత్ లో నున్న పిడి అకౌంట్స్ (వ్యక్తిగత డిపాజిట్స్) అసలు, వడ్డీలతో పబ్లిక్ అకౌంట్స్‌కు బదలాయించాల్సి ఉంది. ట్రెజరీ నిర్వహణలోకిరావడం ద్వారా డిడిఓలు ఉపాధ్యాయుల లోన్స్, పార్ట్‌ఫైనల్, ఫైనల్ పేమెంట్స్ మంజూరు సులభతరమవుతుంది.

ఐ.వెంకటేశ్వరరావు, అధ్యక్షులు

### మున్సిపల్ ఉపాధ్యాయులకు పి.ఎఫ్ ట్రెజరీ ద్వారా నిర్వహించాలి

జిల్లా పరిషత్ / మండల పరిషత్ ఉపాధ్యాయులతోపాటు మున్సిపల్ ఉపాధ్యాయులకు కూడా ట్రెజరీ ద్వారా పిఎఫ్ నిర్వహించేదానికి ఆర్థిక శాఖ అనుమతించాలని ప్రాతినిధ్యం చేసాము. సానుకూలంగా ఫైలు నడుస్తున్నది. పది రకాల ప్రశ్నావళిపై వివరణ కోరుతూ సిడిఎంఎ నుంచి సమాచారం కోరియున్నారు. మున్సిపాలిటీలో ఉపాధ్యాయుల అసలు, వడ్డీలు వ్యక్తిగతంగా లెక్కించి ప్రభుత్వానికి జమచేయవలసి ఉంటుంది.

### విజయవాడ, విశాఖ ఉపాధ్యాయులకు ఎపిజిఎల్ఐ వర్తింపచేయాలి

విజయవాడ, విశాఖ కార్పోరేషన్ ఉపాధ్యాయులకు 010 ద్వారా జీతాలు పొందుతున్నందున ఎపిజిఎల్ఐ పథకాన్ని వారికి వర్తింప జేయాలని ఎపిజిఎల్ఐ డైరెక్టర్ జి.మణిశేఖర్ గారికి విజ్ఞప్తి చేశాము. దీనిపై ఆర్థిక శాఖకు ప్రతిపాదనలు పంపారు. ఆర్థిక శాఖ కార్యదర్శి ఎల్.ప్రేమ్‌చంద్రారెడ్డి గారితో చర్చించడమైనది. త్వరలో సానుకూలంగా ఉత్తర్వులు రానున్నాయి.

### మధ్యాహ్న భోజన పథకం బడ్జెట్ విడుదల చేయాలి

గత 4 నెలలుపైగా పెండింగ్‌లో ఉన్న మధ్యాహ్న భోజన పథకం బిల్లులు చెల్లింపుకు బడ్జెట్ విడుదల చేయాలని ప్రాతినిధ్యం చేయడమైనది. సుమారు 200 కోట్లు విడుదల చేస్తూ ఆదేశాలు ఇవ్వడమైనది.

### మున్సిపల్ సర్వీస్ రూల్స్‌పై సంఘాలతో చర్చించాలి

మున్సిపల్ ఉపాధ్యాయుల సర్వీసు రూల్స్ ఉపాధ్యాయ సంఘాలతో చర్చించి విడుదల చేయాలని మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ ముఖ్యకార్యదర్శి ఎ.గిరిధర్‌కు ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు ఐ.వెంకటేశ్వరరావు, పి.బాబురెడ్డిలు విజ్ఞప్తి చేశారు. జనవరి 2న ముఖ్యకార్యదర్శిని కలిసి ప్రస్తుతం నియామకాలు, ప్రమోషన్లు, బదిలీలకు మున్సిపాలిటీ యూనిట్‌గా ఉందని, జిఎడి వారు జిల్లా యూనిట్‌గా ఆమోదం తెలిపారని ఈ నేపథ్యంలో ఉపాధ్యాయ సంఘాలతో చర్చించి నిర్ణయం తీసుకోవాలని కోరగా త్వరలో ఉపాధ్యాయ సంఘాలతో చర్చిస్తామని హామీ ఇచ్చారు. సిడిఎంఎ ఆధ్వర్యంలో సర్వీసురూల్స్‌పై చర్చ సందర్భంగా ఎస్‌జిటి, స్కూల్ అసిస్టెంట్స్ యూనిట్ ఆఫ్ అపాయింట్‌మెంట్ మున్సిపాలిటీ యూనిట్‌గా ఉండాలి, ప్రధానోపాధ్యాయులకు జిల్లా యూనిట్‌గా నియామకాలు ఉండాలని చెప్పామన్నారు.

### ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 60 ఏండ్ల రిటైర్‌మెంట్ వయస్సు పెంపు - యుటియఫ్ హర్షం

ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 60 ఏండ్లకు రిటైర్‌మెంట్ వయస్సు పెంపుదల చేయాలని అనేక ప్రాతినిధ్యాలు యుటియఫ్, పిడియఫ్ ఎమ్మెల్సీల తరపున చేశాము. ఫలితంగా జనవరి 3 నుండి తిరిగి ఉద్యోగాల్లో చేరాలని ఉత్తర్వులు వచ్చాయి. గ్యాప్ పీరియడ్ జీతాలు చెల్లించాలని కోరినప్పటికీ లీవుగా పరిగణించాలని ఫైలులో పేర్కొన్నారు. ఈ కాలాన్ని ఇంక్రిమెంట్లు, పెన్షన్‌కు పరిగణించాలని ఆర్థిక శాఖతో ప్రాతినిధ్యం చేసాము. గత ఆరునెలలుగా చేసిన కృషి మేరకు ఉత్తర్వులు విడుదలైనాయి.

### ఆర్‌విఎం నిధులను నుండి ప్రశ్నపత్రాలు

సమ్మేటీవ్-2 ప్రశ్నపత్రాలు విషయమై ఫ్యాప్టో నేతలు ఐ.వెంకటేశ్వర రావు, పి.పాండురంగ వరప్రసాద్ డిసెంబర్ 11న పాఠశాల విద్యా కమీషనర్‌తో చర్చించడమైనది. 1 నుండి 8 తరగతులకు సమ్మేటీవ్ 2 ప్రశ్నపత్రాలకు అయ్యే ఖర్చు ఆర్వియం నిధుల నుండి ఖర్చు చేసుకోవాలని, 9, 10 తరగతుల ప్రశ్న పత్రాలకు అయ్యే ఖర్చు విద్యార్థి నుండి 15 రూపాయలు వసూలు చేసి పరీక్షలు నిర్వహించాలని డి.ఇ.ఓలకు ఆదేశాలు ఇచ్చినట్లు పాఠశాల విద్యా కమీషనర్ వి. ఉషారాణి తెలిపారు. జవాబులు విద్యార్థుల నోట్ పుస్తకాలలోనే వ్రాయాల్సి ఉందన్నారు. ఈ సంవత్సరం పరీక్షా పత్రాలకు డి.సి.ఇ.బికి చెల్లించిన సొమ్ము తిరిగి పాఠశాలలకు చెల్లించాలని ఆదేశించినట్లు కమీషనర్ తెలిపారు. ప్రభుత్వమే ప్రశ్నాపత్రాల ఖర్చుకు నిధులు ఇవ్వాలని కోరాము.

### ప్రభుత్వ విద్యారంగాన్నిపటిష్టపరచాలి

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) 2015 డైరీ, కేలండర్‌ను బుధవారం ఉదయం సచివాలయంలోని మంత్రి చాంబర్‌లో మానవ వనరుల శాఖామాత్యులు గంటా శ్రీనివాసరావు ఆవిష్కరించారు. ఈ సందర్భంగా యుటియఫ్ రాష్ట్ర అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు ఐ.వెంకటేశ్వరరావు, పి.బాబురెడ్డిలు మంత్రిగారికి శు భాకాంక్షలు తెలియజేస్తూ 2015 విద్యా సంవత్సరంలో ప్రభుత్వ విద్యా వ్యవస్థను పటిష్ట పరచాలని, ఆ దిశగా చర్యలు తీసుకోవాలని విజ్ఞప్తిచేశారు. 10వ వేతన సంఘం అమలుకు సంబంధించి గ్రూఫ్ ఆఫ్ మినిస్టర్స్‌లో సభ్యులుగా ఉపాధ్యాయులకు, ఉద్యోగులకు మంచి ఫిట్‌మెంట్ యిప్పించాలని విజ్ఞప్తి చేశారు. 2015 విద్యా సంవత్సరంలో ప్రభుత్వ విద్యారంగంలో మంచి ఫలితాలు సాధించాలని ఉపాధ్యాయు లందరికి యుటియఫ్ నేతలు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేశారు.

## మోడల్ స్కూల్ ఉపాధ్యాయులకు ఐఆర్, డిఏలు విడుదల

ఆంధ్రప్రదేశ్‌లోని మోడల్ స్కూల్ ఉపాధ్యాయులకు మధ్యంతర భృతి మరియు డిఏ చెల్లింపునకు పాఠశాల విద్యాశాఖ కమీషనర్ & డైరెక్టర్ కె.సంధ్యారాణి ఆర్‌సి నం.250/ఎ1/ఏపిఎంఎస్/1ఆర్/డిఏ/2014; తేది.02.02.2015 ద్వారా ఆదేశాలు జారీ చేయటం పట్ల ఏపిఎంఎస్‌టిఎఫ్ అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఆర్.ఈశ్వరరావు మరియు ఎన్.బోసుబాబులు హర్షం తెలియజేశారు. 2014 జనవరి నుండి మధ్యంతర భృతి మరియు డిఏ బకాయిలను చెల్లించాలని, ప్రసూతి మరియు పితృత్వ సెలవులకు సంబంధించిన జీతాల బకాయిలను విడుదల చేయాలని విజ్ఞప్తి చేశారు.

మోడల్ స్కూల్ ఉపాధ్యాయులకు తాత్కాలిక భృతి, మూడు విడతల డిఏలు చెల్లించాలని పాఠశాల విద్య కమీషనర్ మరియు ఆర్థికశాఖ అధికారులతో ఏపిఎంఎస్‌టిఫ్ నేతలు, యుటియఫ్ నాయకత్వం చేసిన కృషి వలన ఉత్తర్వులు వెలువడినాయి. ఫిబ్రవరి నెల జీతాలతో ఐఆర్, డిఏలు చెల్లించడం జరుగుతుంది.

## జూన్ 2కు ముందున్న అరియర్స్

రాష్ట్రంలో అన్ని మేనేజ్‌మెంట్లకు చెందిన ఉపాధ్యాయుల జూన్ 2కు ముందున్న అరియర్ బిల్లులు చెల్లించేందుకు మార్చి చివరి వరకు అనుమతించాలని ఆర్థికశాఖను కోరడమైనది. ఫిబ్రవరి 28 వరకు పొడిగిస్తూ ఆర్థికశాఖ ఉత్తర్వులు విడుదల చేసింది.

## హెల్త్‌కార్డులు అమలుకు రెండు రోజుల్లో చర్యలు డిసెంబర్ 10న జెఏసి కి సి.ఎం. హామీ.

ఆంధ్రప్రదేశ్ జాయింట్ యాక్షన్ కమిటి (జెఏసి) నేతలు ముఖ్యమంత్రి ఎన్.చంద్రబాబునాయుడుతో 10.12.2014 సాయంత్రం 5 గంటలకు సచివాలయంలో క్యాబినెట్ మీటింగ్ హాల్‌లో హెల్త్‌కార్డ్స్ అమలు, 10వ పిఆర్‌సి, ఎయిడెడ్ సిబ్బందికి రిటైర్‌మెంట్ వయస్సు 60 సంవత్సరాలు పెంపుదల, కాంట్రాక్టు ఉద్యోగుల రెగ్యులరైజేషన్, ఏసిబి కేసుల్లోనున్న రెండు సంవత్సరాలు పూర్తయిన వారికి పునర్ నియామకం తదితర అంశాలపై చర్చించడమైనది. హెల్త్‌కార్డులు అమలుకు నవంబర్ నుండి ఉద్యోగుల జీతాల నుండి ప్రీమియమ్ రికవరీలు జరుగుతున్నప్పటికీ హైదరాబాద్‌లో, ఆంధ్రప్రదేశ్‌లో అనేక ఆసుపత్రులు ప్యాకేజీ రేట్ల పేచీతో వైద్యాన్ని నిరాకరిస్తున్నాయని జెఏసీ నేతలు సి.ఎం.కు వివరించారు. దీనిపై ముఖ్యమంత్రి సీరియస్‌గా స్పందిస్తూ ఆరోగ్యశాఖామంత్రి, ఆరోగ్య శ్రీ అధికారులతో రెండు రోజుల్లో సమావేశం ఏర్పాటు చేసి హెల్త్ కార్డుల అమలుకు చర్యలు తీసుకుంటామని తెలియజేశారు. ఈలోగా మెడికల్ రియింబర్స్‌మెంట్, హెల్త్‌కార్డులు సమాంతరంగా అమలు చేయుటకు వెంటనే ఉత్తర్వులు ఇస్తామని సి.ఎం. తెలిపారు. 10వ పిఆర్‌సికి క్యాబినెట్ సబ్ కమిటీ వేశామని త్వరలో జెఏసీ నేతలతో కమిటీ చర్చిస్తుందని ముఖ్యమంత్రి అన్నారు. కాంట్రాక్టు కంటింజెంట్ ఉద్యోగుల రెగ్యులరైజేషన్‌పై త్వరలో కమిటీ నిర్ణయం తీసుకుంటుం దన్నారు. గత 6 నెలలుగా ఎయిడెడ్ సిబ్బందికి జీతంలేక, పెన్షన్ రాక ఆర్థిక ఇబ్బందులు పడుతున్నారని, వీరికి 60 ఏళ్ళ రిటైర్‌మెంట్ వయస్సు పెంపుకు కంటిన్యూయేషన్ ఉత్తర్వులు వెంటనే ఇవ్వాలని సెక్రెటరీ జనరల్ ఐ.వెంకటేశ్వరరావు కోరగా ఈ ఫైల్ వెంటనే తనకు పంపించాలని అధికారులను ఆదేశించారు. సెక్రెటేరియట్ నుండి ప్రభుత్వం నేరుగా ఉపాధ్యాయుల బదిలీలు చేయవద్దని గట్టిగా చెప్పాము. ఏసీబీ కేసుల్లో రెండు సంవత్సరాలు పూర్తయిన వారికి పునర్ నియామక ఉత్తర్వులు ఇప్పించాలని కోరగా పరిశీలించి నిర్ణయం తీసుకుంటామని సి.ఎం. హామీ ఇచ్చారు. సి.ఎం.తో జరిగిన చర్చలలో జెఏసీ ఛైర్మన్ పి.అశోక్‌బాబు, సెక్రెటరీ జనరల్ ఐ.వెంకటేశ్వరరావు, కో ఛైర్మన్‌లు బొప్పరాజు వెంకటేశ్వర్లు, కె.నరసింహారెడ్డి, పాండురంగ వరప్రసాద్, కమలాకరరావు, హృదయరాజు, డిప్యూటీ సెక్రెటరీ జనరల్ ఎన్.చంద్రశేఖరరెడ్డి కోశాదికారి వీరేంద్రబాబు, లూక్ తదితరులు పాల్గొన్నారు.

## పి.ఆర్.సి. అమలుకు జిఓఎం. జెఏసితో చర్చించాలి

10వ పిఆర్‌సి అమలుకు గ్రూఫ్ ఆఫ్ మినిస్టర్స్ (జిఓఎం) వెంటనే జె.ఎ.సి.తో చర్చలు ఏర్పాటు చేయాలని డిసెంబర్ 30న జెఏసి ప్రతినిధి బృందం ఆర్థిక శాఖామంత్రి యనమల రామకృష్ణుడుగారికి విజ్ఞప్తి చేయడమైనది. మంత్రి ఇంతవరకు నివేదిక పరిశీలించలేదన్నారు. నివేదిక రహస్యంగా ఉంచేది కాదని ఆర్థికశాఖ కార్యదర్శి నుండి వెంటనే నివేదిక యిప్పిస్తామన్నారు. జనవరి 3న జి.ఓ.ఎం. సమావేశమవుతాయని ఆ వెనువెంటనే జె.ఎ.సి.ని చర్చలకు పిలుస్తామని మంత్రి తెలియజేశారు. అక్టోబర్ 30న ముఖ్యమంత్రిగారు జి.ఓ.ఎం. వేస్తామని చెప్పారని, డిసెంబర్ 15న ఆమేరకు జి.ఓ.ఎం. ఏర్పాటైందని 15 రోజులు గడుస్తున్నా జెఏసిని చర్చలకు ఆహ్వానించలేదని నేతలు అసంతృప్తి వ్యక్తంచేశారు. సంక్రాంతికి పిఆర్‌సి అమలు చేయాలని జె.ఎ.సి. నేతలు డిమాండ్ చేశారు.

కాంట్రాక్టు ఉద్యోగుల గడువు పెంచాలని, వారిని వెంటనే రెగ్యులరైజేషన్ చేయాలని జె.ఎ.సి. నేతలు డిమాండ్ చేశారు. రెగ్యులరైజేషన్‌కు తమ ప్రభుత్వం కట్టుబడి ఉందని చెపుతూ సుప్రీంకోర్టు తీర్పు ఆటంకమవుతుందని మీమాంస వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా గతంలో వివిధ శాఖల్లో రెగ్యులరైజేషన్ చేసిన సందర్భాలు జె.ఎ.సి. నేతలు గుర్తుచేశారు. జె.ఎ.సి. ఛైర్మన్ పి.అశోక్‌బాబు, సెక్రెటరీ జనరల్ ఐ.వెంకటేశ్వరరావు, కో-ఛైర్మన్లు బొప్పరాజు వెంకటేశ్వర్లు, కె.నరసింహ రెడ్డి, ఎన్.రఘురామిరెడ్డి, హృదయరాజు, డిప్యూటీ సెక్రెటరీ జనరల్ ఎన్.చంద్రశేఖర్‌రెడ్డి కోశాధికారి వీరేంద్ర బాబు తదితరులు మంత్రిని కలిశారు.

## పిఆర్‌సి, హెల్త్‌కార్డులు ఇతర సమస్యలపై ఫిబ్రవరి 3న సి.ఎంతో జెఏసి చర్చలు

జెఏసి సెక్రెటేరియేట్ సమావేశం ఫిబ్రవరి 3న ఎపిఎన్‌జిఓ ఆఫీస్‌లో జరిగింది. సాయంత్రం సచివాలయంలో సిఎం ను కలిసి పలుసమస్యలు చర్చించడం జరిగింది. హెల్త్‌కార్డుల అమలుకు నోచుకోలేదని చెప్పగా, వారం రోజుల్లో ఈ సమస్య పరిష్కరించి చెప్పాలని ఆరోగ్య శ్రీ అధికారులను సిఎం ఆదేశించారు. పిఆర్‌సి అమలుకు జెఏసి నేతలతో మంత్రుల కమిటి ఒక్కసారి కూడా పూర్తిస్థాయిలో సమావేశం కాలేదని జెఏసి నేతలు చెప్పగా మంత్రుల కమిటీతో వెంటనే చర్చల ఏర్పాటు చేస్తామని చెప్పారు. ఉద్యోగుల 80 రోజుల సమ్మెకు ప్రత్యేక సెలవు మంజూరుకు ఫైల్ ఒక్కరోజులో తనకు పంపాలని ఆదేశించారు. విజయవాడ, విశాఖ మున్సిపల్ కార్పోరేషన్ ఉద్యోగులకు 60 ఏండ్ల పెంపుదల వర్తింపచేస్తామన్నారు. గురుకులాలు, సొసైటీ, గ్రంథాలయ, పబ్లిక్ సెక్టార్ ఉద్యోగులకు 60 ఏండ్ల పెంపుదల చేయాలని కోరగా పబ్లిక్ సెక్టార్‌కు అమలు చేయలేమన్నారు. పబ్లిక్ సెక్టార్ నష్టాల నుంచి బయటపడాలని, 65 ఏండ్లు పెంచుకున్నా అభ్యంతరం లేదని హితవు పలికారు. 12.05.2014కు ముందు కారుణ్య నియామకాలకు ధరఖాస్తు చేసుకున్న వారికి ఇంటర్మీడియేట్ అర్హత వర్తింపుకు ఉత్తర్వులిస్తామన్నారు. ప్రావిడెంట్ ఫండ్, మెడికల్ బిల్లులు అంత్యక్రియ బిల్లులు చెల్లింపుపై ఆంక్షలు ఎత్తివేస్తామని చెప్పారు.

## పిడిఎఫ్ ప్రాతినిధ్యాలు

**శా**సన మండలి సమావేశాలు నవంబర్ 18-23 మధ్య 5 రోజులు జరిగాయి. ఈ కాలంలో పిడిఎఫ్ సభ్యులందరము హైదరా బాద్‌లో వున్నాం. చేసిన ప్రాతినిధ్యాల తాజా సమాచారం మీకంది స్తున్నాము.

1. **ఎయిడెడ్ యాక్టు :** ఎట్టకేలకు ఉభయసభల ఆమోదం పొందింది. దీనికి అడుగడుగునా ఆరునెలలు వెంటపడాల్సి వచ్చింది. చివరికి యాక్టు తయారీని, తర్జుమాను కూడా త్వరపెట్టాల్సి వచ్చింది. చట్ట సభల్లో బిల్లు రావడానికి తంటాలు పడాల్సివచ్చింది. గత సమావేశాల్లో చర్చ సందర్భంగా ముఖ్యమంత్రి నుండి హామీ తీసుకొన్నప్పటి నుంచి బిల్లుగట్టేక్కేదాకా అనునిత్యం పిడిఎఫ్ జోక్యం చేసుకోబట్టే ఇది సాధ్యమైంది. మరీ ముఖ్యంగా కె.ఎస్. లక్ష్మణరావు గారు చూపిన చొరవా, జేఏసీ సెక్రటరీ జనరల్‌గా ఐ.వెంకటేశ్వర రావు ప్రమేయం కీలకమైనవి. ఇప్పుడీ బిల్లు గవర్నర్ ఆమోదం పొంది రూల్స్‌గా తయారై జీఓగా రావాల్సివుంది. దీన్ని ఆయా శాఖలు సర్క్యులేట్ చేయాల్సివుంది. ఈ సందర్భంగా ఎవరో వసూళ్ళు చేశారన్న దానిపై పోలీసు విచారణ జరపాలని డిమాండ్ చేశాము. జరుపుతారట. చూద్దాం.

**పి.బాలసుబ్రహ్మణ్యం,ఎమ్మెల్సీ**

2. **యూనివర్శిటీ** అధ్యాపకులకు 62 యేళ్ళగా, బోధనేతర సిబ్బందికి 60 యేళ్ళగా పదవీ విరమణ వయస్సు పెంచాలని కూడా ఎయిడెడ్ యాక్టు సందర్భంగా చర్చ జరిగింది. మనమే దీన్ని ప్రస్తావించాము. నవంబర్ 24న రెండు ఉత్తర్వులు మంత్రి హామీ మేరకు విడుదలయ్యాయి.
3. **ఎయిడెడ్ టీచర్ల ఇతర సమస్యలు** కూడా మండలిలో చర్చకు వచ్చాయి. యాక్టు 37లాంటివి ప్రాణాంతకంగా వున్నాయి. హెల్త్ కార్డులు రావాలి. అసలు ఎయిడెడ్ వ్యవస్థ పట్ల ఒక విధానం అవసరం. దీనిపై స్పష్టత ప్రభుత్వం నుంచి రాలేదు.
4. **గురుకులాలకు 60 యేళ్ళ వర్తింపు** చేసి తీరాలని చర్చలో గట్టిగా పట్టుపట్టాము. విద్యాశాఖ నిర్వహించే ఏపిఆర్ఇ గురుకులాల్లో కూడా వర్తించకపోవడం అన్యాయమని అందరికీ వర్తింపజేయమని కోరాము. మంత్రిగారు అరకొర హామీ ఇచ్చారు. 10వ షెడ్యూల్‌లో వుండడం పెద్ద అడ్డంకి. దీన్ని అధిగమించాలి.
5. **క్లస్టర్ స్కూళ్ళు** అంటే ఏమిటో ఎవ్వరికి తెలియని పరిస్థితి. ఒక కార్పోరేట్ సంస్థ థీమ్ పేపరు తయారు చేసిందన్నారు. విద్యాశాఖకు ఏమీ ప్రమేయంలేని పరిస్థితి. ఆఫీసర్ల మధ్య సయోధ్యలేదు. ఏమైనా హడావుడి కొంచెం తగ్గింది. ముఖ్యమంత్రి మనోగతం అర్థమయితే తప్ప ఏదీ తేలదు. హైస్కూళ్ళలోనే ప్రాథమిక తరగతులు కూడా వీలునన్ని చోట్ల నిర్వహించాలని ఒక ఆలోచన. తెలుగు, ఇంగ్లీష్ మీడియం ఉన్నత పాఠశాలలుగా విభజించాలని ఇంకో ప్రతిపాదన. విద్యాచట్టం స్కూళ్ళ మూతను అంగీకరించదని ఇంకో అభ్యంతరం. ఏమైనా ఒక స్పష్టత ఇవ్వాలని కోరాం. మండలిలో ప్రశ్న కూడా అడ్మిట్ అయింది. చర్చకు రాలేదు. ఒక పెద్ద పాఠశాల పెట్టి అన్నిటిని మూసెయ్యడం మాత్రం జరిగేపని కాదని చెప్పాం. ఏదో ఒక కన్సాలిడేషన్ మాత్రం తప్పనిసరి. స్కూళ్ళ మూతను విద్యాశాఖ, మంత్రిగారు కూడా వ్యతిరేకిస్తున్నారు.

   ఇదిలా వుంటే వచ్చే సంవత్సరం నుంచి 25% పిల్లల్ని ప్రైవేట్ స్కూళ్ళలో చేర్చాలని విద్యాశాఖ కసరత్తు చేస్తోంది. దీంతో 23వేల స్కూళ్ళు కష్టాల్లో పడతాయి.
6. **పరీక్షలు** ఈ యేడాది గందరగోళంగా మారాయి. ప్రస్తుతానికి ఆర్‌విఎం నుండి కొంత అదనపు ఆర్థికసాయం చేస్తున్నారు. డిసిబిఇల ను పునరుద్ధరించే యోచన మొదలైంది. సిసిఇ విధానంలో మాత్రం స్థానిక ప్రశ్నాపత్రం తప్పనిసరి. జిల్లాస్థాయి పరీక్షలిక వుండక పోవచ్చు. వచ్చే విద్యా సంవత్సరానికి అన్ని గండాలూ తప్పించి ఒక కొలిక్కి తెస్తామంటున్నారు. కమీషనర్‌గారికి క్షేత్రస్థాయి కష్టాలన్నీ చెప్పాము.
7. **టైమింగ్స్** మార్చడానికి విద్యాశాఖ సిద్ధంగాలేదు. వారు చేస్తున్న పరిశీలన పూర్తికాలేదు. వెనక్కి వెళితే తుగ్లక్ పాలన పునరావృతమ వుతుందని భయం. ఇదీ వచ్చే యేడాదికి వాయిదా పడినట్లే.
8. **రేషనలైజేషన్** ఏప్రిల్ 24 తర్వాత జరుగుతాయి. అసలు కష్టాలు అప్పుడు మొదలవుతాయి. ప్రస్తుతానికి సర్దుబాట్లు చేసిన వారు చేతులు కాల్చుకొంటున్నారు. చాలా జిల్లాలు మౌనంగా వున్నాయి.
9. **మున్సిపల్ సర్వీస్ రూల్స్** చివరి దశకు చేరుకొన్నాయి. మున్సిపల్ శాఖ 'జిల్లా యూనిట్'ని ప్రతిపాదిం చింది. దీన్ని ఎక్కువమందిమి వ్యతిరేకిస్తున్నాం. అనుకూలత చూపే వారూ లేకపోలేదు. ఒక చర్చ జరిపి మన విధానం స్పష్టం చేయాలి. జాగ్రత్త పడాలి.
10. **మోడల్ స్కూళ్ళ టీచర్ల నియామకాలు** కోర్టు కేసుతో పెండింగ్‌లో వున్నాయి. కేసు త్వరలో కొలిక్కిరావచ్చు. సర్వీస్ రూల్స్ విద్యాశాఖ కార్యదర్శి నుంచి కదల్లేదు.
11. **డిఇడి అడ్మిషన్లు** తెలంగాణతో ముడిపడి వున్నాయి. ప్రభుత్వం కసరత్తు చేస్తోంది.
12. **మధ్యాహ్న భోజన పథకం** మీద మండలిలో పెద్ద చర్చ జరిగింది. బిల్లులు త్వరగా చెల్లిస్తామన్నారు. ఇస్కాన్ భోజనంలో గుడ్డు లేకపోవడం, నాసిరకంగా వుండటం తీవ్రంగా చర్చకుదారి తీశాయి. కనీసం ప్రత్యేకంగా గుడ్లు వడ్డించే పద్ధతిని ఏర్పాటు చేయమని అడిగాము. ప్రభుత్వాన్ని పునరాలోచనలో పడేశాము.
13. **మంత్రితో చర్చలు :** విద్యాశాఖ తీరుపై, కొత్త ఆలోచనలపై, సమస్యలపై ఒక చర్చ జరగాలని మంత్రిగారిని కోరాము. త్వరలో తేదీ నిర్ణయిస్తామన్నారు.

**కథలు, కవితల పోటీలలో ప్రచురణకి ఎంపికైన కవిత**

# భయం - భయం

**-పి.హజరత్తయ్య, సింగరాయకొండ, ప్రకాశం**

బుజ్జాయిగా నేనున్నప్పుడు
భోజనం చేయకుండా మారాం చేసినప్పుడు
బూచోడు వస్తాడని బెదిరించినప్పుడు
బుడతడైన నాకు పిచ్చోడంటే భయం-భయం
గృహంలో మాట వినక గద్దరించినప్పుడు
గురువే నీకు తగిన యముడని పెద్దలన్నప్పుడు
గత్యంతరములేక తరగతి గదికి వెళ్ళాల్సినప్పుడు
గుర్రుడైన గురువంటే భయం-భయం
ప్రధానోపాధ్యాయుడు అడిగిన ప్రశ్నలు చెప్పలేనప్పుడు
ప్రాజెక్టు పనులు చేయడం చేతకానప్పుడు
పాఠములు అవగాహన చేసుకోలేనప్పుడు
పాఠశాలకు వెళ్ళాలంటే భయం-భయం
పిల్లల్ని పెంచి ప్రయోజకుల్ని చేసినప్పుడు
పెద్దవారితో ఆ పిల్లలు పరుషంగా మాట్లాడినప్పుడు
పెద్ద వయసులో పరామర్శించడం మానివేసినప్పుడు
ప్రేగుబంధమంటేనే భయం-భయం

# అంతర్జాతీయ మాతృభాష దినోత్సవం

బద్దిపూడి శీనయ్య
నెల్లూరు

ఫిబ్రవరి 21 అంతర్జాతీయ మాతృభాష దినోత్సవం. ప్రపంచీకరణ ఫలితంగా అనేక మాతృ భాషలు మృత భాషలుగా మారుతున్నాయి. ఏ మాతృభాషలో అయిన పిల్లలు 30% మంది తమ మాతృభాషలో ప్రాథమిక విద్యనభ్యసించ కుంటే ఆ భాష క్రమేసి మృత భాషగా మారుతుంది. మాతృభాషలోనే విద్యాబోధన, పరిపాలన జరిగినప్పుడే అభివృద్ధి కూడా సాధ్యమవుతుంది.

పాలు ఎంత అవసరమో వికాసానికి అమ్మ భాష అంత ముఖ్యం అని మన జాతిపిత మహాత్మాగాంధీ అన్నారు. ఒకరి భావాలు మరొకరితో పంచుకోవాలంటే ఒకరి బాధను మరొకరితో చెప్పుకోవాలనుకుంటే, ఒకరి గురించి గౌరవంగా మాట్లాడాలను కుంటే, చివరకు ఏడ్వాలన్నా, నవ్వాలన్నా మాతృభాషే శరణ్యం మరొకరి భాషతో ఇది సాధ్యం కాదు. ఒక తరం సంస్కృతి, సాంప్రదాయాలను మరొక తరానికి తెలియజే యాలంటే మాతృభాషే మాధ్యం. సంఘ జీవనంతో పాటు మానవ జాతి సాధించుకున్న అమూల్యమైన సంపద భాష. ప్రపంచంలో భాషలేని మానవ సమాజం ఎక్కడ లేదు. భాషకు, సమాజానికి విడ దీయరాని బంధం ఉంది. భాష అంటే అది వాళ్ళ మాతృభాష. ప్రపం చంలోని మాతృభాషలన్నీ ఏ భాషకు ఆ భాషే తప్ప ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళిన ఆంగ్ల భాష అవసరం అనే భ్రమలో ఉన్న మనకు అభివృద్ధి చెందిన చైనా, రష్యా, జర్మనీ, జపాన్ వంటి పలు దేశాలలో ఇంగ్లీషు బోధనా భాష కాదు అని తెలియాలి. వాళ్ళ మాతృభాషలే అక్కడ బోధనా భాషలు. ప్రపంచంలో మాతృభాషలకు ఇంత ప్రాముఖ్యం ఉండబట్టే 1999వ సంవత్సరం నవంబర్ 17న జరిగిన యునెస్కో 30వ సాధారణ మహాసభ ప్రతి యేడాది ఫిబ్రవరి 21వ తేదీని అంతర్జాతీయ మాతృభాష దినంగా పాటించాలని ఏకగ్రీవంగా నిర్ణయించింది.

**మాతృభాష దినోత్సవం ఫిబ్రవరి 21వ తేదీనే ఎందుకు?**

దాదాపు 63 సం॥ల క్రితం 1952లో నేటి బంగ్లాదేశ్ తూర్పు పాకిస్తాన్‌గా ఉన్న రోజుల్లో తమపై ఉర్దూ భాష రుద్దిన పాలకులకు వ్యతిరేకంగా ఆ దేశంలోనే బెంగాలీలు నిర్వహించిన భాష ఉద్యమం చారిత్రాత్మకమైనది. తమ మాతృభాష అయిన బెంగాలీ భాషకు అనుకూలంగా నిర్వహించిన 1952 ఫిబ్రవరి 21 నాటి ప్రదర్శనపై తూర్పు పాకిస్తాన్ పోలీసులు కాల్పులు జరపగా ముగ్గురు కార్యకర్తలు మరణించారు. వారి అమరత్వాన్ని సంస్మరించుకోవడానికి ఆ రోజును ప్రపంచవ్యాప్తంగా మాతృభాష దినోత్సవం జరుపుకోవాలని యునెస్కో తమ తీర్మానంలో పేర్కొంది. మరణించిన ముగ్గురు అమర వీరులు

**అబ్దుల్ బర్కత్ :** పశ్చిమబెంగాల్‌లోని ముషీరాబాద్ జిల్లాలో భరత్ పూర్ పోలీస్ స్టేషన్ పరిధిలోని బాబ్‌లా గ్రామంలో 1927 జూన్ 16న జన్మించినాడు. తూర్పు పాకిస్తాన్‌కు 1948లో వలస వెళ్ళారు. ఢాకా విశ్వ విద్యాలయంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థి.

**రఫికుద్దీన్ అహ్మద్ :** 1926 అక్టోబర్ 30న మానిక్ బెంజ్ జిల్లాలోని షీ నగర్ పోలీస్ స్టేషన్ పరిధిలోని పారిల్ బాల్దారా గ్రామంలో జన్మించినారు. మోనీగంజ్ దేవేంద్ర కళాశాల విద్యార్థి.

**షాఫియర్ రహమాన్ :** పశ్చిమబెంగాల్‌లోని 24 పరగణా జిల్లాలో కున్నో గ్రామంలో 1918 జనవరి 24న జన్మించినారు. 1948లో తూర్పు పాకిస్తాన్‌కు వలస వెళ్ళినారు. ఢాకా హైకోర్టులో అకౌంట్స్ విభాగంలో ఉద్యోగి. అయితే ఈయన పోలీసు కాల్పుల్లో గాయపడి ఫిబ్రవరి 22న మరణించినారు.

**మన మాతృభాష తెలుగు నేటి స్థితి :**

మన తెలుగు భాష, సాహిత్యం, సంస్కృతికి కూడా నేడు పెను సవాళ్ళు ఎదురౌతున్నాయి. మన రాష్ట్రంలో 1966 (ఆంధ్రప్రదేశ్ కలిసి ఉన్నప్పుడు) మే 14న తెలుగును అధికార భాషగా గుర్తిస్తూ అధికార భాష చట్టాన్ని నాటి ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఆమోదించింది. అధికార భాష అమలుకు 1974 మార్చి 19న వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షులుగా తొలి అధికార భాషా సంఘం ఏర్పడింది. ఆ తరువాత 2005 వరకు 12 అధికార భాషా సంఘాలు ఏర్పడినాయి. కాని అధికార భాష అమలుకు సరియైన కృషి జరగలేదు. 2005 మే 4న ఎబికె ప్రసాద్ అధ్యక్షులుగా, ఆ తరువాత మండలి బుద్ధప్రసాద్ అధ్యక్షులుగా ఏర్పడిన అధికార భాష సంఘాలు తెలుగు అమలుకు కృషి చేసినాయి. కిరణ్‌కుమార్ రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో 2012 సం॥లో ప్రపంచతెలుగు మహాసభలు తిరుపతిలో జరిపినప్పటికి 2013 సం॥లో తెలుగు భాషా వికాస సంవత్సరముగా ప్రకటించి నప్పటికి తెలుగు అమలులో మాత్రం మార్పు తీసుకొనిరాలేక పోయినారు. ఈ సంఘటనలోనే తెలుగు భాషపై పాలకులకు ఎంత చిత్తశుద్ధి ఉందో తెలుసుకోవచ్చు. 1974 నుండి నేటి వరకు ఎన్నో జిఓలు వచ్చినా మన మాతృభాషలో విద్యాబోధన కాని తెలుగులో పరిపాలన కాని సక్రమ అమలుకు నోచుకోలేదు.

ప్రపంచమంతటా ఎన్నో ప్రామాణికమైన పరిశోధనలలో ఒక్క విషయం స్పష్టంగా ఋజువైంది. పసి ప్రాయంలో మొదట ఐదారు సంవత్సరాల పాఠశాల విద్యలో విద్యార్థికి తల్లిదండ్రులతోను, చుట్టూ ఉన్న సమాజంతోను ఏ భాషతో సంబంధం ఉంటుందో అదే భాషలో విద్యా బోధన జరిగినపుడే విషయాలను గ్రహించగలరని మేధస్సుకు పదును పెట్టగలరని సృజనాత్మక శక్తిని పెంచుకోగలరని మౌలికమైన అంశాలు మనస్సులో బలంగా ఇంకుతాయని ఎన్నో పరిశోధనలు ఋజువు చేశాయి. అందుకే మాతృభాషలకు ఇంత ప్రాముఖ్యం ఉంది. ఈ అంతర్జాతీయ మాతృభాష దినోత్సవం మనలో మన మాతృభాష పట్ల గౌరవం కలిగించాలని, మన పాఠశాలల్లో మన మాతృభాష తెలుగుకు ప్రాధాన్యత కలిపిస్తుందని, ఇతరుల మాతృభాషలను గౌరవించే స్ఫూర్తిని కలుగజేస్తుందని చిన్నా పెద్ద భాషలన్నింటికి సహకారం అందించే మానసిక ప్రవృత్తిని అభివృద్ధి చేస్తుందని ఒక భాష మరొక భాషపై పెత్తనం చెలాయించడాన్ని వ్యతిరేకిస్తుందనీ ఆశిద్దాం. ✦

**గమనిక**

ఈ సంచిక ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ రాష్ట్ర మహాసభల ప్రత్యేక సంచిక జనవరి, ఫిబ్రవరి-2015గా రూపొందించడం జరిగింది. అయితే సాంకేతిక కారణాల వలన ఫిబ్రవరి 2015గా విడుదల చేయబడింది. గమనించగలరు. - సంపాదక వర్గం

# నేనెరిగిన మైనేని వెంకటరత్నం



**కె.కేశవరెడ్డి**
**కుంచనపల్లి**

1976లో మొదటిసారిగా ఐక్యఉపాధ్యాయ పత్రికకు 'తెలుగు పాఠ్యాంశాలు - ఒక పరిశీలన' అనే వ్యాసం వ్రాసి పంపించాను. వ్యాసం బాగుంది. దానిలో సహేతుకమైన విమర్శవుంది. అభినందనలు. ఈ నెల పత్రికలో వస్తుంది. నెలనెలా వ్రాసి పంపించండి అని మైనేని ఉత్తరం వ్రాశారు. తరువాత నాలుగు నెలలు వ్యాసాలు వ్రాసి పంపించాను. అన్నీ వరుసగా పత్రికల్లో వచ్చాయి. ఆ తరువాత వ్రాయడం ఆపివేశాను.

ఫలానా ఆదివారం గుంటూరు వస్తున్నాను రాగలరా! - మైనేని లేఖ వ్రాశారు. గుంటూరులో కలిశాం. చిరునవ్వులు చిందిస్తూ ఆప్యాయంగా పలకరించారు. వ్రాయడం ఎందుకు ఆపివేశావని అడిగారు. 'నాకు తెలిసింది వ్రాశాను. కొనసాగించాలంటే ఇంకా చదవాలి సమాచారం సేకరించాలి. ఆ ప్రయత్నంలోనే వున్నాను' జవాబు చెప్పాను.

మైనేని తనతో విజయవాడ రమ్మన్నారు. వెళ్లాను. ఆఫీసులో "టీచర్స్ ఆఫ్ ది వరల్డ్' 'ఇండియన్ ఎడ్యుకేషన్' పత్రికలు చాలా వున్నాయి. వ్రాయడానికి అవి నాకు ముడిసరుకుగా పనికి వస్తాయోమో చూడమన్నారు. రెండు మూడు మాసపత్రికలు తీసుకున్నాను. మైనేని ఆ పత్రికలు ఒక సంచిలో పేర్చి అందించారు.

మైనేని యిచ్చిన పత్రికలు మనసుపెట్టి చదివాను. అవి వివిధ దేశాల విద్యా విధానాల్ని, వివిధ దేశాల విద్యా సమస్యల్ని, ఉపాధ్యాయులు చేసే పోరాటాల్ని సాధించిన విజయాల్ని, వైఫల్యాల్ని నా కళ్ల ఎదుట సాక్షాత్కరింప జేశాయి. అంతేకాదు మైనేని గారు ఆయనకు పరిచయాలున్న మేధావుల్ని పెద్దల్ని - ముఖ్యంగా వై.రాధాకృష్ణమూర్తి గారిని సంప్రదించి అప్పటి ఇంగ్లీషు వార్తాపత్రికలలో, ఇతర జర్నల్సులో - సాహిత్యం, సంస్కృతి, చరిత్ర, రాజకీయాలు - వగైరాలపై వచ్చిన సాహిత్యాన్ని సేకరించే వారు. కేవలం ప్రోత్సహించడమేగాక నిరంతరాయంగా వ్రాయడానికి అవసరమైన ముడి సరుకుని సమకూర్చే వారు మైనేని. ఈ సందర్భంగా గుంటూరు జిల్లా యుటియఫ్ ఉద్యమ నిర్మాతలైన అంజిరెడ్డి, రాయన్న, విశ్వనాథం గార్ల గురించి ఒకటి, రెండు మాటలు చెప్పాలి. ఉద్యమం లోకి వారి కంటే వెనుకవచ్చిన నాకు చేయి అందించి వారి సరసన చేర్చుకొనడమేగాక పత్రికకు రాష్ట్ర సంఘానికి నా అవసరముందని తెలిసి, వారక్కడే వుండి వారి చేతుల్ని మెట్లుగా చేసి నన్ను ఉన్నతాసనంపై గూర్చుండబెట్టారు. ఉద్యమం పట్ల వారి నిబద్ధత అలాంటిది.

పత్రికకి మంచి రచనలు అందించాలనే అన్వేషణాక్రమంలో సాగించిన అధ్యయనంలో 'ది సిటీ ఆఫ్ యల్లో డెవిల్' అనే గోర్కీ రచన చదివాను. ఆ పుస్తకం సమాజం యొక్క విశ్వరూపాన్ని సందర్శింప జేసింది. సాహిత్యంపై సామాజిక సమస్యలపై అస్తవ్యస్తంగా కలగా పులగంగా వున్న నా ఆలోచనలకు స్పష్టత కల్పించింది. పుస్తకం చదువగా కలిగిన స్పందనని ఆలోచనల్ని నాకే పరిమితం చేసుకోలేక పోయాను. మైనేనిని కలిసి విషయాల్ని వీలైనంత పొందికగా చెప్పాను. చెప్పటం కాదు, తెలుగులోకి అనువాదం చేయమని సలహా ఇచ్చారు. అనువదించాను. ఐక్యఉపాధ్యాయ ప్రచురణల తరపున 1980లో మొదటి పుస్తకం 'నగరం' ప్రచురించాం. 1981లో గోర్కీ కథలు ప్రచురించాం. ఈ రెండు పుస్తకాలకు పాఠకుల నుండి విశేషమైన ఆదరణ లభించింది.

విద్యార్థులలో యువతలో, ఉపాధ్యాయులలో సామాజిక అవగాహనని పెంచే లక్ష్యంతో 1976 నుండి నిరంతరాయంగా రచనా వ్యాసంగం చేస్తూ వున్నాను. ఇవన్నీ నేను వ్రాశాననే కంటె మైనేని నా చేత వ్రాయించాడని చెప్పడం సమంజసంగా వుంటుంది.

మైనేని కవి, పండితుడు, రచయిత, మంచి వక్త అన్నిటినీ మించి ఉద్యమ నిర్మాత. అందుకే ఆయన రచయితగా ఎదగడం కంటె ఇతరుల్ని రచయితలు తయారుచేసేందుకు విశేషమైన కృషి చేశారు. ఆయన సాహచర్యంతో, ప్రోద్బలంతో, ప్రేరణతో రచనా వ్యాసంగం చేపట్టిన వారందరి అనుభవాలు నా అనుభవాలలాగే వుంటాయి. వారిలో మంచి పుస్తకాలు రచించి మంచి రచయితలుగా గుర్తింపు పొందినవారు చాలామంది వున్నారు.

తాను వ్రాయడమేగాక అనేకమంది రచయితల్నీ తయారుచేసి పత్రాకాభివృద్ధికి, ఉద్యమాభివృద్ధికి, సామాజిక చైతన్యాన్నిపెంచే అభ్యుదయ సాహిత్యాభివృద్ధికి ఎనలేని కృషి చేసిన మైనేనికి జోహర్లు.

## కవిత సవ్యసాచి మైనేని

– వడ్లమాను వెంకటేశ్వర్లు,
తెనాలి,గుంటూరు

ఉషోదయాన్నే వినిపించిందో వార్త
మైనేని మరణ విషాద వార్త
ఉపాధ్యాయ లోకాన్నే కదిలించిన వార్త
తిరిగి మళ్లీ రారనే అశుభవార్త
జనవిజ్ఞాన వేదిక ప్రగతి పత్రిక
చెకుముకి పత్రిక ప్రారంభానికి
అహర్నిశం శ్రమించిన ప్రతిఫలానికి
ప్రాణమే పణంగా పెట్టినే మన రత్నం
ఐక్యఉపాధ్యాయ పత్రిక ఎడిటర్‌గా
నవతరానికి నవనవోన్మేష రచయితగా
కలాన్ని కదిలించి చైతన్యం జోడించి
గళంతో గర్జించి నిప్పులు కురిపించి
రాజీలేని పోరాటాలకు ప్రగతి బాటవేసె
ప్లవించి విప్లవించె బీజాలువేసె
ఉద్యమమే ఊపిరిగా నిరంతరం కృషిజేసె
వామపక్ష భావాలకు సోపానాలు వేసె
తెలుగు, సంస్కృత భాషా పండితుడు
అపార విజ్ఞాన మేధో సంపన్నుడు
ఐక్యఉపాధ్యాయ పోరాట నాయకుడు
విద్యార్థులను తీర్చిదిద్దిన ఉత్తమ ఉపాధ్యాయుడు
సంఘ నిర్మాణానికి అహర్నిశం శ్రమించి
విద్యారంగ సంస్కరణలకు ఉద్యమించి
అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ జోడించి
ఐక్యఉపాధ్యాయకు ఆదర్శమూర్తియై నిలిచె
అందుకే
మైనేనికి అరుణాంజలులు అర్పిస్తూ
రత్నానికి విప్లవాంజలి ఘటిస్తూ
వెంకటరత్నాకి అగ్నిపూలు అందిస్తూ
సవ్యసాచికి లాల్ సలాం చేస్తున్నాం

# అరిగిన కీళ్లకు మెరుగైన చికిత్స...

పెరుగుతున్న యాంత్రిక జీవన విధానం చాలా రుగ్మతలకు, ప్రాణాంతక వ్యాధులకు కేంద్రంగా మారుతొంది. ఉరుకులు పరుగులతో సాగే ఈ జీవన విధానం వలన కనీసమైన జాగ్రత్తలు తీసుకోవడం కూడా అలవరచు కోలేకపోతున్నారు. ఈ ప్రాణాంతక వ్యాధుల పట్ల తగిన అవగాహన లేకపోవడమే కారణం అంటున్నారు వైద్యులు. ముఖ్యంగా జీవన ప్రమాణ స్థాయిని నిర్దేశించే వ్యాధులైన కీళ్ల నొప్పులు, మధేమేహం, స్థూలకాయం, థైరాయిడ్ సమస్యల వలన రోజు కొత్త ఆరోగ్య సమస్యలు ఉత్పన్న మవుతున్నట్లుగా సర్వేలు తెలియజేస్తున్నాయి.

కీళ్ల నొప్పులను తద్వారా వచ్చే ఆరోగ్య సమస్యల నియంత్రణ మరియు నివారణ మన చేతుల్లోనే ఉన్నది. ముఖ్యంగా 90% కీళ్ల నొప్పులకు ఆపరేషన్ అవసరం లేకుండా చేయవచ్చును. కేవలం కొద్దిపాటి వ్యాయామాల ద్వారా వీటి నియంత్రణ సాధ్యమే అంటున్నారు వైద్యులు.

స్థూలకాయం ఉన్నవారిలో ఎక్కువగా వాకింగ్ చేయడం వలన శరీరం పూర్తి బరువు మోకాళ్లపైపడి మరింత త్వరగా అరిగిపోయే అవకాశం ఉంటుంది. అలాంటి వారికి అవసరమైన, ఉత్తమమైన వ్యాయామం స్విమ్మింగు (ఈత). దీని ద్వారా శరీరం అత్యధిక మోతాదులో కాలరీలను ఖర్చు చేయవచ్చు. కాని ఈత కొలను అందుబాటులో లేని వారికి మాత్రం సైకిల్ తొక్కడం ఒక వరమే. అందుబాటులో ఉన్న స్పోర్ట్స్ సైకిల్ తీసుకుని రోజూ రెండు పూటలా లేదా అవకాశం ఉన్నప్పుడల్లా సైకిల్ తొక్కుట వలన కీళ్లలో ఉండే కండారాలు శక్తివంతమవడమే కాకుండా, కేలరీలు ఖర్చు అయి. స్థూలకాలయం కూడా తగ్గే అవకాశం ఉంటుంది. సైకిల్ తొక్కే సమయంలో సీటు ఎత్తును వీలైనంత ఎక్కువగా పెంచి ఉంచుట వలన శరీరం మొత్తం బరువు సీటుపై పడుట వలన కీలు మడత తక్కువ పడి కీళ్లకు అవసరమైన పటుత్వాన్ని సమకూరుస్తుంది.

ఇక మధుమేహం (షుగరు) ఉన్నవారు మాత్రం ప్రతీనెలా లేదా కనీసం మూడు నెలలకు ఒకసారైనా షుగరు పరీక్షలు చేయించు కొనుట ద్వారా తగు జాగ్రత్తలు తీసుకొని కీళ్ల అరుగుదులను అరికట్టవచ్చును. ముఖ్యంగా షుగరు వ్యాధి గ్రస్తులకు మరియు థైరాయిడ్ సమస్య ఉన్న వారిలో వయస్సుతో నిమిత్తం లేకుండా అరుగుదల ఎక్కువగా ఉంటుంది.

శరీరానికి అవసరమైన కాల్షియం మాత్రల ద్వారానే కాకుండా ఆహార పదార్థాలలో కూడా లభ్యమవుతుంది. పాలు, రాగిజావ, ఆకు కూరలు వంటికి తీసుకునే వారిలో తప్పక కాల్షియం తగు స్థాయిలో పొందవచ్చు.

ఇక వంశ పారంపర్యంగా వచ్చే రుగ్మతల కలవారు మాత్రం ఎప్పటి కప్పుడు వైద్యుల పర్యవేక్షణ తప్పనిసరి



మోకాలు క్రింద తువ్వాలును మడిచి పెట్టుకుని మోకాలును ఉపయోగించి తువ్వాలును పది సెకన్ల వరకు అదిమిపెట్టి ఉంచాలి. ఇలా 20సార్లు చేయుట ద్వారా మోకాలు కండరం ధృడంగా తయారవుతాయి.



మోకాలు క్రింద తువ్వాలును మడిచి పెట్టుకుని చిత్రంలో చూపుతున్నట్లుగా రెండవ కాలిపై ఉంచి మోకాలును ఉపయోగించి తువ్వాలును పది సెకన్ల వరకు అదిమిపెట్టి ఉంచాలి. ఇలా 20సార్లు చేయుట ద్వారా మోకాలు కండరం ధృడంగా తయారవడమే కాకుండా అరుగుదల రాకుండా సహాయ పడును. ఇలా రోజూ ఉదయం, సాయంత్రం చేయవలెను.



వెల్లకిలా పడుకుని కాలుని పైకిలేపి పది సెకన్ల వరకు ఉంచి క్రింద కు దించవలెను. ఇలా 20 నుండి 25 సార్లు చేయవలెను. రోజూ ఉదయం, సాయంత్రం చేయవలెను.

మడమక్రింద తువ్వా లును మడిచి పెట్టుకొని చిత్రంలో చూపుతున్న ట్లుగా తువ్వాలును పది సెకన్ల వరకు అదిమిపెట్టి



ఉంచాలి. ఇలా 20 సార్లు చేయవలెను. ఇలా రోజూ ఉదయం, సాయంత్రం చేయవలెను.



చిత్రంలో చూపినట్లుగా ఒక బెంచిపై కాలును చాపుకుని కూర్చోని ముందుకు వంగుట వలన తొడ కండరాలు ధృడము గా తయారవుతాయి. ఇలా 20 నుండి 25 సార్లు చేయవలెను. ఇలా రోజూ ఉదయం, సాయంత్రం చేయ వలెను.



చిత్రంలో చూపినట్లుగా వెల్లకిలా పడుకుని కాలు చాపి ఉంచి కేవలం పాదమును మాత్రమే ముందుకు వెనుకకు కదలించవలెను. ఇలా 20 నుండి 25సార్లు చేయవలెను. ఇలా రోజూ ఉదయం, సాయంత్రం చేయవలెను.




**డా॥ కిరణ్‌రెడ్డి**

జాయింట్ రీ-ప్లేస్‌మెంట్ సర్జన్

**జాయింట్ కేర్ సెంటర్**

**టైమ్ హాస్పిటల్**

అశోక్‌నగర్ బస్‌స్టాప్, బందర్‌రోడ్, విజయవాడ-520 007,

8106271111, 7032667777

# ప్రశ్నోత్తరాలు



నిర్వహణ : టిఎస్ఎల్ఎన్ మల్లేశ్వరరావు,
ఐక్య ఉపాధ్యాయ సంపాదకవర్గ సభ్యులు
mail : ikyopadhyaya@gmail.com

**ప్రశ్న : మా తండ్రిగారు నాపై ఆధారపడియున్నారు. వారికి ఇటీవల విజయవాడలో ఒక హాస్పిటల్‌లో ఆపరేషన్ చేయించినాము. హాస్పిటల్ వాళ్ళు హెల్త్‌కార్డులు అంగీకరించుటలేదు. మెడికల్ రీయింబర్స్‌మెంట్ వర్తిస్తుందా? అది రిఫరల్ హాస్పిటల్ అని చెప్పారు.**

**- సిహెచ్. శ్రీనివాస్**, విజయవాడ

**జవాబు :** మెడికల్ రీయింబర్స్‌మెంట్ సౌకర్యం ఫిబ్రవరి 28వరకు పొడిగిస్తూ జిఓ నం.159, తేది.22.12.2014 ఇవ్వడం జరిగింది. ఆ అనుపత్రి మెడికల్ రీయింబర్స్‌మెంట్‌కు గుర్తింపు హాస్పిటల్ అయితే మీరు మెడికల్ రీయింబర్స్‌మెంట్‌కు ప్రతిపాదనలు పంపుకోవచ్చు.

**ప్రశ్న : నేను సెకండరీగ్రేడ్ ఉపాధ్యాయునిగా పనిచేయు చున్నాను. ప్రస్తుతము నిర్వహించనున్న డిఎస్‌సిలో స్కూల్ అసిస్టెంట్ పరీక్షకు సిద్ధమవుతున్నాను. స్కూల్ అసిస్టెంట్‌గా ఎంపికైతే నా సర్వీస్‌కు రక్షణ ఉంటుందా? పాత సేవా పుస్తకము కొనసాగించవచ్చా?**

**- టి.పావని**, గుంటూరు

**జవాబు :** ఉంటుంది. మీరు జిల్లా విద్యాశాఖాధికారి అనుమతితో డిఎస్‌సికి హాజరైతే, ఏపి స్టేట్ & సబార్డినేట్ సర్వీస్ రూల్స్ రూల్ 30ఇ మరియు జిఓ నం.105 ఆర్థిక; తేది.02.06.2011 ప్రకారం స్థానిక సంస్థలలో పని చేస్తూ మరొక పోస్టుకు ఎంపికైతే వారికి వేతన రక్షణతో సమానంగా అన్ని సౌకర్యాలు కొనసాగుతాయి.

**ప్రశ్న : నా భర్త తేది.30.06.1997న పదవీ విరమణపొంది తేది.20.06.2000న మరణించడం జరిగింది. నేను ఫ్యామిలీ పెన్షన్ పొందుతున్నారు. ఇటీవల పెన్షనర్ పెన్షన్‌లో చివరి వేతనం లెక్కలోకి తీసుకోవాలంటూ ప్రభుత్వ ఇచ్చిన ఉత్తర్వులు నాకు వర్తిస్తాయా?**

**- పి.లక్ష్మీనారాయణ**, తెనాలి

**జవాబు :** వర్తిస్తాయి. జిఓ నం.223; తేది. 15.12.2014 ప్రకారం తేది.25.05.1998కన్న ముందు పదవీ విరమణ చేసిన వారికి గతంలో 10 నెలల సగటు వేతనం పెన్షన్ లెక్కించడానికి పరిగణనలోకి తీసుకోనేవారు. జిఓ 223; తేది.15.12.2014 ప్రకారం తేది.25.05.1998 ముందు పదవీ విరమణ పొందిన వారికి కూడా చివరి నెల వేతనం ఆధారంగా పెన్షన్ లెక్కించాలని ఉత్తర్వులు జారీ చేయడమైనవి. తేది.25.05.1998 ముందు పదవీ విరమణ చేసి, తేది.25.05.1998 తర్వాత మరణించిన వారి విషయంలో వారి వారసులకు ఆ వ్యత్యాసం తాలూకు అరియర్స్ చెల్లించాలని ఉత్తర్వులలో పేర్కొనటం జరిగింది.

**ప్రశ్న : నేను 2014 వేసవి సెలవులలో 3 రోజులు ఎన్నికల విధులు నిర్వర్తించాను. నేను పనిచేసిన కాలానికి సంపాదిత సెలవు పొందే ఉత్తర్వులను తెలుపగలరు.**

**- బి.చక్రపాణి**, శ్రీకాకుళం

**జవాబు :** పాఠశాల విద్యా సంచాలకుల ఉత్తర్వులు ఆర్‌సి నం.362/ఇ1-1/2013; తేది.16.11.2013 ప్రకారం వేసవి సెలవులలో పనిచేసిన కాలానికి సంపాదిత సెలవు జమ చేయవచ్చును.

**ప్రశ్న : నేను 19 సం॥ల సర్వీసు పూర్తి చేశాను. నేను వాలంటరీ రిటైర్మెంట్ తీసుకోవచ్చునా?**

**- కె.కళ్యాణి**, నెల్లూరు

**జవాబు :** వాలంటరీ రిటైర్మెంట్‌కు కనీసం 20 సం॥లు సర్వీస్ పూర్తి చేసి వుండాలి. ఏపి రివైజ్డ్ పెన్షన్ రూల్స్‌నందలి రూల్ 43కు వెలుసుబాటు కల్పిస్తూ 20 సం॥ల సర్వీస్ నిండకుండానే ఒక ఉపాధ్యాయునికి వాలంటరీ రిటైర్మెంట్‌కు అనుమతిస్తూ ప్రభుత్వం జిఓ 51 విద్య; తేది.24.08.2013 (అ.ద.30) ద్వారా ఉత్తర్వులు యివ్వడమైనది. మీరు కూడా ప్రభుత్వానికి దరఖాస్తు చేసి ప్రత్యేక అనుమతి కోసం ప్రయత్నించండి.

**ప్రశ్న : నేను ఈ సంవత్సరం రూ.18000 వరకు ఆదాయపు పన్ను చెల్లించాల్సి ఉంటుంది. మా ప్రధానోపాధ్యాయులు ఫిబ్రవరి జీతపు బిల్లులో ఒకే దఫాలో మొత్తం మినహాయిస్తామంటున్నారు. ప్రతినెల కొంత మినహాయించమని కోరితే అంగీకరించడం లేదు సరియైనదేనా?**

**-కె.వెంకటేశ్వరరావు**, గుంటూరు

**జవాబు :** సరియైనదికాదు. ఇన్-కం-టాక్స్ నిబంధనల ప్రకారం సంవత్సరం ప్రారంభంలోనే చెల్లించవలసిన పన్నును అంచనావేసి దానిని మార్చి నెలనుండే ప్రతి నెల సమాన వాయిదాలలో మినహాయించవలసిన బాధ్యత డిడిఓలదే.

**ప్రశ్న : ఒక డిజేబుల్డ్ ఉపాధ్యాయునికి వృత్తిపన్ను మినహాయించాలంటే ఎంత శాతం అంగవైకల్యం ఉండాలి?**

**- వి.సూర్యనారాయణ**, ఒంగోలు

**జవాబు :** జిఓ ఎంఎస్ నం.1063 రెవెన్యూ; తేది.02.08.2007 ప్రకారం 40% డిజేబులిటి ఉన్నట్లయితే వృత్తిపన్ను మినహాయింపు వర్తిస్తుంది.

**ప్రశ్న : ఒక ఉపాధ్యాయుడు ఫిబ్రవరి 29న సెకండరీగ్రేడ్ ఉపాధ్యాయునిగా చేరియున్నారు. వారి ఇంక్రిమెంట్ ఫిబ్రవరి మాసంలో ఉన్నది. కొందరు మార్చిలో ఇవ్వాలి అంటున్నారు. వాస్తవమేనా?**

**- పి.మణిశంకర్**, పశ్చిమగోదావరి

జవాబు : పాఠశాల విద్య సంచాలకుల ఉత్తర్వులు ఆర్‌సి నం. 2071/డి2-1/2010; తేది.21.07.2010 ప్రకారం లీపు సంవత్సరంలో ఫిబ్రవరి 29న విధులలో చేరిన ఉపాధ్యాయుని వార్షిక ఇంక్రిమెంట్ ఫిబ్రవరిలోనే ఉంటుందని వివరణ ఇవ్వడం జరిగింది.

ప్రశ్న : **మా పాఠశాలలో ఒక ఉపాధ్యాయిని డెలివరీ సందర్భంలో బిడ్డ చనిపోవటం జరిగింది. వారికి మెటర్నిటీ లీవుకు అర్హత ఉంటుందా?**

**- బి.శ్రీరాములు,** నెల్లూరు

జవాబు : ఉంటుంది. పాఠశాల విద్యా సంచాలకుల ఉత్తర్వులు ఎల్ డిస్ నం.1941/జి2/90; తేది.11.06.1990 ప్రకారం మరణించిన బిడ్డను ప్రసవించినా ప్రసూతి సెలవుకు అర్హత ఉంటుంది.

ప్రశ్న : **నేను ఎస్‌ఏగా తేది.01.11.2002న పదోన్నతి పొందిన తదుపరి 103 రోజులు జీత నష్టపు సెలవు పెట్టియున్నాను. స్టెప్‌అప్ తేది.01.09.2012 నాకు 12 సం॥ స్కేల్ ఎప్పటి నుండి ఇవ్వబడుతుంది? తదుపరి ఇంక్రిమెంట్ ఎప్పుడు?**

**- బి.సుబ్రహ్మణ్యేశ్వర రావు,** తణుకు

జవాబు : జీత నష్టపు సెలవు కారణంగా మీకు 12.02.2015 నుండి 12 సం॥ స్కేలు మంజూరు చేయబడుతుంది. మీరు జీతనష్టపు సెలవు 01.09.2012కి ముందు పెట్టివుంటే తదుపరి ఇంక్రిమెంట్ సెప్టెంబర్ 2015లో ఇవ్వబడుతుంది. 01.09.2002 తర్వాత జీత నష్టపు సెలవు పెట్టివుంటే ఆ మేరకు వాయిదా పడుతుంది.

ప్రశ్న : **మా పాఠశాలలో ఇద్దరు ఉపాధ్యాయులము పని చేస్తున్నాము. ఒక మహిళా ఉపాధ్యాయిని స్పౌజ్ కేటగిరిలో మా పాఠశాలకు వచ్చి ఉన్నారు. మా పాఠశాలలో పోస్టు పోయినట్లయితే ఎవరిని బదిలీ చేస్తారు?**

**- నూనె శ్రీనివాసులు,** బి.పేట

జవాబు : రేషనలైజేషన్ సందర్భంలో ఇప్పటివరకు ఉన్న నిబంధనల ప్రకారము సర్వీస్ జూనియర్‌ని బదిలీ చేస్తారు. సీనియర్ అంగీకారము తెలిపితే సీనియర్‌నే బదిలీ చేస్తారు.

ప్రశ్న : i) **ఒక పాఠశాలలో 'ఎ' అను ఉపాధ్యాయుడు డిఎస్‌సి 98 ద్వారా, 'బి' అను ఉపాధ్యాయుడు డిఎస్‌సి 2000లోను, 'సి'అను ఉపాధ్యాయుడు డిఎస్‌సి 2001లో ఎస్‌జిటిలుగా నియమించబడినందు వీరిలో 'ఎ,సి' ఉపాధ్యాయులు గణితం, 'బి' సోషల్ స్కూల్ అసిస్టెంట్‌గా ఒకే రోజు పదోన్నతి పొందారు. వీరిలో ఎవరు సీనియరు.**

**- బి.సూర్య,** కృష్ణా

ii) **వేర్వేరు సబ్జెక్టులలో ఒకేసారి ప్రమోషన్ పొందిన ఉపాధ్యాయుల సీనియార్టీ ఏ విధంగా నిర్ణయిస్తారు? ఒకే డిఎస్‌సిలో వేర్వేరు సబ్జెక్టులలో నేరుగా నియామకం పొందిన వారి సీనియార్టీ ఎలా నిర్ణయిస్తారు?**

**- ఎ.సుందరయ్య,** కృష్ణా

iii) **డిఎస్‌సి 2008 ద్వారా ఎంపిక కాబడిన ఒక సోషల్ స్కూల్ అసిస్టెంట్, ఇద్దరు ఇంగ్లీష్ స్కూల్ అసిస్టెంట్‌లు ఒకే సమయంలో పాఠశాలలో చేరారు. వీరిలో ఎవరు సీనియర్.**

**- ఎం.వి.రమణమ్మ,** కొత్తవలస

జవాబు : i) ఎస్‌జిటి నుండి ఎస్‌ఏగా పదోన్నతి పొందిన సందర్భంలో, పాఠశాల విద్యా సంచాలకుల ఉత్తర్వులు ఆర్‌సి నం.142/సి3-1/2011; తేది.11.08.2011 ప్రకారం ఫీడర్ కేటగిరి అయిన ఎస్‌జిటి కేడర్‌లో సీనియార్టీ ప్రకారం ఎస్.ఏ.క్యాడర్ సీనియార్టీ నిర్ణయించబడుతుంది. ఎస్‌జిటిలో సీనియర్ అయిన ఉపాధ్యాయుడు ఎస్‌ఏ కేడరల్‌లో సీనియార్టీ అవుతారు, కాబట్టి 'ఎ,బి,సి' ఉపాధ్యాయులు సీనియార్టీలో వరుస క్రమంలో ఉంటారు.

ii) & iii) స్టేట్ & సబార్డినేట్ సర్వీస్ రూల్స్ నందలి రూల్ 33 (బి) మరియు 34 ప్రకారం ఒకే సబ్జెక్టుకు చెందిన వారి సీనియార్టీ డిఎస్‌సి సెలక్షన్ లిస్ట్‌ర్యాంకు ప్రకారం నిర్ణయిం చాలి. వేర్వేరు సబ్జెక్టులలో నియామకం పొందిన వారి ఇంటర్ సే సీనియార్టీని వారు చేరిన తేదీ ప్రకారం నిర్ణయించాలి, ఒకే తేదీన చేరిన వారిలో పుట్టిన తేది ప్రకారం సీనియార్టీ నిర్ణయించ బడుతుంది. ఉదా : డిఎస్‌సి 2008లో నియామకం పొందిన 5గురు ఉపాధ్యాయుల సీనియార్టీ క్రింది విధంగా వుండాలి.

| క్ర. సం. | పేరు | సబ్జెక్టు | చేరిన తేదీ | పుట్టిన తేదీ | రోస్టర్ ర్యాంకు |
|---|---|---|---|---|---|
| 1 | A | సోషల్ | 21.10.2009 | 04.06.1980 | 21/I |
| 2 | B | గణితం | 24.10.2009 | 01.07.1981 | 76/I |
| 3 | C | భౌతిక | 19.10.2009 | 15.06.1987 | 75/I |
| 4 | D | ఆంగ్లం | 19.10.2009 | 25.01.1975 | 89/I |
| 5 | E | ఆంగ్లం | 19.10.2009 | 17.04.1980 | 96/I |

1) D 2) E 3) C 4) A 5) B

కథలు, కవితల పోటీలలో
తృతీయ బహుమతి అందుకున్న కథ

# వసంతం!

డి.కృష్ణయ్య
వీపనగండ్ల

జూరాల కాలువ నీళ్లతో పచ్చని పొలాలు, చెట్లు, పండ్ల తోటలు కళకళలాడుతున్నాయి. పక్షుల కిలకిలారావాలు, తుమ్మెదల కోలాహలాలు, లేగదూడల అరుపులతో సందడిగా ఉంది మియ్యాపురం.

కక్షలు కార్పణ్యాలకు దూరం. ఆత్మహత్యలు, సీజనల్ వ్యాధులు ఆ పల్లెను కలవరపెడుతుంటాయి. అక్షరాస్యత తక్కువ - హంగు ఆర్భాటాలు లేని సామాన్యజనం ఆ పల్లె వాసులు. గుడి ఉంది. బడి కూడ ఉంది. ప్రాథమికోన్నత పాఠశాల నిండువెన్నెల జాబిలిలా విలసిల్లింది.

మియాసాబ్ అనే ఉపాధ్యాయుడు తన సహచరులతో ఎంచక్క పాఠాలు చెబుతూ విద్యార్థులకు విద్యా సుగంధాలు వెదజల్లుతుంటే ఆ పల్లె పునీతమైంది. ఎంతోమంది విద్యార్థులకు ప్రగతిబాటలు వేసింది. కాలం ఎప్పుడు ఒకే విధంగా ఉండదు కదా! "ఉరుము ఉరిమి మంగళం మీద పడ్డట్లు" ప్రపంచీకరణ పెనుభూతం ఆ పల్లెను ఆవహించింది. ప్రైవేటీకరణ, కార్పోరేటీకరణ ఆకర్షణకు మోజు పెంచుకున్నారు. మరో వైపు ఆ పాఠశాలలో ఉపాధ్యాయుల కొరత ఏర్పడ్డది. బోధన భారంగా మారింది. దీంతో తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రైవేట్ పాఠశాలలకు పంపుతూ వచ్చారు. పాఠశాలలో విద్యార్థుల సంఖ్య తగ్గుతూ వచ్చింది. నాడు కళకళలాడిన పాఠశాల వెలవెలబోతుండడంతో ఆ పాఠశాలను ఎత్తివేసే దశకు వచ్చింది.

"తెల్లారేసరికల్ల సద్దిగిన్నెలను సంకన పెట్టుకొని, బండెడు పుస్తకాల ను బ్యాగులో వేసుకొని మెడకు తగిలించుకొని సూటుబూటు ధరించి కార్పోరేట్ పాఠశాలకు వెళ్ళి వస్తున్నారు పిల్లలు. వేలాది రూపాయల ఫీజులు చెల్లిస్తూ, తమ బిడ్డలు మమ్మీడాడీ అని పిలుస్తుంటే సంబరపడి పోయారు తల్లిదండ్రులు.

రోజులు, నెలలు గడుస్తున్నాయి. ఫీజుల భారం తడిసి మోపె డవుతోంది. పాఠశాలలకు వెళ్ళివస్తూ పొద్దుపోయేవరకు ఇంటికి చేరు కుంటున్నారు. ఆడుతు పాడుతూ ఆహ్లాదకరంగా వికసిల్లాల్సిన తమ బిడ్డలు అలసిపోతున్నారు. చాల దూరంపోయి రావడంతో పిల్లలు పడరానిపాట్లు పడుతున్నారు. క్రమేపి పిల్లలు బక్కచిక్కిపోతున్నారు. మానసిక వత్తిడికి ఆందోళన చెందుతున్నారు. అటు తల్లిదండ్రులు, ఇటు పిల్లల పరిస్థితి అగమ్యగోచరంగా తయారైంది.

విద్యావికాసం ఉద్యమం ఉధృతంగా సాగుతోంది. ప్రభుత్వ బడులను బలోపేతం చేయాలని, రక్షించుకోవాలంటూ పోరాటం జరుగుతోంది. ఈ కార్యక్రమాన్ని స్ఫూర్తిగా తీసుకున్న కృష్ణ తీవ్రంగా ఆలోచించాడు. ఇల్లిల్లు తిరిగాడు, గ్రామస్తులను, యువకులను కలిశాడు. అవగాహన కల్పించాడు. పాఠశాల నిర్వహణకు చిత్తశుద్ధితో భరోసా కల్పించాడు.

"తమ కళ్లెదుటే పిల్లలు పడుతున్న వెతలు చూసి హృదయాలు ద్రవించాయి. ఆర్థిక భారం కనువిప్పు కల్గించాయి. ఎవరో వస్తారు, ఏదో చేస్తారని ఎదురుచూడక కదిలారు గ్రామస్తులు. కళ్లు తెరిచారు. చినుకు చినుకు వాన, వాన వాగైనట్లు ముందుకు వచ్చారు.

, కార్పోరేట్ స్కూల్‌కు వెళ్లుచున్న వారందరిని, స్థానిక ప్రభుత్వ పాఠశాలలో చేర్పించారు. డబ్బు ప్రోగుచేసి అదనపు ఉపాధ్యాయులను నియమించారు. తెలుగు, ఆంగ్ల బోధనకు శ్రీకారం చుట్టారు. ఆడుతూ పాడుతూ విద్యార్థులు విద్యను అభ్యసిస్తున్నారు.

ఇన్నాళ్లు తాము పడ్డ వెతల నుండి విముక్తి లభించినందుకు ఆనంద భాష్పాలు కార్చారు.

కనుమరుగయ్యే పాఠశాల పరిస్థితి నుండి కళకళలాడుతూ మూడు పువ్వులు ఆరుకాయలుగా విద్యార్థులు, ఉపాధ్యాయులతో విలసిల్లు తుంది మియ్యాపురం. మలి వసంతం కురవడంతో ఆ పల్లెలో సముద్రమంత ఆనందం వెల్లి విరిసింది. ✦

**కథలు, కవితల పోటీలలో ప్రచురణకు ఎంపికైన కవిత**

## చేయి చేయి కలుపుదాం...!

-ఎం.వాగ్దేవి, కృష్ణానగర్, శ్రీకాకుళం

ఆకలిరాజ్యం - అంధుల రాజ్యం
అంధకారమే - నిండిన రాజ్యం
పేదల రాజ్యం బీదల రాజ్యం
బీదా బిక్కీ మెలిగే రాజ్యం
మోసకారులే మసలే రాజ్యం
ఏడుస్తారా ఏడవకండి
ఆకలివేస్తే రండీ, రండీ
సంఘం అండ ఉంది మనకు
బాధగోడు వినిపించేద్దాం!
చస్తూ బతుకుతు, బతుకుతు చస్తూ
చావలేక ఈ బ్రతుకీడుస్తూ
మనకొద్దిక ఈ జీవన యానం
రండీ రండీ ముందుకుపోదాం!
అణిగీమణిగీ ఒదిగీ ఒదిగీ
అధికుల చేతిలో ధనికుల చేతిలో
నలిగీ నలిగీ ఎంతకాలమీ
చీకటి మనకు - వెలుగే లేదా మన
బ్రతుకులకు?
బతుకంటనే భయమేస్తోందా?
భయం భయంగా జీవితముందా?
ఎందుకు శోచన ఎందుకు యోచన?
మీరు నేనూ నేనూ మీరూ చేతులు కలిపి
అటోయిటో ఇటో అటో తేల్చుకువద్దాం!
ఉద్యమమే ఊపిరిగా, పోరాటం చేద్దాం!
ధనిక బీద వర్గాలిక సమాజాన లేకుండగ
హక్కుల సాధనకు ప్రాణాలర్పించిన
అమరవీరులకు జేజేలంటూ
వారి ఆశయ సాధనకు నడుంకట్టి
మేలుకొలుపు పాడుతూ వడివడిగా
చైతన్యమూర్తులమై, చేయిచేయి కలుపుతూ కలిసి కదులుదాం! కదిలిద్దాం!

**గమనిక**

గత డిసెంబర్ నెల సంచికలో ప్రచురించిన 'జ్యోతి' కథ రచయిత పూరేటి శ్రీనివాసరావుగా పొరపాటుగా ముద్రించ బడినది. విచారం తెలుపుతున్నాం. కథలు, కవితల పోటీలలో తృతీయ బహుమతి పొందిన కథ 'జ్యోతి' రచయిత జి.పుల్లయ్య, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా. వీరికి అభినందనలు తెలియజేస్తున్నాము. - ప్రధాన సంపాదకులు

# క్లస్టర్ స్కూళ్ళు - రాజస్థాన్ అనుభవాలు



సిహెచ్.శ్రీహరి
ఐక్యఉపాధ్యాయ సంపాదకవర్గసభ్యులు

భారతీ జనతాపార్టీ పాలిత రాజస్థాన్‌లో విద్యాహక్కు చట్టాన్ని తుంగలో తొక్కే రీతిలో పరిణామాలు జరుగుతున్నాయి. 2014 ఆగస్ట్ 14న 17000 చిన్న స్కూళ్ళను పెద్ద స్కూళ్ళలో కలిపేశారు. క్లస్టర్ స్కూళ్ళ ఏర్పాటు చేయాలనే ఆలోచనలో మన ప్రభుత్వం కూడ వున్నట్లు ప్రచారం జరుగుతోంది. ఈ నేపథ్యంలో స్కూళ్ళు మూసివేసిన రాజస్థాన్‌లో ఏం జరుగుతోందో చూద్దాం.

మంచి విద్యకు కావాల్సిన వనరుల్ని పెద్ద స్కూళ్ళలో మాత్రమే అమలు చేయగలం. దూరంగా విసిరేసినట్లు, కొద్దిమంది పిల్లలలో వుండే చిన్నచిన్న స్కూళ్ళలో సాధ్యం కాదుగదా అనేది ఈ ప్రక్రియ వెనుక వున్న ఉద్దేశ్యంగా చెబుతున్నారు. అందులో కొంత వాస్తవం ఉన్నమాట నిజమే. అయితే అర్జెంటుగా అమలుచేసే ఆతృతతో ప్రజలతో చర్చించడం, మౌలిక సదుపాయాల్ని ముందుగా కల్పించడం అనే విషయాల్ని గాలికి వదిలేశారు. అంతేకాదు. దేశవ్యాప్తంగా ఒక పద్ధతిలో అమలు చేయాల్సిన విద్యాహక్కు చట్టాన్ని రాష్ట్రాలు తమకు ఇష్టం వచ్చిన రీతిలో, తమ స్వంత అజెండాలను విద్యలోకి ప్రవేశ పెట్టే విధంగా మార్పు చేసుకోవచ్చు అనే తప్పుధోరణి రాజస్థాన్‌లో మొదలైంది.

17000 స్కూళ్ళు మూసేసిన తరువాత రాజస్థాన్ గ్రామీణ ప్రాంతంలో జరుగుతున్న పరిణామాల్ని చూస్తే రాజ్ సమండ్ అనే ఒక్క జిల్లాలోనే 199 ప్రాథమిక పాఠశాలలు, 42 ప్రాథమికోన్నత పాఠశాలలు మూసేసి సమీప 227 హైస్కూళ్ళలో కలిపేశారు. అంటే 241 స్కూళ్ళు ఈ ఒక్క జిల్లాలో మాయం అయిపోయాయి. ఫలితంగా అనేకమంది పిల్లలు 1 కి.మీ.పైగా దూరం వున్న పాఠశాలలకు వెళ్ళాల్సిన స్థితి ఏర్పడింది. ఇది ఆర్‌టిఇ చట్టంలో 7(1)(ఎ) మరియు 1(బి) ప్రకారం ప్రాథమిక పాఠశాల 1 కి.మీ.లోపు, ప్రాథమికోన్నత పాఠశాల 2 కి.మీ. లోపు ఉండాలనే నిబంధన అతిక్రమించడమే. ఆ మేరకు బాలల హక్కును కాలరాయడమే అవుతుంది.

సెక్షన్ 7(3) ప్రకారం ఒక గ్రామంలో 20మంది విద్యార్థులు వుంటే ప్రాథమిక, 30మంది విద్యార్థులు వుంటే ప్రాథమికోన్నత పాఠశాల ఏర్పాటు చేయాలి. అదే జిల్లాలలో "సర్మేలా" గ్రామంలో ప్రాథమిక పాఠశాలను ఉదాహరణగా చూస్తే అక్కడ 98మంది విద్యార్థులు ఉన్నారు. ఆ స్కూల్‌ను 2 కి.మీ. దూరంలో వున్న 65మంది విద్యార్థులు వుండే "ఫరారా" ప్రాథమికోన్నత పాఠశాలలో కలిపేశారు. ఇది ఆర్‌టిఇ చట్టంలో వున్న పై రెండు నిబంధనలకు తిలోదకాలు ఇవ్వడమే.

ఈ జిల్లాలోనే "రఘునాథపురా" ప్రాథమిక పాఠశాలను "రాటిపాటి" ప్రాథమిక పాఠశాలలో కలిపేశారు. ఇప్పుడు రఘునాథపురా గ్రామ విద్యార్థులు హైవే దాటి రాటిపాటి స్కూల్‌కు వెళ్ళాల్సి వస్తోంది. రాజ్‌నగర్ ప్రాథమికోన్నత పాఠశాలను హైవే అవతలవున్న హైస్కూల్లో కలిపేశారు. ప్రాథమికోన్నత పాఠశాలలో వున్న దళిత, మైనార్టీ పిల్లలు హైవే దాటి పాఠశాలకు వెళ్ళాలి. వారికి ఏ విధమైన రవాణా సౌకర్యం ఏర్పాటు చేయలేదు. ఇది దళిత, మైనార్టీ పిల్లల్లో డ్రాప్ అవుట్లు పెరగ దానికి, కొత్తగా బడిలో చేరే పిల్లలు చేరకపోవడానికి దారితీస్తుందని విద్యావేత్తలు చెబుతున్నారు. ఈ జిల్లాలలో 11 బాలికల పాఠశాలల్ని కో-ఎడ్యుకేషన్ స్కూళ్ళలో కలిపేశారు. బాలికల విద్య తక్కువగా వున్న రాజస్థాన్ లాంటి రాష్ట్రంలో ఇది ఏ పరిణామానికి దారి తీస్తుందో తేలిగ్గానే ఊహించవచ్చు. అలాగే ఉర్దూమీడియం స్కూళ్ళను హిందీ మీడియం స్కూళ్ళలో కలిపేశారు. ఉర్దూ మీడియం పిల్లలు కొత్త మాధ్యమంలోకి ఎలా, ఎప్పటికి సర్దుబాటు అవుతారో ఎవ్వరికీ పట్టదు. "కదియా" పంచాయితీలోని ప్రాథమిక పాఠశాల నుండి 80మంది విద్యార్థుల్ని అదే గ్రామంలో 190మంది వుండే హైస్కూల్‌లో కలిపారు. మొత్తం 270మంది విద్యార్థులకు గతంలో వున్న అవే ఆరు క్లాస్‌రూమ్‌లు, ఆరుగురు టీచర్లు. ప్రస్తుతం ఆ ఆరుగురే 1 నుండి 10 తరగతులకు చదువు చెప్పాల్సి వస్తోంది.

ఇదంతా ప్రభుత్వ పాఠశాలల్ని బాగుచేయడం కోసం అంటారు పాలకులు. ఎప్పుడు టీచర్లను వేస్తారో, గదులు నిర్మిస్తారో, రూమ్ ఏర్పాటు చేస్తారో ఎవ్వరు చెప్పలేదు. చెప్పినా నమ్మరు. ఎందుకంటే వీళ్ళ శుష్క వాగ్దానాలకు విలువ లేదు కాబట్టి. ఈలోపు కనీస వసతులు లేని స్కూళ్ళ నుండి, అందుబాటులో లేని స్కూళ్ళ నుండి అవకాశం వున్న వాళ్ళు ప్రైవేట్ స్కూళ్ళవైపు ఎగిరిపోతారు.

విద్యాహక్కు చట్టం ప్రకారం టీచరు విద్యార్థి నిష్పత్తి 1:30 ఉండే విధంగా ఏర్పాటైనా 60లోపు విద్యార్థులు, 5 తరగతులు ఇద్దరు టీచర్లు మాత్రమే ఉండే స్కూళ్ళల్లో మంచి విద్యా ప్రమానాలు ఆశించలేం. ఈ స్కూళ్ళలో బహుళ తరగతి బోధనతోపాటు బహుళస్థాయి విద్యార్థుల బోధనా అనివార్యం. ఫలితంగా ప్రమాణాలు దిగజారడం, పిల్లలు ప్రైవేట్ స్కూళ్ళవైపు వెళ్ళిపోవడం చూస్తున్నదే. మంచి పాఠశాల ఏర్పాటు కాదనలేం. అయితే ఉన్న పాఠశాలలు మూసివేయాలా అనేదే మన ప్రశ్న.

**మార్పు జరగాల్సిందే! కాని రాజస్థాన్‌లోలాగా కాదు!!**

(కిరణ్ భట్టీ వ్యాసం ఆధారంగా...)

# CRP, MIS కో-ఆర్డినేటర్ల జాబ్ చార్టులు

విద్యాహక్కు చట్టం 2009ను సమగ్రంగా అమలు పర్చడానికి కేంద్ర ప్రభుత్వం సర్వశిక్షా అభియాన్ని మార్గంగా ఎంచుకున్నది. చట్టంలో పేర్కొన్న పలు అంశాలు అమలు పరచడానికి, అమలులో ఎదురవుతున్న అదనపు పని భారాన్ని తొలగించడానికి సర్వశిక్షా అభియాన్ కార్యక్రమం క్రింద 2012-13 నుండి స్కూల్ కాంప్లెక్స్ స్థాయిలో క్లస్టర్ రిసోర్సు పర్సను *(CRP)*, మండల రిసోర్సు సెంటర్ స్థాయిలో *MIS* కో-ఆర్డినేటర్ పోస్టులను మంజూరు చేయడం జరిగింది. కేంద్ర ప్రభుత్వ సూచనల మేరకు ప్రతి 18 పాఠశాలలకు ఒక క్లస్టర్ రిసోర్సు పర్సనును నియమించవలసి ఉంది. స్టేట్ ప్రాజెక్టు డైరెక్టరు, సర్వశిక్షా అభియాన్ వారు క్లస్టర్ రిసోర్సు పర్సనులు, *MIS* కో-ఆర్డినేటర్ల జాబ్‌చార్టులు వారి నియామక మార్గదర్శకాలలోనే పొందుపరచడం జరిగింది. అలాగే సర్వశిక్షా అభియాన్, స్టేట్ ప్రాజెకక్టు డైరెక్టర్ ఉత్తర్వులు ఆర్‌సి నం. 463/*RVM(SSA)/C1*/2012, తేది.12.07.2012లో పేర్కొనడం జరిగింది. ప్రత్యేకించి *MIS* కో-ఆర్డినేటరుల విధులు, బాధ్యతలు స్టేట్ ప్రాజెక్టు డైరెక్టరు, రాజీవ్ విద్యామిషన్ ఉత్తర్వులు ఆర్‌సి నం.766/*A4/SSA*/ 2013, తేది.09.05.2013 ద్వారా తెలియజేయడం జరిగింది. ఈ ఉత్తర్వులలో పేర్కొన్న క్లస్టర్ రిసోర్సు పర్సనులు, *MIS* కో-ఆర్డినేటర్ల జాబ్ ఛార్టులు గురించి తెలుకుందాము.

**క్లస్టర్ రిసోర్సు పర్సన్ *(CRP)* జాబ్‌ఛార్టు :**

- ✦ **పాఠశాల సముదాయం సమావేశ నిర్వహణలో కింది అంశాలలో పాఠశాల సముదాయం ప్రధానోపాధ్యాయులకు, అసిస్టెంట్ సెక్రటరీకి సహకరించడం.**
- సమావేశ నిర్వహణ ఏర్పాటును చేయడం, సమావేశ అజెండాను అనుబంధ పాఠశాలలకు తెలపడం.
- సమావేశ మినిట్స్‌ను సంబంధిత రిజిష్టరులో నమోదు / డాక్యు మెంటేషన్ నివేదికను రూపొందించడం.
- సమావేశానికి మాదిరి పాఠ్యాంశ ప్రదర్శనకు, ఇతర సెషన్లకు అవసరమైన బోధనాభ్యసన సామగ్రిని సమకూర్చడం.
- సమావేశంలో విషయ నిపుణుడిగా వ్యవహరించడం.
- సమావేశ నిర్వహణకు అవసరమైన మానవ వనరులను గుర్తించడం వారి సేవలను వినియోగించుకోవడం.
- ✦ **ఉపాధ్యాయులకు ఒక విషయ నిపుణుడిగా సాయమందించడం.**
- మాదిరి పాఠ్యాంశ ప్రదర్శనను ఇవ్వడం
- ఉపాధ్యాయులకు వృత్తిపరమైన సాయాన్ని అందించడం.
- వివిధ సబ్జెక్టులకు సంబంధించిన కఠిన భావనలకు బోధనాభ్యసన సామగ్రిని రూపొందించడం.
- అన్ని సబ్జెక్టులలో ప్రశ్నా నిధులు, పరీక్షాంశాలను రూపొందించడం.
- ఉపాధ్యాయులు వారు బోధిస్తున్న తరగతికి పూర్తిచేసిన సిలబస్ ప్రకారం సొంతంగా ప్రశ్నాపత్రాలను రూపొందించుకోవడంలో తగిన సాయం అందించడం.
- వృత్యంతర శిక్షణ కార్యక్రమాలలో విషయ నిపుణుడుగా వ్యవహరించడం.
- పాఠశాలల్లో అమలులో ఉన్న వివిధ గుణాత్మక కార్యక్రమాలను మానిటరింగ్ చేయడం.
- ✦ **డేటాబేస్ నిర్వహణ**
- క్లస్టర్ పాఠశాలల నుండి డేటాను సేకరించడం, క్రోడీకరించడం
- క్లస్టర్‌కు అనుసంధానం చేయబడిన ఆవాసప్రాంతాలలోని 6-14 సం॥ల వయస్సుగల పిల్లలందరి సమాచారాన్ని సేకరించడం.
- క్లస్టర్ పాఠశాలల్లో అందుబాటులో ఉన్న భౌతిక సదుపాయాలు, ఇంకా అవసరమున్న భౌతిక సదుపాయాలు మొదలగు వివరాలను సేకరించడం.
- ఉపాధ్యాయుల డేటా బేస్
- ✦ **బోధనోపకరణాలు - టివి, రేడియో, ఆర్‌సిసిపి, డివిడి ప్లేయర్, డిష్ అంటెన్నా, గణితం / సైన్స్ కిట్లు, ఛార్టులు, నమూనాలు, మ్యాపులు, పాఠ్య పుస్తకాలు, కంప్యూటర్, ప్రయోగశాల పరికరాలు మొ॥ వాటిని నిర్వహించడం, వినియోగించడం.**
- ✦ **పాఠశాల సముదాయం గ్రంథాలయ నిర్వహణ**
- స్టాక్ రిజిష్టర్‌లో గ్రంథాలయ పుస్తకాలను నమోదు చేయడం.
- రిఫరెన్స్ పుస్తకాలను ఉపాధ్యాయులకు ఇవ్వడం. తిరిగి తీసుకోవడం. ఈ వివరాలను ఇష్యూ రిజిష్టర్‌లో నమోదు చేయడం.
- గ్రంథాలయ పుస్తకాలు / మ్యాగజైన్లు సమకూర్చు కోవడంలో సముదాయ ప్రధానోపాధ్యాయులకు సహకరించడం.
- పాఠశాల సముదాయానికి సంబంధించిన అన్ని రికార్డులను నిర్వహించడం.
- క్లస్టర్ స్థాయి ఎగ్జిబిషన్లు, మేళాలు మొ॥ నిర్వహిం చడంలో పాఠశాల సముదాయ ప్రధానోపాధ్యాయులకు సహకరించడం.
- బడిబయటి పిల్లల కొరకు ముఖ్యంగా పని నుండి విముక్తి పొందిన బాలకార్మికుల కోసం ఉద్దేశించబడిన అన్ని కార్యక్రమాలను అమలు చేయడం.
- పాఠశాల సముదాయ విధులలో - నమోదు, నిలకడ, సామర్థ్యాల సాధనలో నాణ్యతలలో ప్రగతిని ఎప్పటికప్పుడు తెలుసుకొని నమోదు చేయడంలో సహకరించడం.
- పాఠశాలల్లో నమోదు కాని, డ్రాపౌట్ అయిన పిల్లల చదువు గురించి కృషి చేయడంలో తన వంతు పాత్రను పోషించడం.
- పాఠశాల సముదాయ ప్రధానోపాధ్యాయులు అకడమిక్ అంశానికి సంబంధించి అప్పగించే ఏ ఇతర పనినైనా నిర్వర్తించడం.


యన్.కుమార్ రాజా
ఐక్యఉపాధ్యాయ సంపాదకవర్గ సభ్యులు

***MIS* కో-ఆర్డినేటరు జాబ్‌ఛార్టు :**

- మండల స్థాయి డైస్ మరియు ప్లానింగ్‌తో సహా అన్ని రకముల సాంఖ్యక వివరాలు నిర్వహించడం.
- వెబ్‌పోర్టల్ డేటా నిర్వహించడం.
- రాజీవ్ విద్యామిషన్‌కు సంబంధించిన అన్ని రకాల డేటా నిర్వహించడం
- మండల పరిధిలోని పాఠశాలల్లోగల కంప్యూటర్ల స్థితిని పర్యవేక్షించడం.

## భారతదేశ విద్యా చరిత్ర

చరిత్ర గురించి చెప్పే పుస్తకాలు చాలా ఉన్నాయి. విద్యా చరిత్ర పుస్తకాలు అరుదు. అవి కూడా పోటీ పరీక్షల కోసమో, సిలబస్‌లో భాగంగానో వ్రాసినవి. అలాకాకుండా సమగ్రంగాను, సంక్షిప్తంగాను, ముఖ్యమైన ఏ ఒక్క విషయాన్ని వదలకుండా రచయిత కె.కేశవరెడ్డి పుస్తకాన్ని రాశారు. వీరు రచయితగా, అనువాదకునిగా 30 సం॥పై బడిన అనుభవం ఉన్నవారు. 'ఐక్యఉపాధ్యాయ' - సంపాదకులుగా పనిచేశారు. ఈ పుస్తకం క్లిష్టత లేకుండా, తేలిగ్గా అందరూ చదివే విధంగా ఉంది. డిఇడి, బిఇడి, విద్యార్థులకు, డిఎస్‌సి, గ్రూప్స్, సివిల్స్ పోటీ పరీక్షల అభ్యర్థులకూ ఎంతో ఉపయోగిస్తుంది.




1813 చార్టరు యాక్టు నుండి 2010 విద్యాహక్కు చట్టం వరకు, అన్ని కమీషన్లు, కమిటీ రిపోర్టుల మంచీ చెడుల విశ్లేషణ ఇందులో ఉంది. ఆయా చట్టాల రూపకల్పన, అమలులో ఉన్న అంతరాలను చెప్పింది. ప్రజల ఆకాంక్షలకు, ప్రభుత్వ ప్రాధాన్యతలకు ఉన్న బేధాలను చెప్పింది. ప్రాథమిక విద్యారంగం ఒక గొడుగు క్రింద లేకుండా ఎయిడెడ్, మిషనరీ, మైనార్టీ, స్థానిక సంస్థల, రాష్ట్ర ప్రభుత్వ, కేంద్ర ప్రభుత్వ పాఠశాలలుగా ఎలా ముక్కచెక్కలయిందీ ఇది చదవడం వల్ల అర్థం చేసుకోవచ్చు. విద్యారంగంలోని ప్రస్తుత సమస్యలని అర్థం చేసుకోవడానికి, భవిష్యత్ సవాళ్ళని ఎదుర్కోవడానికి ప్రతి ఒక్కరూ తప్పక చదవాల్సిన పుస్తకమిది.

ఈ పుస్తకంలోని మొదటి భాగం చాలాకాలం క్రితం వెలువడింది. రెండవ భాగంతో కలిపి, ఒకే వాల్యూమ్‌గా ప్రజాశక్తి బుక్‌హౌస్ అందిస్తోంది. మొదటి భాగానికి రాసిన ముందుమాటలో "విద్యారంగం లో వివిధ దశలలో చేపట్టిన మార్పుల్ని యథాతథంగా వివరించటంతో సరిపెట్టుకోకుండా, ఆయా దశలలోని సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల పూర్వరంగాన్ని వివరించడం ద్వారా రచయిత ఆ మార్పులు మరొక రకంగా గాక అలాగే జరగడానికి గల కారణాలను సహేతుకంగా విశ్లేషించారు" అని స్వర్గీయ ఎమ్మెల్సీ ఎంజె మాణిక్యారావు చెప్పారు. "విద్యా విధానాల రూపకల్పనకు పాలకవర్గ రాజకీయ ప్రయోజనాలకు మధ్యగల సంబంధాన్ని రచయిత విస్తృత అధ్యయనంతో, నిశిత పరిశీలనలతో ప్రతిభావంతంగా చిత్రించాడు'' అని మాజీ ఎమ్మెల్సీ, యుటియఫ్ సీనియర్ నాయకులు డి.రామిరెడ్డి వ్యక్తం చేశారు.

'తెలియని మంచి కంటే తెలిసిన చెడుని సంప్రదాయ వాదం సమర్థిస్తుంది' 'వివాదాలుండడం తప్పుకాదు, వివాదం ప్రజాస్వామ్య విధానానికి గీటురాయి, కానీ వివాదం తరువాత చేపట్టే చర్యలు విజ్ఞానానికి, సత్యానికి, అభివృద్ధికి దారితీయాలి' 'జాతీయ భాషలు అభివృద్ధి చెందడం మధ్య తరగతికి, సాధారణ ప్రజలకు ప్రయోజన కరంగా ఉంటుంది. కాని దానితో ప్రస్తుతం ఆధిపత్యం చెలాయించే వారి ప్రయోజనాలు దెబ్బతింటాయి!' "స్త్రీ విముక్తి కొరకు చేసే పోరాటం పీడిత, తాడిత జన విముక్తి కొరకు చేసే విస్తృత పోరాటంతో సన్నిహితమైన మేరకు కొత్త బలాన్ని సంతరించు కుంటుంది" ఇలాంటి వ్యక్తీకరణలు రచయిత స్థాయిని వెల్లడించడమే కాక, పుస్తకం విలువని తెలుపుతుంది. 320 పేజీల పుస్తకం వెల రూ.200/-.ప్రజాశక్తి బుక్‌హౌస్‌లో లభ్యమవుతుంది.

**- కె.సాయిప్రసాద్, గుంటూరు జిల్లా**

---

- మండల విద్యాధికారి కేటాయించిన కార్యాలయ పనిని నిర్వహించడం.
- డైస్ మరియు ఇతర డేటాలను విశ్లేషించడం.

ప్రత్యేకించి స్టేట్ ప్రాజెక్టు డైరెక్టరు, రాజీవ్ విద్యామిషన్ మరియు కమీషనర్, సి& డిఎస్ఇ సర్క్యులర్ ఆర్‌సి నం.766/A4/SSA/2013, తేది.09.05.2013 ప్రకారం.....

- మండల రిసోర్సు సెంటర్, క్లస్టర్ రిసోర్సు సెంటరు, స్కూల్ మేనేజ్‌మెంట్ కమిటీలకు చెందిన అక్కౌంట్ పుస్తకాలు నిర్వహణ MIS కో-ఆర్డినేటర్ పరిశీలించాలి.
- మండల స్థాయి ప్రధానోపాధ్యాయుల సమావేశంలో *MRC, CRC* మరియు *SMC* అక్కౌంట్సుకు సంబంధించి ఆర్థిక స్థితిని సమీక్షించాలి. ఇందుకు మండల విద్యాశాఖాధికారి, MIS కో-ఆర్డినేటర్‌కు తగిన సమయం కేటాయించాలి.
- ఫైనాన్షియల్ మానిటరింగ్ సిస్టమ్‌కు సంబంధించి MIS కో-ఆర్డినేటర్లు జిల్లా ఫైనాన్స్ మరియు అక్కౌంట్స్ అధికారి నియంత్రణలో ఉంటారు.
- జిల్లా అధికారిచే జారి చేయబడిన సూచనలకు సంబంధించిన నిధుల నిర్వహణ, వినియోగం, అక్కౌంట్స్ నిర్వహణ, వోచర్ల భద్రపరచడం, బ్యాంక్ పాసపుస్తకాల నిర్వహణ తదితర అంశాలను ఎప్పుడికప్పుడు మండల విద్యాశాఖాధికారి మరియు ప్రధానోపాధ్యాయులకు తెలియజేయాలి.
- ప్రతినెల *SMC / CRC* వారీగా నివేదికలు రూపొందించి జిల్లా ఫైనాన్స్ మరియు అక్కౌంట్స్ అధికారికి పంపాలి.
- మండల స్థాయి ఆడిట్ నిర్వహణ సందర్భంలో MIS కో-ఆర్డినేటర్లు బాధ్యులుగా ఉంటారు.
- MIS కో-ఆర్డినేటర్లు, డేటా ఎంట్రి ఆపరేటర్లు, క్లస్టర్ రిసోర్సు పర్సనులను సర్వశిక్షా అభియాన్ ఇతర పనులకు వినియోగించరాదు.
- *MRC*లో గల ఇంటర్నెట్ మోడెమ్ మరియు నెట్‌వర్క్‌లను MIS కో-ఆర్డినేటర్స్ నిర్వహించాలి. డేటా ఎంట్రి ఆపరేటరు వారి వారి మార్గదర్శకత్వంలో విధులు నిర్వహించాలి.

విద్యాహక్కు చట్టం అమలు పరచడానికి సర్వశిక్షా అభియాన్ పథకం క్రింద నియమించబడిన క్లస్టర్ రిసోర్సు పర్సనులు, MIS కో-ఆర్డినేటర్ల పై పేర్కొన్న తమ జాబ్‌చార్టులను అవగాహన చేసుకొని తమ విధులను నిర్వహించ వలసి ఉంటుంది. అలాగే మండల విద్యాశాఖాధికారులు, ప్రధానోపాధ్యాయులు వారి జాబ్‌చార్టులలో పేర్కొన్న అంశాల మేరకు క్లస్టర్ రిసోర్సు పర్సనులకు, MIS కో-ఆర్డినేటర్లకు తగిన అవకాశం కల్పించగలరని ఆశిద్దాం.

# యుటియఫ్ రాష్ట్ర ప్రథమ మహాసభలో ఎన్నికైన నూతన ఆఫీస్ బేరర్లు


ఎన్.నర్సింహులు, గౌరవాధ్యక్షులు


ఐ.వెంకటేశ్వరరావు, అధ్యక్షులు


కె.విజయగౌరి, సహాధ్యక్షులు


ఎన్.వెంకటేశ్వర్లు, సహాధ్యక్షులు


పి.బాబురెడ్డి, ప్రధానకార్యదర్శి


కె.సంజీవరెడ్డి, కోశాధికారి


కె.ఎస్.ఎస్.ప్రసాద్, కార్యదర్శి


ఎన్.సోమచంద్రారెడ్డి, కార్యదర్శి


సి.చంద్రశేఖర్, కార్యదర్శి


కె.శ్రీనివాసరావు, కార్యదర్శి


ఎం.రామకృష్ణ, కార్యదర్శి


గొంటి గిరిధర్, కార్యదర్శి


డి.రాము, కార్యదర్శి


పి.లీల, కార్యదర్శి


ఎస్.జయప్రభ, కార్యదర్శి

## ఆడిట్ కమిటీ సభ్యులు


కె.సత్తిరాజు, కన్వీనర్


బి.మాణిక్యంశెట్టి, సభ్యులు


కె.కృష్ణమూర్తి, సభ్యులు


మహ్మద్ గౌస్, సభ్యులు

## ఐక్యఉపాధ్యాయ


పి.బాబురెడ్డి, ప్రధాన సంపాదకులు


ఐ.వెంకటేశ్వరరావు, సభ్యులు


సిహెచ్.సుభాష్‌చంద్రబోస్, సభ్యులు


ఎన్.కుమార్ రాజా, సభ్యులు


టిఎస్ఎల్ఎన్ మల్లేశ్వరరావు, సభ్యులు


సిహెచ్.శ్రీహరి, సభ్యులు




## మహాసభ ర్యాలీ



శ్రీమతి ఎస్.మహేశ్వరి, ఆక్టా ప్రధానకార్యదర్శి



కె.మోహన్‌రాజ్, అధ్యక్షులు
సోషల్ వెల్ఫేర్ రెసిడెన్షియల్ ఎంప్లాయిస్ ఫెడరేషన్



వి.ఎల్.పి.రాజు, ఏజెసిఇఎ.ఏపి ప్రధానకార్యదర్శి



డి.లక్ష్మణరావు, అధ్యక్షులు, టిఆర్ఇటిఏ





బి.జె.గాంధీ, అధ్యక్షులు, కాంట్రాక్ట్ లెక్చరర్స్ అసోసియేషన్



దామచర్ల మధుసూదనరావు, ప్రధానకార్యదర్శి
ఆం.ప్ర.గురుకుల విద్యాలయాల ఉపాధ్యాయ సంఘం



మహాసభల ఏర్పాట్లకై బాధ్యతలు తీసుకొన్న కార్యకర్తలు

# నవ్యాంధ్రప్రదేశ్‌లో రాష్ట్ర మహాసభల దృశ్యాలు


చెన్నుపాటి లక్ష్మయ్యగారికి పూలవేసి జోహార్లు అర్పిస్తున్న


వి.బాలసుబ్రహ్మణ్యం, ఎమ్మెల్సీ


డి.రామిరెడ్డి, మాజీ ఎమ్మెల్సీ


కె.రాజేంద్రన్
ఎస్‌టిఎఫ్ఐ జాతీయ అధ్యక్షులు


కె.వేణుగోపాల్, ఏఐఐఈఏ జాతీయ నాయకులు


రాము సూర్యారావు


వై.శ్రీనివాసులురెడ్డి, ఎమ్మెల్సీ





బి.నాగేశ్వరరావు, ఎమ్మెల్సీ


గౌ॥శ్రీమతి షేక్ నూర్జహాన్
మేయర్ ఏలూరునగరం & ఆహ్వాన సంఘ అధ్యక్షులు


పి.బాబురెడ్డి, యుటియఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి


సి.హెచ్.సుభాష్‌చంద్రబోస్
యుటియఫ్ సీనియర్ నాయకులు


బడేటి కోటరామారావు, ఎమ్మెల్యే ఏలూరు


సభలో పాట పాడుతున్న చిన్నారి


జి.చిట్టిబాబు,యుటియఫ్ సీనియర్ నాయకులు

# ప్రతినిధుల సభ



డి.రామిరెడ్డి, మాజీ ఎమ్మెల్సీ, కె.రాజేంద్రన్, ఎస్‌టిఎఫ్ఐ జాతీయ అధ్యక్షులు


ఎస్.కె.సాజ్జీ


కె.ఎస్.ఎస్.ప్రసాద్


కె.విజయగౌరి


ఎన్.అరుణకుమారి


వి.కోటేశ్వరప్ప


ఎ.నర్సిరెడ్డి
టిఎస్‌యుటిఎఫ్ రాష్ట్ర అధ్యక్షులు


ఎన్.బోసుబాబు
ఎపిఎంఎస్‌టిఎఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి


కె.శ్రీనివాసరావు


పి.రమణారెడ్డి


కె.పరంధామయ్య


సిహెచ్.శ్రీహరి


బి.లక్ష్మిరాజా


డి.రామశేషయ్య


కె.సురేష్‌కుమార్


కె.శేషగిరి


ఎస్.పి.మనోహర్


జి.రమేష్


ఎస్.శ్రీకాంత్


కె.నాగమల్లేశ్వరరావు


ఎం.హనుమంతరావు


గొంటి గిరిధర్


ఎం.సోమశేఖర నాయుడు


ఎన్.గుణశేఖర రెడ్డి


ఆర్.మోహనరావు


కె.జాజులు


టి.కామేశ్వరరావు






రాష్ట్ర కౌన్సిల్ సమావేశం

# నిరాశ పరచిన 10వ పిఆర్‌సి నివేదిక

10వ వేతన సంఘం (పిఆర్‌సి) నివేదిక ఉద్యోగులు, ఉపాధ్యాయులకు నిరాశను కలిగించింది. ఉద్యోగ సంఘాల విజ్ఞప్తులను ఒకటి, రెండు మినహా అంగీకరించలేదు. కనీస వేతన నిర్ణయం కూడా శాస్త్రీయంగా లేదు. కుటుంబం అంటే సగటున 4 గురు సభ్యులను ఒక యూనిట్ తీసుకోవాల్సి ఉండగా ముగ్గురు సభ్యులకే పరిమితం చేసింది. వస్తు వినిమయం, వాటి వాస్తవ ధరలను పరిగణనలోకి తీసుకోకుండా ఖర్చును అంచనా వేసి రు.13000 కనీస వేతనంగా నిర్ణయించింది. ఫిట్‌మెంట్ నిర్ణయం కూడా లోపభూయిష్టంగా ఉన్నది. పిఆర్‌సి నిర్ణయించిన కనీస వేతనం ప్రకారమైనా 29 శాతం ఫిట్‌మెంట్ సరిపోవటం లేదు. ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలు వర్తమాన సగటు జీవన వ్యయం విద్య, వైద్య అవసరాల ప్రకారం గౌరవ ప్రదమైన వేతనాల కోసం 60శాతం పైగా పెరుగుదల ఉండాలని ప్రతిపాదించగా, పిఆర్‌సి అందులో సగానికంటే తక్కువగా సిఫారసు చేయటం ఆమోదయోగ్యంగా లేదు. నూతన వేతనాలు 01.07.2013 నుండి అమలు జరపాలని సూచించినప్పటికీ పెరిగిన వేతనాల ఆర్థిక ప్రయోజనం ఎప్పటినుండి కల్పించాలనే అంశంపై మౌనంగా ఉండిపోయింది. ఇంక్రిమెంటు రేటు 3 శాతం పైగా ఉండాలని ఉద్యోగ సంఘాలు కోరగా కమీషన్ 3% నుండి 2.33% వరకే పరిమితం చేసింది. హెచ్ఆర్ఎ ఆటోమాటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీంలలో మార్పు చేయలేదు. ఎఎఎస్‌లో గల వ్యత్యాసాలను సవరించాలనే విజ్ఞప్తులను పట్టించుకోలేదు. వేతన నిర్ణయంలో కనీస వేతనం, ఫిట్‌మెంటు, ఇంక్రిమెంటు రేటు, ఆర్థిక ప్రయోజనం తేది అనేవి నాలుగు చాలా కీలకమైన అంశాలు. కాగా వీటిపై పిఆర్‌సి చేసిన సిఫారసులు ఉద్యోగులను సంతృప్తిపరచలేకపోయాయని చెప్పవచ్చు. పిఆర్‌సి అమలు ఇప్పటికే ఆలస్యమైందని ఉద్యోగులు, ఉపాధ్యాయులు, పెన్షనర్లు ఆందోళన చెందుతున్నారు.

రాష్ట్ర ప్రభుత్వం 4గురు కేబినెట్ మంత్రులు శ్రీయుతులు యనమల రామ కృష్ణుడు, గంటా శ్రీనివసరావు, పత్తిపాటి పుల్లారావు, కామినేని శ్రీనివాస్‌గార్లతో సబ్ కమిటీ వేసి పిఆర్‌సి రిపోర్టుపై చర్చించి తగు ప్రతిపాదనలు ఇవ్వాలని ఆదేశించింది.

మంత్రుల సబ్ కమిటీ జనవరి 5, మరియు 13 తేదీలలో రెండు దఫాలు చర్చలు జరిపింది. అయినా ఏలాంటి ప్రతిపాదనలు ప్రభుత్వం వైపు నుండి రాలేదు. జెఏసి ఆధ్వర్యంలో అన్ని సంఘాలు సమావేశమై 69% ఫిట్‌మెంట్‌తో తేది.01.07.2013 నుండి ఆర్థిక లాభంతో పిఆర్‌సి అమలు చేయాలని తీర్మానించింది. ప్రభుత్వంతో జరిపే చర్చలు జెఏసి ఆధ్వర్యంలోనే జరపాలని, అన్ని డిపార్టుమెంట్‌లకు ఒకేసారి ఒకే ఉత్తర్వుల్లో పిఆర్‌సి అమలు చేయాలని ప్రభుత్వాన్ని కోరడమైనది.

కాని ప్రభుత్వ వైఖరి సాచివేతగా ఉంది. తెలంగాణ ప్రభుత్వం 43% ఫిట్‌మెంట్‌తో పిఆర్‌సి ప్రకటించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆర్థిక లోటు ఎక్కువగా ఉంది. మీరు బాగా పనిచేసి లాభాలు పెంచండి మంచి పిఆర్‌సి ఇస్తామంటుంది. అన్ని పథకాలు అమలు చేస్తామంటున్న ప్రభుత్వం ఉద్యోగుల విషయంలో ఇలా వ్యవహరించడం సరైనది కాదు. వెంటనే ముఖ్యమంత్రిగారు, మంత్రివర్గ ఉపసంఘం జెఏసితో చర్చించి మెరుగైన పిఆర్‌సి ఇవ్వాలని యుటియఫ్ డిమాండ్ చేస్తోంది.

### 10వ పిఆర్‌సి సిఫారసులు - ముఖ్యాంశాలు

కనీస వేతనం - రు.13000, గరిష్ట వేతనం - రు.110850, మాస్టర్ స్కేలు - 32 గ్రేడులు, 80 సెగ్మెంట్లు.

**ప్రతిపాదిత మాస్టర్ స్కేలు:-**
13000-390-14170-430-15460-470-16870-510-18400-550-20050-590-21820-640-23740-700-25840-760-28120-820-30580-880-33220-950-36070-1030-39160-1110-42490-1190-46060-1270-49870-1360-53950-1460-58330-1560-63010-1660-67990-1760-73270-1880-78910-2020-84970-2160-91450-2330-100770-2520-110850 (80)

స్టాగ్నేషన్ ఇంక్రిమెంట్లు '5', పిఆర్‌సి అమలు తేది: 01.07.2013, ఫిట్‌మెంట్ - మూలవేతనంపై 29%

**వేతన స్థిరీకరణ సూత్రం:** మూలవేతనం + 63.344% డిఎ + 29% ఫిట్‌మెంట్‌ల మొత్తాన్ని కరస్పాండింగ్ స్కేలులో తదుపరి స్టేజీ వద్ద స్థిరీకరించాలి.

**ఉపాధ్యాయుల స్కేళ్ళు - కరస్పాండింగ్ స్కేళ్ళు**

| కేడర్ | ప్రస్తుతం | సిఫారసు |
|---|---|---|
| ఎస్‌జి టి, భాషా పండితులు, పిఇటి క్రాఫ్ట్ టీచర్లు | 10900 - 31550 | 21230 - 63010 |
| ఎస్ఎ, పిడి, ఎల్ఎఫ్ఎల్ హెచ్ఎం | 14860 - 39540 | 28940 - 78910 |
| హెచ్ఎం, గ్రేడ్2, | 18030 - 43630 | 35120 - 87130 |
| ఎంఇఒ, డిప్యూటీ ఐఓఎస్ | 16150 - 42590 | |
| హెచ్ఎం, గ్రేడ్1, డిప్యూటీ ఈఓ | 18030 - 43630 | 40270 - 93780 |
| డిఇఓ | 21820 - 48160 | 46060 - 98440 |

ఎంఇఓలకు ఒకస్టేజి, డిప్యూటీ ఈఓ లకు రెండు స్టేజీలు, డిఇఒలకు ఒక స్టేజి కరస్పాండింగ్ స్కేళ్ళ కంటే అదనంగా సిఫారసు చేశారు.

### పే ఫిక్సేషన్ అనంతరం అలవెన్సులు

**డి.ఎ. :** 1-1-2014 నుండి కేంద్ర ప్రభుత్వం ప్రకటించే ప్రతి 1% డి.ఎ.కు రాష్ట్రంలో 0.524% డిఎ చెల్లించాలి.

**హెచ్ఆర్ఎ :** హెచ్ఆర్ఎ రేట్లు (30%, 20%, 14.5%, 12%)లో మార్పు లేదు. జిహెచ్ఎంసి 30% (50 లక్షల పైబడిన జనాభా ఉన్న నగరం)

**20% (2లక్షలు పైబడి జనాభా గల పట్టణాలు):** కొత్తగా నంద్యాల, ఒంగోలు, విజయనగరం, ప్రొద్దుటూరు పట్టణాలకు వర్తింపచేశారు.

జిల్లా కేంద్రాలు అయిన శ్రీకాకుళం, మచిలీపట్నం, చిత్తూరు 20% పెంచకపోవడం శోచనీయం.

**మునిసిపల్ పట్టణాలకు - 14.5%** (50 వేలుపైబడి 2 లక్షల వరకు జనాభాగల పట్టణాలు) : ఏపిలో 57 పట్టణాలకు 14.5% హెచ్ఆర్ఎ సిఫారసు చేయబడింది. కొత్తగా పలాసకాశీబుగ్గ, పార్వతీపురం, మండపేట, జగ్గయ్యపేట, మాచర్ల, పిడుగురాళ్ల, తాడేపల్లి, రేపల్లే, వెంకటగిరి, బద్వేల్, జమ్మలమడుగు, పులివెందుల, రాజంపేట, ఎమ్మిగనూర్, డోన్, నగిరి, పుత్తూరు, పుంగనూరు, పలమనేరు.

ఇతర గ్రామాలు, 50 వేలలోపు జనాభాగల పట్టణాలన్నింటికీ - 12% : నగరాలు, పట్టణాలు శివారులో 8 కి.మీ. పరిధిలో పనిచేసే ఉద్యోగులందరికీ ఆయా నగరాల హెచ్ఆర్ఎ రేట్లు వర్తిస్తాయి.

**హెచ్ఆర్ఎ పరిమితి:** జిహెఎంసిలో రు.12000/- నుండి రు. 20000/-కు ఇతర ప్రాంతాలలో రు.8000/- నుండి 15000/-కు పెంపు.

**ఏహెచ్ఆర్ఎ (అదనపు ఇంటిఅద్దె అలవెన్స్):-** మూలవేతనంపై 8% చొప్పున నెలకు గరిష్టంగా రు.2000/- (ప్రస్తుతం 8% గరిష్టంగా రు.1000 ఉన్నది)

సిసిఎ

| ఆర్‌పిఎస్2013లో | జిహెచ్‌ఎంసి (హైదారాబాద్) | జివిఎంసి (విశాఖ) విజయవాడ | ఇతర నగరాలు |
|---|---|---|---|
| రు.16400 వరకు రు.16400 పైబడి | 400 | 250 | 200 |
| 28940 వరకు | 600 | 350 | 300 |
| 28940 పైబడి 37100 వరకు | 700 | 450 | 350 |
| 37100 పైన | 1000 | 700 | 500 |

ఆంధ్రప్రదేశ్‌లో నూతనంగా అనంతపురం, చిత్తూరు, ఏలూరు, గుంటూరు, కాకినాడ, కడప, కర్నూలు, నెల్లూరు, ఒంగోలు, రాజమండ్రి, తిరుపతి పట్టణాలకు విస్తరించారు.

**స్పెషల్ పే:-** అంధ, బధిర పిల్లల కోసం నిర్వహించబడే ప్రభుత్వ ఎయిడెడ్ ప్రత్యేక పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులకు నెలకు 1. ప్రిన్సిపాల్ - రు.500, 2. పిజిటి - రు.400, 3. టిజిటి - రు.400, 4. ఎస్‌జిటి - రు.350, 5. హయ్యర్ ఎలిమెంటరీ టీచర్స్ - రు. 250, 6. స్పెషలిస్ట్ టీచర్స్ - రు.250

**ఉపాధ్యాయుల స్పెషల్ పేలు**

| క్ర. సం. | పదవి | ప్రస్తుతం రు.లలో | సిఫారసు రు.లలో |
|---|---|---|---|
| 1 | ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయులకు | 75 | 125 |
| 2 | యుపిఎస్ హెచ్‌ఎం | 100 | 150 |
| 3 | ఉన్నత తరగతులు బోధించే ఎల్‌పి 2/ ఎస్‌జి టిలకు | 100 | 150 |
| 4 | ఏకోపాధ్యాయ పాఠశాలల ప్రధాన ఉపాధ్యాయులకు | 50 | 100 |

**ఆటోమాటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీం:-**

- ఆటోమాటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీం ప్రస్తుతం ఉన్న రీతిలోనే (6/12/18/24 సం॥) కొనసాగుతుంది.
- (స్టెప్ అప్‌కు సబ్జెక్టు రిలవెన్సీ తొలగించాలి, 6జి (ఐ)ను ఎఎఎస్ స్కేళ్ళకు వర్తింపజేయాలని, ఎస్‌పిపి-2 తీసుకుని ప్రమోటైన వారికి 6 సం॥ స్కేలు (ఎస్‌జి) ఇవ్వాలని తదితర ఎఎఎస్‌లోని అనామలీస్‌పై సంఘాలు చేసిన ఏ ఒక్క ప్రతిపాదననూ పిఆర్‌సి అంగీకరించలేదు.) సర్వీసురూల్స్‌లో మార్పులు జరిగి పదోన్నతికొరకు అదనపు అర్హతలు అవసరమైన పక్షంలో వాటికి మినహాయింపునిచ్చి ఎఎఎస్ స్కీములో స్పెషల్ ప్రమోషన్ పోస్టు స్కేలు ఇవ్వాలని కమీషన్ సిఫారసు చేసింది.
- ఎఎఎస్‌లో ఎస్‌జి, ఎస్‌పిపి-1ఎ, ఎస్‌పిపి-బి స్కేళ్ళు పొందిన ఉద్యోగులకు కూడా రెగ్యులర్ ప్రమోషన్ సందర్భంలో ఎఫ్ఆర్ 22బి వర్తింపజేయాలి.
- రెగ్యులర్ పదోన్నతులకు వర్తించే మినహాయింపులన్నీ అప్రయత్నంగా ఎఎఎస్‌లో ఎస్‌పిపి-1ఎ, ఎస్‌పిపి-1బి స్కేళ్ళు పొందటానికి వర్తిస్తాయి.
- అటెండర్స్, దఫేదార్, జమేదార్, మరియు రికార్డ్ అసిస్టెంట్ లేదా రోనియో ఆపరేటర్‌లలో చేసిన మొత్తం సర్వీసును ఎఎఎస్ స్కేళ్ళ మంజూరుకు లెక్కించాలి.
- ఎఎఎస్ స్కీము XXV గ్రేడ్ (రు. 49870 - 100770 స్కేలు) వరకే పరిమితం చేయాలి.

**సెలవులు:-** ప్రసూతి సెలవు (మెటర్నిటీ సెలవు) 180 రోజులు కొనసాగుతుంది.

**చైల్డ్ కేర్ లీవు :** మొదటి ఇరువురు పిల్లలకు 18 సం॥ వయస్సు వచ్చేవరకు వారి సంరక్షణ కొరకు 2 సం॥ల (730 రోజులు) శిశు సంరక్షణ సెలవు మంజూరు చేయాలని పిఆర్‌సి సూచించింది.

- బోధనేతర మహిళా ఉద్యోగులకు ఉపాధ్యాయినులతో సమానంగా 5 రోజుల అదనపు సి.ఎల్.ల మంజూరుకు పిఆర్‌సి తిరస్కరించింది.

**ఎన్‌క్యాష్‌మెంట్‌ఆఫ్ హెచ్‌పిఎల్ :** రిటైర్మెంట్ సందర్భంలోఎరండ్‌లీవు, హాఫ్‌పేలీవ్ కలిపి 300 రోజుల పరిమితితో నగదుగా మార్చుకొనే సందుపాయాన్ని కొనసాగించాలని, ప్రభుత్వ ఉద్యోగులతోపాటు, పంచాయతీరాజ్, మునిసిపల్, ఎయిడెడ్ సంస్థలలోని ఉద్యోగులకు కూడా ఈ ప్రయోజనం వర్తింపజేయాలని సిఫారసు చేసింది.

- **పెటర్నిటీ సెలవు:** ప్రస్తుతం ఉన్న 15 రోజుల పితృత్వ సెలవులో మార్పులేదు.
- వికలాంగులు ప్రాస్తెటిక్ ఎయిడ్స్ మార్చిడి కొరకు వైద్యకేంద్రాలను సందర్శించటానికి సం॥లో 7 రోజులు స్పెషల్ క్యాజువల్ సెలవులు (ఎస్‌సిఎల్) ఇవ్వాలని సిఫారసు చేసింది.
- తల్లిదండ్రుల కర్మకాండల కొరకు 10-15రోజుల ప్రత్యేక సెలవు ఇవ్వాలన్న అభ్యర్ధనను తిరస్కరించింది.
- ఎరండ్‌లీవ్ ఎన్‌క్యాష్‌మెంట్ పరిమితిని 300 నుండి 360 రోజులకు పెంచాలన్న అభ్యర్ధనను తిరస్కరించింది.

**టిఎ రేట్లు :** ఉద్యోగులను గతంలో లాగానే 3 గ్రేడులుగా విభజించారు.

1. రు.49870 - 100770 స్కేలుపైన ఉన్నవారు గ్రేడ్ - 1
2. రు.28940 - 78910 నుండి 46060 - 98440 వరకు గల స్కేళ్ళలో ఉన్నవారు గ్రేడ్ - 2
3. మిగిలి స్కేళ్ళలో ఉన్నవారంతా గ్రేడ్ - 3

**ట్రావెలింగ్ డిఎ**

| గ్రేడ్ | డిఎ రాష్ట్రం లోపల | | డిఎ రాష్ట్రం వెలుపల | |
|---|---|---|---|---|
| | ప్రస్తుతం | సిఫారసు చేసింది | ప్రస్తుతం | సిఫారసు చేసింది |
| I | 300 | 450 | 400 | 600 |
| II | 200 | 300 | 300 | 450 |
| III | 150 | 225 | 200 | 300 |

**కన్వేయన్స్ అలవెన్స్ :-** కన్వేయన్స్ చార్జీలు కి.మీ.కి రు.2.25 చొప్పున గరిష్టంగా ఒక వైపు ప్రయాణానికి రు.40

**ఎల్‌టిసి:-** మొదటి 2 సం॥ హోంటౌన్, ఆతర్వాతి 2 సం॥లలో ఎల్‌టిసి అనే ప్రస్తుత విధానం కొనసాగుతుంది. ఎల్‌టిసి బ్లాక్ పీరియడ్‌లో సర్వీసులో ఒక్కసారి దేశంలో (3500 కి.మీ. లేదా రు.18750 అనే పరిమితికి లోబడి) ఎక్కడికైనా వెళ్ళి రావచ్చనే సౌకర్యం కొనసాగుతుంది.

- రైల్వే/ఆర్‌టిసిలతో చర్చించి ఉద్యోగులకు వారంట్ జారీ చేసే అంశంలో సాధ్యాసాధ్యాలను పరిశీలించాలని సూచించింది.
- ఎన్‌జిఓలకు బస్‌పాస్‌లు

ఆర్‌టిసి సిటీ సర్వీసులు నడుపుతున్న అన్నీ మున్సిపల్ నగరాలు, పట్టణాలలో ఎన్‌జిఓలకు రాయితీతో కూడిన బస్‌పాస్‌ల సౌకర్యాన్ని వర్తింపజేయాలని సూచించింది.

**ట్యూషన్‌ఫీజు రీయింబర్స్‌మెంట్ :-** క్లాస్ 4 ఉద్యోగులు, ఎన్‌జివోలకు ఎల్‌కెజి నుండి 12 వ తరగతి వరకు చదివే పిల్లలు ఇరువురి వరకు ఒక్కొక్కరికి సం॥కు రు.2500 చొప్పున ట్యూషన్ ఫీజు రీయింబర్స్‌మెంట్‌కు సిఫారసు చేసింది (ప్రస్తుతం ఒక్కొక్కరికి రు.1000 ఉన్నది.)

**అంత్యక్రియల ఖర్చులు :-** ప్రస్తుతం ఉన్న రు.10000 ను రు.20000కు పెంచాలని సిఫారసు చేసింది.

**స్పెషల్ కాంపెన్సేటరీ అలవెన్సు (ఎస్‌సిఎ) :** ఏజన్సీ గిరిజన ప్రాంతాలలో పనిచేసే ఉద్యోగులకు ఎస్‌సిఎ కొనసాగించాలని స్లాబురేట్లలో స్వల్ప పెంపుదలను సిఫారసు చేసింది

| క్ర. సం. | ఆర్‌పిఎస్ 2014 ప్రకారం మూలవేతనం | మండల కేంద్రాలు రు.లలో. | నాన్ మండలాలు రు.లలో | కొండల పైన రు.లలో |
|---|---|---|---|---|
| 1 | 20050 వరకు | 500 | 600 | 725 |
| 2 | 20051 - 26600 | 600 | 725 | 825 |
| 3 | 26601 - 34210 | 725 | 875 | 950 |
| 4 | 34211 - 41380 | 875 | 950 | 1075 |
| 5 | 41381 - 55410 | 950 | 975 | 1125 |
| 6 | 55411 ఆపైన | 975 | 1100 | 1275 |

లోగడ మండలాలకు ఎక్కువ, నాన్ మండలాలకు తక్కువ ఎస్‌సిఎ ఉండేది ఈ సారి మార్పు చేసింది

**పిహెచ్‌సి కన్వేయన్స్ అలవెన్స్ :** అంగవైకల్యం కలిగిన ఉద్యోగులకు మూలవేతనంలో 10% చొప్పున నెలకు రు.2000 మించకుండా కన్వేయన్స్ అలవెన్స్ చెల్లించాలని సూచించింది. (ప్రస్తుతం గరిష్టమొత్తం రు.900 ఉన్నది.)

**స్కౌట్ అలవెన్స్ :** స్కౌట్ అలవెన్సు ప్రస్తుతం ఉన్న రు.75 నుండి రు.100 కు పెంపుదల చేయాలని సూచించింది.

**రీడర్ అలవెన్స్ :** అంధ ఉపాధ్యాయులకు రీడర్ అలవెన్స్‌ను పెంచాలని సిఫారసు చేసింది

**రీడర్ అలవెన్సు రు.లలో**

| క్ర. సం. | పోస్ట్ | ప్రస్తుతం | సిఫారసు |
|---|---|---|---|
| 1 | SGT | 400 | 1200 |
| 2 | SA | 500 | 1500 |
| 3 | JL | 600 | 2000 |

**లోన్లు, అడ్వాన్స్‌లు :**

- గృహ నిర్మాణం కొరకు ప్రభుత్వం నుండి కాకుండా బ్యాంకుల నుండి ఋణాలు తీసుకునే విధంగా ఉద్యోగులను ప్రోత్సహించాలని సూచించింది.
- ప్రభుత్వం నుండి ఇంటిస్థలంకొనుగోలుకు మూలవేతనానికి 10 రెట్లు లేదా రు. 2 లక్షలు ఏది తక్కువైతే అది.
- ఇంటి మరమ్మత్తుల కొరకు మూలవేతనానికి 20 రెట్లు రు.4 లక్షలు ఏది తక్కువైతే అది. ఇంటి కొనుగోలు అయితే దాని నిర్మాణం కొరకు
- రు. 26600 లోపు వేతనం గల వారికి మూలవేతనంపై 72 రెట్లు లేదా 10 లక్షలు
- 42490 పైన 61450 వరకు వేతనం గలవారికి రు. 15 లక్షలు 61450పైన వేతనం పొందే వారికి 72 నెలల మూలవేతనానికి మించకుండా రు.20లక్షలు.
- అఖిలభారత సర్వీసు ఉద్యోగులకు మూలవేతనానికి 50 రెట్లు మించకుండా రు. 25 లక్షలు మంజూరు చేయాలని సిఫారసు చేసింది.

**వాహనాల కొనుగోలు కొరకు అడ్వాన్స్ :** కారు కొరకు రు.37100 పైన మూలవేతనం కలిగిన వారికి 15 నెలల మూలవేతనము లేదా రు.6 లక్షలు లేదా వాస్తవ ఖరీదులలో ఏది తక్కువైతే అది.

**మోటారు సైకిల్/స్కూటర్ :** రు.22460 ఆపైన వేతనం కలిగిన ఉద్యోగులకు 7 నెలల మూలవేతనము లేదా రు.80 వేలు లేదా వాహనం ఖరీదులలో ఏది తక్కువైతే అది.

**మోపెడ్ కొనుగోలు :** రు.16400 ఆపైన వేతనం కలిగిన ఉద్యోగులకు, 2 సం॥ల సర్వీసు పూర్తయిన డ్రైవర్లకు 7 నెలల మూలవేతనము లేదా 35000 లేదా వామనం ఖరీదులో తక్కువైన మొత్తం.

**సైకిల్ కొనుగోలు:** 4వ తరగతి ఉద్యోగులకు రు. 10000 లేదా సైకిల్ ఖరీదు అడ్వాన్స్‌గా మంజూరు చేస్తారు.

**వివాహం కొరకు అడ్వాన్స్ :**

| | క్లాస్ 4 | ఇతరులు |
|---|---|---|
| పురుష ఉద్యోగులు లేదా కుమారుల వివాహానికి | 15నెలల వేతనం లేదా రు.75000 | 15నెలల వేతనం లేదా రు 1250 |
| మహిళా ఉద్యోగులు లేదా కుమార్తెల వివాహానికి ఏది తక్కువైతే అది | 15 నెలలు లేదా 100000 | 15 నెలలు లేదా 200000 |

**వ్యక్తిగత కంప్యూటర్ కొరకు :** రు.16400 పై బడిన మూల వేతనం కలిగిన ఉద్యోగులందరికీ కంప్యూటర్ ఖరీదు లేదా రు. 50000లో ఏది తక్కువైతే అంత మొత్తం అడ్వాన్స్ మంజూరు చేయాలని సిఫారసు చేసింది.

**వడ్డీరేటు:** ప్రభుత్వం నుండి తీసుకున్న అన్నిరకాల అప్పులపై వడ్డీరేటును 4వ తరగతి ఉద్యోగులకు 5% ఇతరులకు 5.5% ఉండాలని కమీషన్ సిఫారసు చేసింది.

**పండుగ అడ్వాన్స్:-**

- 4వ తరగతి ఉద్యోగులకు రు. 5000
- 26600-77030 స్కేలు అంతకు దిగువ స్కేలు ఉద్యోగులకు రు.7500

**ఆపో్క అడ్వాన్స్:-**

గెజిటెడ్ అధికారులకు రు. 7500

నాన్ గెజిటెడ్ అధికారులకు రు. 6000

4వ తరగతి ఉద్యోగులకు రు.4500

**ఎడ్యుకేషన్ అడ్వాన్స్:** 4వ తరగతి మరియు నాన్ గెజిటెడ్ ఉద్యోగులకు ఒక విద్యా సం॥కు రు.7500

**మెడికల్ అడ్వాన్స్:** కొన్ని రకాల దీర్ఘకాలిక వ్యాధుల చికిత్స కొరకు నిమ్స్/స్విమ్స్ ప్యాకేజీ రేట్ల ప్రకారం అడ్వాన్స్ మంజూరు చేసే విధానం కొనసాగించాలని సూచించింది.

**వైద్య సౌకర్యాలు:** ఉద్యోగుల ఆరోగ్య కార్డుల పథకాన్ని సక్రమంగా అమలు జరపాలని సూచించింది. పెన్షనర్ల వైద్య ఖర్చుల కొరకు ప్రస్తుతం చెల్లిస్తున్న రు.200ను రు.350కి పెంచాలని సిఫారసు చేసింది.

**కంటింజెంట్ ఉద్యోగులు:** సర్వీసులు క్రమబద్దీకరింపబడకుండా 4వ

తరగతి ఉద్యోగులతో సమానంగా ప్రస్తుతం 6700 వేతనం పొందుతున్న ఫుల్‌టైం కాంటింజెంట్ ఉద్యోగులందరికీ రు.13000 మరియు డిఎ, హెచ్‌ఆర్‌ఎ, సిసిఎ చెల్లించాలని సిఫారసు చేసింది. 25.11.93కు ముందుగా నియమింపబడి, 20 సం॥ల పైగా పనిచేస్తున్న ఎన్‌ఎంఆర్, డైలీవేజ్ వర్కర్లు, పార్ట్‌టైం, ఫుల్‌టైం కంటింజెంట్ వర్కర్లను మానవతా దృష్టితో రెగ్యులరైజ్ చేయాలని సిఫారసు చేసింది. (ఇదొక మంచి సిఫారసు)

**పెన్షనరీ బెనిఫిట్స్:**

- పెన్షన్ కన్సాలిడేషన్ 1.7.2013 నుండి అమలు చేయాలి
- బేసిక్ పెన్షన్, 63.344% డిఆర్, 29% ఫిట్‌మెంట్‌ల మొత్తాన్ని కన్సాలిడేటెడ్ పెన్షన్‌గా నిర్ణయించాలి.
- కనీస పెన్షన్ రు.6500
- 01.01.2014 నుండి ఉద్యోగులతో సమానంగా డిఆర్ చెల్లింపు
- పూర్తి పెన్షన్ పొందటానికి క్వాలిఫైడ్ సర్వీసు 33 సం॥లు
- సూపరేన్యుయేషన్ లేదా వాలంటరీ రిటైర్మెంట్ సందర్భంలో వెయిటేజి 8 సం॥లు (ప్రస్తుతం 5 సం॥ ఉన్నది). 25 సం॥ల సర్వీసుతో ఉద్యోగ విరమణ పొందేవారికి 8 సం॥ వెయిటేజి వలన చివరి వేతనంలో సగం పెన్షన్‌గా పొందే అవకాశం లభించింది.
- వాలంటరీ రిటైర్మెంటుకు కనీస సర్వీసు 20 సం॥లు యదాతథం.

**గ్రాట్యుటీ :**

- చివరినెల మూలవేతనము, డి.ఎ.ల మొత్తంలపై చేసిన సర్వీసు ఆధారంగా గ్రాట్యుటీ నిర్ణయించాలి. గ్రాట్యుటీ పరిమితి 8 లక్షల నుండి 12 లక్షలకు పెంచాలని సిఫారసు చేసింది.
- కమ్యుటేషన్ యథాథతం (40% గరిష్టంగా)
  కమ్యుటేషన్ చేయబడిన భాగం తిరిగి 15 సం॥ల తర్వాత బేసిక్ పెన్షన్‌లో కలిపే ప్రస్తుత విధానమే కొనసాగించాలని సూచించింది.
- ఉద్యోగి ఫ్యామిలీ పెన్షన్ పొందే సందర్భంలో డిఎ, డిఆర్ రెండూ పొందే అర్హత ఉంటుంది.
- కంపాసినేట్ అప్పాయింట్‌మెంట్ ద్వారా ఉద్యోగం పొందిన వారే కుటుంబ పెన్షన్ లబ్దిదారు అయితే కుటుంబ పెన్షన్‌పై డిఆర్ చెల్లించనవసరం లేదని సూచించారు.

**అదనపు పెన్షన్ :**

| | అదనపు పెన్షన్ |
|---|---|
| 70 సం॥ నుండి 75 సం॥ వరకు | బేసిక్ పెన్షన్‌పై 15% |
| 75 నుండి 80 సం॥ వరకు | " 25% |
| 80 నుండి 85 సం॥ వరకు | " 35% |
| 85 నుండి 90 సం॥ వరకు | " 45% |
| 90 నుండి 95 సం॥ వరకు | " 55% |
| 95 నుండి 100 సం॥ వరకు | " 65% |
| 100 సం॥ ఆపైన | " 75% |

**యాంటిసిపేటరీ పెన్షన్ :** పెన్షన్‌లో 90శాతం యాంటిసిపేటరీ పెన్షన్‌గా చెల్లించే విధానం కొనసాగించాలి.

**ప్రొవిజనల్ పెన్షన్:** 75శాతం తక్కువ కాకుండా ప్రొవిజనల్ పెన్షన్‌గా చెల్లించే ప్రస్తుత విధానం కొనసాగుతుంది.

**ఫ్యామిలీ పెన్షన్:** చివరి నెల వేతనంలో 50శాతం కుటుంబ పెన్షనుగా చెల్లించే విధానం కొనసాగుతుంది. అయితే ఉద్యోగి మరణించిన నాటినుండి 10 సం॥లు లేదా జీవించి ఉంటే 65 సం॥ వచ్చేవరకు 50శాతం ఆతర్వాత 30 శాతం కుటుంబపెన్షన్ చెల్లించబడుతుంది. (ఇప్పుడు 7 సం॥ల వరకు 50 శాతం కుటుంబపెన్షన్ చెల్లించ బడుతుంది)

**కుటుంబపెన్షన్ లబ్దిదారులు:** ఆర్‌పిఎస్ - 2010 సిఫారసులలో పేర్కొన్న ప్రకారమే కుటుంబ పెన్షన్ లబ్దిదారులను కొనసాగించాలి కుటుంబ పెన్షన్ లబ్దిదారుల గరిష్ట ఆదాయపరిమితి ప్రస్తుతం ఉన్న రు.2440ని రు.6500గా పెంచాలని సూచించారు.

అవివాహిత ఉద్యోగి మరణించిన సందర్భంలో అప్పటికే కుటుంబ పెన్షనర్ అయిన తల్లికి, కుమార్తెకు సంబంధించిన రెండవ కుటుంబ పెన్షన్ కూడా పొందే అర్హత ఉంటుంది. అయితే రెండు పెన్షన్ల మొత్తం మాస్టర్ స్కేలులో గరిష్ట వేతనంలో సంగానికి మించకూడదని సూచించింది.

**డెత్ రిలీఫ్:** పెన్షనరు/ఫ్యామిలీ పెన్షనరు మరణించిన సందర్భంలో డెత్‌రిలీఫ్ కనీస మొత్తం రు.10000ను రు. 20000కు పెంచాలని సిఫారసు చేసింది. మొత్తంగా పిఆర్‌సి సిఫారసులను పరిశీలిస్తే, 9వ పిఆర్‌సి అంతమెరుగ్గా లేకున్నా 8వ పిఆర్‌సి అంత దారుణంగా మాత్రం లేదు.

**కథలు, కవితల పోటీలలో ప్రచురణకి ఎంపికైన కవిత**

## వారసత్వ సంపద

-మంకు శ్రీను, కొప్పర్రు, ప॥గో॥ జిల్లా

పాపం వృద్ధులు
ఫుట్‌పాత్ ప్రక్కన
రైల్వేస్టేషన్ - బస్‌స్టాప్ దగ్గర
చలిలో వానలో ఎండలో
వృద్ధులు వృద్ధులు
దురంత విషాద నిబద్ధులు
సభ్యసమాజం
దూరంగా విసిరివేసిన అభాగ్యులు
పటెట్టెడన్నం కోసం
అలమటిస్తున్న అన్నార్థులు
అయినవాళ్లు ఉండికూడా
ఎవరికీ కాని వాళ్లుగా
బ్రతుకు వెళ్లబుచ్చుతున్న అనాథలు
మనవళ్లు మనవరాళ్లు
ఎలా ఉంటారో తెలియదు
ఎక్కడున్నారో అంతకన్నా తెలియదు
జీవితపు మలి సంధ్యకు చేరుకున్న
ఆ కళ్లలో ఏదో ఆశ
ఆ చూపుల్లో ఏదో మెరుపు
కడతేర్చే కొడుకు
కనిపిస్తాడని
అమ్మా - నాన్నా అని పిలుస్తాడని
తరతరాల వారసత్వ సంపదలు వృద్ధులు
ఆ సంపదకు వారసులు ఈనాటి పిల్లలు
తెగిన అనుబంధాల తీగను
మమతల పందిరిపై ప్రాకించాలి
జీవన సుమాలను విరబూయించాలి
అప్పుడే మానత్వం పరిమళిస్తుంది

# యుటియఫ్ బలపర్చిన ఎమ్మెల్సీలను గెలిపించండి

## టీచర్ ఎమ్మెల్సీగా లక్ష్మణరావును గెలిపించండి

### కృష్ణజిల్లా కార్యవర్గం




ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ కోసం ఉపాధ్యాయ ,అధ్యాపక సమస్యలపట్ల నిరంతరం పోరాడే ఎమ్మెల్సీ కె.ఎస్.లక్ష్మణరావును తిరిగి గెలిపించుకుందామని యుటిఎఫ్ కృష్ణాజిల్లా కార్యవర్గం పిలుపు నిచ్చింది.

18.01.2015న యుటియఫ్ కృష్ణ జిల్లా శాఖ కార్యవర్గ సమావేశం జిల్లా శాఖ అధ్యక్షులు ఎస్‌పి మనోహర్‌కుమార్ అధ్యక్షతన విజయవాడ యుటియఫ్ రాష్ట్ర కార్యాలయంలో జరిగింది.

ఈ సమావేశంలో ముఖ్య అతిథిగా కృష్ణా-గుంటూరు టీచర్స్ నియోజకవర్గ ఎమ్మెల్సీ శ్రీ కెఎస్ లక్ష్మణరావు పాల్గొన్నారు. పిడిఎఫ్ బృందంలో ఎమ్మెల్సీ ఉద్యోగ ఉపాధ్యాయ, అధ్యాపక సంఘాలకు సహకరించానని, విద్యారంగ సమస్యలను కౌన్సిల్‌లో ప్రభుత్వం దృష్టికి తెచ్చామని, ఎమ్మెల్సీ కోటాలో వచ్చే నియోజకవర్గ నిధులను పూర్తిస్థాయిలో ప్రభుత్వ విద్యాసంస్థలకే కేటాయించామని, ఇంకా పెండింగ్ లో ఉన్నా సమస్యలను భవిష్యత్తులో పరిష్కరించేందుకు కృషిచేస్తానని అన్నారు.

పిడిఎఫ్ గ్రాడ్యుయేట్స్ ఎమ్మెల్సీ శ్రీ బొడ్డు నాగేశ్వరరావుగారు మాట్లాడుతూ పిడిఎఫ్ అభ్యర్థిగా కె.ఎస్.లక్ష్మణరావు శాసనమండలిలో ప్రతినిత్యం ఉపాధ్యాయ సమస్యలపై పోరాటం చేశారని, ఎయిడెడ్ ఉపాధ్యాయుల రిటైర్మెంట్ వయసు విషయంలో నిరంతరం కృషి చేశారని, నీతినిజాయితితో, నిబద్ధతతో పనిచేసిన పిడిఎప్ అభ్యర్థి కెఎస్ లక్ష్మణరావును గెలిపించాలని కోరారు.

యుటియఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి మాట్లాడుతూ ప్రభుత్వ విధానాలు పాఠశాలల మూసివేతకు దారితీస్తున్నాయని అన్నారు. నూతన ప్రభుత్వం 69% ఫిట్‌మెంట్ తో పిఆర్‌సి ఇవ్వాలని, పండింట్, పి.ఇ.టి పోస్టుల అప్‌గ్రేడ్ చేయాలని , మున్సిపల్ టీచర్ల సమస్యలన పరిష్కరించాలని, గురుకుల ఉపాధ్యాయులకు రిటైర్‌మెంట్ వయస్సు60సం॥కు పెంచాలనీ ప్రభుత్వాన్ని డిమాండ్ చేసారు. ఉద్యోగ ఉపాధ్యాక కార్మిక పెన్షనర్‌ల సమస్యల పరిష్కారానికి కెఎస్ లక్ష్మణరావు వంటి వారిని గెలిపించి కౌన్సిల్‌కు పంపించాలని ఉపాధ్యాయులకు విజ్ఞప్తి చేసారు..

జిల్లా ప్రధానకార్యదర్శి కెపి ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ కార్పోరేట్ విద్యారంగాన్ని ఎదుర్కొవాలంటే, ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించుకోవడం కోసం పిడిఎఫ్ అభ్యర్థిని గెలిపించాలని కోరారు. ఓటర్‌లిస్టులో డబుల్ ఎంట్రీలను తప్పులను సవరించాలనీ, ఉపాధ్యాయుకు ఎస్.ఎ ప్రమోషన్లు వెంటనే ఇవ్వాలని కోరారు.

రాష్ట్ర కోశాధికారి కె.సంజీవరెడ్డి మాట్లాడుతూ పిఆర్‌సిని 1.7.2013 నుంచి అమలు చేయాలని కోరారు.

ఈ సమావేశంలో రాష్ట్ర కార్యదర్శి శ్రీమతి పి.లీల, జిల్లా శాఖ సహాధ్యక్షులు భగీరధి, ఎంఎస్‌సి రాజు, జిల్లా కోశాధికారి ఎ.కృష్ణ సుందరరావు, ఆడిట్ కమిటీ కన్వీనర్ కె.వి.సుబ్బారావుగారు, జిల్లా శాఖ కార్యదర్శులు స్టేట్ కౌన్సిలర్స్ , మండల కార్యర్గసభ్యులు పాల్గొన్నారు.

## ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడేవారినే ఎమ్మెల్సీగా గెలిపించుకుందాం

### గుంటూరు జిల్లా కార్యవర్గం




ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడేవారినే ఉపాధ్యాయ ఎమ్మెల్సీగా గెలిపించాలని ఉపాధ్యాయ నియోజకవర్గ ఓటర్లను యుటియఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి కోరారు. స్థానిక యుటియఫ్ హాలులో ఫెడరేషన్ జిల్లా కార్యవర్గ సమావేశం అధ్యక్షులు కె.నాగమల్లేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. సమావేశంలో బాబురెడ్డి మాట్లాడుతూ విద్య కార్పోరేటీకరణ దిశగా ప్రభుత్వ విధానాలున్నాయన్నారు. దీర్ఘకాలంగా ఎయిడెడ్ పాఠశాలల్లో పోస్టులను భర్తీ చేయకపోవడం, పదోన్నతుల ప్రక్రియ లేకపోవడంతో ఆయా పాఠశాలలు మూతపడుతున్నాయన్నారు. పట్టణ ప్రాంతాల్లోని ఎయిడెడ్, మున్సిపల్ పాఠశాలలను కార్పోరేట్ విద్యా సంస్థలకు అప్పగించే యోచనలో ప్రభుత్వం ఉందన్నారు. క్లస్టర్ పాఠశాలల పేరుతో గ్రామాల్లోని పాఠశాలలను మూసివేయడానికి, ఉపాధ్యాయ పోస్టులను కుదించేందుకు ప్రణాళికలను రూపొందిస్తు న్నారని చెప్పారు. ప్రభుత్వ పాఠశాలలు ఉన్నప్పుడే పేద, బడుగు వర్గాలవారి పిల్లలకు విద్య అందుతుందన్నారు. ఈ నేపథ్యంలో ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకునేందుకు దీర్ఘకాలంగా శాసనమండలిలో, ఉపాధ్యాయ ఉద్యమాల ద్వారా పోరాడుతున్న ఉపాధ్యాయ ఎమ్మెల్సీ అభ్యర్థి కె.ఎస్.లక్ష్మణరావును గెలిపించాలని కోరారు.

కృష్ణా,గుంటూరు జిల్లాల పట్టభద్రుల నియోజకవర్గ ఎమ్మెల్సీ బొడ్డు నాగేశ్వరరావు మాట్లాడుతూ విద్యారంగం ప్రభుత్వ ఆధీనంలోనే

ఉండాలన్నారు. ఉపాధ్యాయుల సర్దుబాటు పేరుతో రాష్ట్రంలో 16వేల పోస్టులను కుదించటం తగదన్నారు. వివిధ అంశాలకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వం అస్పష్ట విధానాల వలన ఉపాధ్యాయుల్లో ఆందోళన నెలకొందని చెప్పారు. ప్రాథమిక విద్యను పటిష్టపరిచేందుకు ప్రభుత్వం ప్రత్యేక కమీషన్ ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. రానున్న ఉపాధ్యాయ ఎమ్మెల్సీ ఎన్నికల్లో పిడిఎఫ్ అభ్యర్థి కెవిఎస్ లక్ష్మణరావును గెలిపించాలని కోరారు.

యుటియఫ్ రాష్ట్ర సహాధ్యక్షులు ఎన్.వెంకటేశ్వర్లు మాట్లాడుతూ ప్రభుత్వం ఏర్పాటయి నెలలు గడుస్తున్నా విద్యా సంవత్సరం ముగుస్తున్నా భాషా పండితులు, పిఇటి పోస్టుల అప్‌గ్రేడేషన్ ప్రక్రియ పూర్తికావడం లేదన్నారు. సమస్యలపై ఉపాధ్యాయ సంఘాలతో విద్యా శాఖామంత్రి చర్చించటం లేదన్నారు. సమస్యల పరిష్కారానికి ఉద్యమించే ప్రభుత్వ విద్యారంగ శ్రేయోభిలాషి లక్ష్మణరావును గెలిపిద్దామన్నారు.

ఎమ్మెల్సీ కెవిఎస్ లక్ష్మణరావు మాట్లాడుతూ ఎయిడెడ్ ఉపాధ్యాయుల పదవీ విరమణ వయస్సు పెంపుకు కృషి చేశాం. పాఠశాలల పనివేళల కుదింపునకు కమీషనర్‌కు ప్రాతనిధ్యం చేయగా అందుకు హామీ ఇచ్చారని పేర్కొన్నారు. ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకునేందుకు పిడిఎఫ్ ఎమ్మెల్సీలతో కలసి కృషిని కొనసాగిస్తామని లక్ష్మణరావు పేర్కొన్నారు. సమావేశంలో కార్యదర్శి నివేదికను యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.హనుమంతరావు ప్రవేశ పెట్టారు. ఉపాధ్యాయుల మెడికల్ రీయింబర్స్‌మెంట్ బిల్లులు దీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్నాయని, వీటిపై విద్య, వైద్య ఆరోగ్యశాఖలు స్పందించాలని హనుమంత రావు కోరారు. సమావేశంలో జిల్లా సహాధ్యక్షులు టి.వినోద్, కోశాధికారి పి.ప్రేమ్‌కుమార్ జిల్లా కార్యదర్శులు, రాష్ట్ర జిల్లా కార్యవర్గ సభ్యులు, ఆడిట్ కమిటీ సభ్యులు పాల్గొన్నారు.

## శాసనమండలి అభ్యర్థిగా ఆర్ఎస్ఆర్‌కు మద్దతు తెలిపిన ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘం



ఉభయ గోదావరి జిల్లాల ఉపాధ్యాయ శాసనమండలి అభ్యర్థిగా ప్రముఖ సమాజ సేవకుడు, సిఆర్ఆర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్ రాము సూర్యారావుకి ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘం పశ్చిమ గోదావరి జిల్లాశాఖ సంపూర్ణ మద్దతు తెలియజేసింది. ఏలూరులోని యుటియఫ్ కార్యాలయంలో ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘం అధ్యక్షులు జి.సుబ్రమ్మణ్యేశ్వరరావు, కార్యదర్శి అయినపర్తి మురళీకృష్ణ ఆధ్వర్యంలో సూర్యారావుని కలిసి మద్దతు తెలియజేస్తూ హామీ పత్రం అందజేశారు. జిల్లాలోని 32 ప్రభుత్వ జూనియర్ కళాశాలల ప్రభుత్వ జూనియర్ లెక్చరర్లు సంపూర్ణ విజయానికి కృషి చేస్తామని తెలియజేశారు. సూర్యారావు గెలుపు ఉపాధ్యాయ, అధ్యాపకుల అందరి గెలుపు అని, నీతి, నిజాయితీకి పట్టం కట్టినట్లు అవుతుందని తెలియజేశారు. తనకు మద్దతు తెలియజేసిన ప్రభుత్వ అధ్యాపక సంఘానికి రాము సూర్యారావు, యుటియఫ్ జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు ఎస్.శ్రీకాంత్, షేక్ సాబ్జీలు కృతజ్ఞతలు తెలియజేశారు. ఈ సమావేశంలో సంఘ నాయకులు జి.ప్రభాకరరావు, ఎ.రాజ్‌కృష్ణ, ఆర్.కిషోర్, కె.రజని, పి.కౌముది, బి.నారాయణరావు తదితరులు పాల్గొన్నారు.

## నెల్లూరు జిల్లాలో యండపల్లి పర్యటన

జనవరి 20న సూళ్ళూరుపేట మండలంనందు ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు గ్రాడ్యుయేట్ శాసన సభ్యులు యండపల్లి శ్రీనివాసులు రెడ్డి జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలు, ప్రాథమిక పాఠశాలలు సూళ్ళూరుపేట ప్రాంతీయ ప్రభుత్వ జూనియర్ కాలేజ్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఏపిఎస్ఆర్‌డబ్ల్యు జూనియర్ కళాశాల మరియు మండల పరిషత్, మండల రెవెన్యూ కార్యాలయాలను సందర్శించారు. పాఠశాలలో గల మౌలిక వసతులు, కొత్త సిలబస్, పరీక్షా విధానములు మార్పులను, పనివేశలల మార్పుపై గల ఇబ్బందులను, మధ్యాహ్న భోజన పథకం అమలు మొదలగు అంశాలపై సమీక్షించారు. మౌలిక వసతులు అవసరమైన పాఠశాలలకు సంబంధిత అధికారుల ద్వారా ఏర్పాటు చేయించుతామన్నారు. విద్యారంగంలో వస్తున్న మార్పులపై అవగాహన కల్పించారు. ఎమ్మెల్సీతో యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు జి.జె.రాజశేఖర్, సూళ్ళూరుపేట మండల శాఖ (యుటియఫ్), అధ్యక్షులు, ప్రధానకార్యదర్శి, కార్యదర్శులు కె.ప్రభాకర్, పి.వెంకటస్వామి మరియు ఆర్.ఆదినారాయణలు పాల్గొన్నారు. ప్రతి పాఠశాలలో హెచ్‌ఎంలు మరియు ఉపాధ్యాయులు, ప్రిన్సిపాల్స్ మరియు లెక్చరర్స్ పాల్గొన్నారు.

## యుటియఫ్ క్యాలెండర్, డైరీ ఆవిష్కరణ

### కర్నూలు

యుటియఫ్ డైరీ, క్యాలెండర్‌ను కర్నూలు జిల్లా ఎమ్మిగనూర్ స్థానిక ప్రాంతీయ కార్యాలయంలో ప్రజావైద్యులు డా॥ జి.మాల కొండయ్య, రిటైర్డ్ ప్రధానోపాధ్యాయులు ఎం.పంపాపతి సంయుక్తంగా ఆవిష్కరించారు.

యుటియఫ్ జిల్లా కార్యదర్శి జె.యల్లప్ప అధ్యక్షతన ఏర్పాటు చేసిన సమావేశంలో డా॥ జి.మాలకొండయ్య మాట్లాడుతూ హక్కులు, బాధ్యతలు రెండు నేత్రాలుగా కలిగిన సంఘం యుటియఫ్ అని, ఉపాధ్యాయులు హక్కుల కోసం, ఉపాధ్యాయుల సమస్యల పట్ల రాజీలేని పోరాటం చేస్తూనే, ప్రాథమిక విద్య పరిరక్షణ కోసం విద్యావికాస ఉద్యమాన్ని బాధ్యతగా స్వీకరించి ముందుకు వెల్తున్న సంఘమని కొనియాడారు. ఎం.పంపాపతి మాట్లాడుతూ అధ్యాపకదర్శిని ప్రతి ఉపాధ్యాయుడికి మార్గదర్శిగా ఉంటుందని, అందులోని జిఓలు ఉపాధ్యాయులకు ఉపయోగపడుతాయన్నారు.

ఈ సమావేశంలో జిల్లా కార్యదర్శి జె.ఎల్లప్ప, రాష్ట్ర కౌన్సిలర్లు ఎస్.దావీదు, ఎం.నాగరాజు, జిల్లా ఉపాధ్యక్షులు ఎస్.నాగమణి, వివిధ మండలాల నాయకులు ఎం.హనుమంతు, బెల్ షాజర్, బి.రాఘవేంద్ర, కె.లవ, జి.రాజశేఖర్, కె.రాజేష్, బి.జ్ఞాన ప్రకాష్, పి.పెద్దారెడ్డి, టి.విజయ్‌కుమార్, రమేష్, టి.వేణుగోపాల్ తదితరులు పాల్గొన్నారు.

# సమావేశాలు - ధర్నాలు

## మోడల్ స్కూల్ టీచర్ల రాష్ట్ర ధర్నా

**తాత్కాలిక భృతి, మూడు విడతల డిఏ ఇవ్వాలి! ఇన్‌సర్వీస్ ఉపాధ్యాయులకు పాత పెన్షన్ కొనసాగించాలి! సర్వీస్ రూల్స్ విడుదల చేయాలి**

మోడల్ స్కూల్స్ ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ ఏపి మోడల్ స్కూల్స్ టీచర్స్ ఫెడరేషన్ (ఏపిఎంఎస్ టిఎఫ్) ఆధ్వర్యంలో ఇందిరాపార్కు వద్ద ఆర్.ఈశ్వరరావు అధ్యక్షతన ధర్నా జరిగింది. ఈ ధర్నా శిబిరాన్ని జెఏసి సెక్రటరీ జనరల్ ఐ. వెంకటేశ్వరరావు ప్రారంభించారు. ఆయన మాట్లాడుతూ ఉన్నత ఆశయాలతో ప్రారంభించిన మోడల్ స్కూల్స్ ఉపాధ్యాయుల సమస్యలు, విద్యారంగ సమస్యలు తక్షణం పరిష్కరించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. మోడల్ స్కూల్స్ ఉపాధ్యాయులకు 1వ తేదీన జీతాలు చెల్లించ పోవడం అన్యాయం అని అన్నారు. జనవరి 2014 నుండి రావలసిన తాత్కాలిక భృతి, మూడు విడతల డిఏ వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేశారు. ముఖ్య అతిథిగా హాజరైన పిడిఎఫ్ డెప్యూటీ ఫ్లోర్ లీడర్ వి.బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ పిజిటి మరియు టిజిటి పోస్టులు పూర్తిస్థాయిలో భర్తీ చేయాలని, పాఠశాలలో అసంపూర్తిగా ఉన్న భవనాలు, హాస్టల్స్‌ను పూర్తిచేసి త్వరగా ప్రారంభించాలని మరియు మౌలిక సదుపాయాలు కల్పించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ధర్నాకు మద్దతుగా పిడిఎఫ్ ఎమ్మెల్సీలు కెవెస్ లక్ష్మణరావు, బొడ్డు నాగేశ్వరరావు, వై.శ్రీనివాసురెడ్డి, డా॥ ఎం.గేయానందలు పాల్గొన్నారు. మోడల్ స్కూల్ టీచర్ల సమస్యలు శాసనమండలిలో ప్రస్తావిస్తామని హామీ ఇచ్చారు. యుటియఫ్ రాష్ట్ర ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి మాట్లాడుతూ మోడల్ స్కూల్ ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించాలని యుటియఫ్ తరపున మద్దతు ప్రకటిస్తూ మోడల్ స్కూల్స్ ఉపాధ్యాయులకు హెల్త్‌కార్డులు ఇవ్వాలని రిటైర్మెంట్ వయస్సు 60కి పెంచాలని డిమాండ్ చేశారు. అన్ని రకాల అరియర్స్ చెల్లించేందుకు చర్యలు చేపట్టాలని అన్నారు. ఏపిఎంఎస్‌టిఎఫ్ అధ్యక్షులు ఆర్. ఈశ్వరరావు మాట్లాడుతూ సర్వీస్ రూల్స్ త్వరగా విడుదల చేయాలని డిమాండ్ చేశారు. ఏపిఎంఎస్‌టిఎఫ్ ప్రధానకార్యదర్శి ఎన్.బోసుబాబు మాట్లాడుతూ ఉపాధ్యాయుల కంట్రిబ్యూటరీ పెన్షన్ స్కీమ్ మరియు ఏపిజిఎల్ఐ వర్తింపజేయాలని మరియు దీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్న ప్రసూతి మరియు పితృత్వ సెలవులకు సంబంధించిన బిల్లులను వెంటనే చెల్లించాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో ఏపిఎంఎస్ టిఎఫ్ ఉపాధ్యక్షులు కె.రామకృష్ణ, జె.రాముడు, చంద్రశేఖర్, రమణి, బాలాజీ, కార్యదర్శులు నరేంద్రనాయక్, చంద్రశేఖర్‌రెడ్డి, ఎం.మాధవి, కోశాధికారి జి.వెంకట్రామయ్య, కార్యవర్గ సభ్యులు కె.సత్యనారాయణ, ఎన్.ఆంజనేయులు, వి.వి.రమణయ్య, ఎస్.కోటేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

**అనంతపురం**

### క్లస్టర్ స్కూల్స్ పేరుతో పాఠశాలలు మూతవేయరాదు

జిల్లా అధ్యక్షుడు మహమ్మద్ జిలాన్ అధ్యక్షతన యుటియఫ్ జిల్లా కార్యాలయంలో జరిగిన కార్యదర్శివర్గ సమావేశానికి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పి.బాబురెడ్డి ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగిస్తూ విద్యార్థులు తక్కువ వున్నారన్న కారణంతో 4 లేక 5 పాఠశాలలను మూసివేసి వారినందరినీ ఒక పాఠశాలలో చేర్చి అన్ని హంగులతో ఆ పాఠశాలను క్లస్టర్ పాఠశాలగా మార్చుతామని అందుకు రాష్ట్ర వ్యాప్తంగా సర్వేలు నిర్వహించారని, రాబోవు విద్యా సంవత్సరంలో ఈ క్లస్టర్ స్కూల్స్ విధానాన్ని అమలు చేస్తామని ప్రభుత్వం ప్రకటించిందన్నారు. అన్ని హంగులతో, సౌకర్యాలతో పాఠశాలలు ప్రారంభిస్తే యుటియఫ్ ఆహ్వానిస్తుందని, అయితే ఆ పేరుతో ప్రస్తుతం వున్న పాఠశాలలను మూసివేయడాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తామని, ప్రాథమిక పాఠశాలల విద్యార్థులు 4-5 కిలోమీటర్ల దూరం వెళ్ళలేరని, బాలికల విద్య కుంటుపడుతుందని విమర్శించారు. ప్రతి గ్రామంలో అన్ని సౌకర్యాలు గల పాఠశాలలు ఏర్పాటు చేయాలన్నారు.

శాసనమండలి సభ్యులు డా॥ ఎం.గేయానంద్ ఈ సమావేశానికి మరో ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగిస్తూ ప్రభుత్వ పాఠశాలల విద్యా రంగాభివృద్ధికి, ఉపాధ్యాయ సంక్షేమానికి, పాఠశాలల మౌలిక వసతుల కల్పనకు యుటియఫ్ చేపట్టబోవు ఆందోళనలకు, పోరాటాలకు, ప్రాతినిధ్యాలకు తన మద్దతు, సహకారం అందచేస్తానని తెలియజేశారు.

రాష్ట్ర గౌరవాధ్యక్షులు ఎన్.నరసింహుడు మాట్లాడుతూ గత ప్రభుత్వం ప్రవేశపెట్టిన మోడల్ స్కూల్స్, సక్సెస్ స్కూళ్ళు అనేక సమస్యలతో ఉన్నాయని ప్రభుత్వ విధానాలే వీటిని నిర్వీర్యం చేశాయని విమర్శించారు. ఈ సమావేశంలో జిల్లా ప్రధానకార్యదర్శి కోటేశ్వరప్ప, గౌరవాధ్యక్షులు సి.కె.నాగేంద్రబాబు, కార్యదర్శులు నాగేంద్ర, కోశాధికారి ఈశ్వరప్ప, సుధాకర్, గోవిందరాజులు, సూర్యనారాయణ, చంద్రశేఖర్ నాయుడు, పెనుకొండ సుధాకర్, జయచంద్రరెడ్డి, ఆడిట్ కన్వీనర్ సాయినాథ్, రాష్ట్ర కౌన్సిలర్స్ భాస్కర్, చెన్నకేశవులు, ఉషారాణి, రూత్ తదితరులు పాల్గొన్నారు.

**గుంటూరు**

### క్లస్టర్ స్కూల్స్ పాఠశాలల పేరుతో కార్పొరేటీకరణకు చర్యలు

యుటియఫ్ గుంటూరు జిల్లా ఆఫీస్‌బేరర్స్ సమావేశం సంఘ కార్యాలయంలో జిల్లాశాఖ అధ్యక్షులు కె.నాగమల్లేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. రాష్ట్ర ప్రధానకార్యదర్శి పి.బాబురెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఆయన మాట్లాడుతూ క్రింది స్థాయిలో మండల శాఖలను పటిష్ట పరచాలని, తప్పనిసరిగా నెలకొకసారి మండలశాఖల సమావేశా లు జరపాలని, స్థానిక సమస్యలపై పోరాడాలన్నారు. నేడు విద్యారంగంలో ప్రమాదకర పరిణామాలు జరుగుతున్నాయని క్లస్టర్ స్కూల్స్ పేరుతో ప్రస్తుత పాఠశాలలను మూసివేసి కార్పోరేట్ స్కూల్స్‌ను ప్రోత్సహించే పరిణామాలు జరుగుతున్నాయని, దీనికోసం బడ్జెట్‌లో 3500కోట్లు కేటాయించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని, మరో పక్క విద్య కాషాయీకరణ చేయడానికి కేంద్రం ప్రయత్నాలు చేస్తుందని వీటిని ఉపాధ్యాయులు చైతన్యంతో ఎదుర్కొని పోరాడి ప్రభుత్వ పాఠశాలలను కాపాడుకోవాలని పిలుపునిచ్చారు. శాసనమండలి సభ్యులు కె.ఎస్. లక్ష్మణరావు మాట్లాడుతూ, ఎయిడెడ్ టీచర్లకు 60 సం॥ల పదవీ విరమణ బిల్లు అసెంబ్లీలో ఆమోదం పొందిందని, ఎయిడెడ్ టీచర్లకు కూడా హెల్త్‌కార్డులు ఇవ్వడానికి ముఖ్యమంత్రి, ఆరోగ్యశాఖ మంత్రి అంగీకరించారని, మున్సిపల్ టీచర్స్ సర్వీస్ రూల్స్ త్వరలో వస్తాయని, మోడల్ స్కూల్స్ ఉపాధ్యాయులకు ఐఆర్, డిఏ ఇవ్వడానికి ప్రభుత్వం సుముఖంగా ఉందని చెప్పారు. జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.హనుమంత రావు మాట్లాడుతూ సంఘ కార్యక్రమాల గురించి వివరించారు. ఎమ్మెల్సీ కె.ఎస్.లక్ష్మణరావు విజయానికి కృషి చేయాలని సూచించారు. ఈ సమావేశంలో రాష్ట్ర సహాధ్యక్షులు ఎన్.వెంకటేశ్వర్లు, గౌరవాధ్యక్షులు ఎ.నాగేశ్వరరావు, జిల్లా సహాధ్యక్షులు టి.వినోద, జి.విజయసారధి, కోశాధికారి పి.ప్రేమ్‌కుమార్, జిల్లా కార్యదర్శులు, రాష్ట్ర కౌన్సిలర్స్, జిల్లా ఆడిట్ కమిటీ సభ్యులు పాల్గొన్నారు.

**శ్రీకాకుళం**

## టీచర్లపై పిఓ బెదిరింపులకు నిరసనగా

ఐటిడిఏలో ఖాళీగా ఉన్న ఉపాధ్యాయ పోస్టులు 2014 డిఎస్‌సి ద్వారా భర్తీ చేయాలని, స్థానిక సమస్యలను పరిష్కరించాలని నవంబర్ 24న సీతంపేట ఐటిడిఏ కార్యాలయం ముందు యుటియఫ్ ధర్నా చేసింది. ఈ ధర్నా అనంతరం సీతంపేట ఐటిడిఏ పిఓ ధర్నాలో పాల్గొన్న వారి పాఠశాలలపైన రోజంతా, అందరి అధికారులను తీసుకొని వెళ్ళి అనేక దూషణలు, బెదిరింపులు చర్యలు చేపట్టారు. పిఓ చర్యలకు నిరసనగా ఐటిడిఏ పాలకవర్గం జరిగే తేది డిసెంబర్ 28న ధర్నా చేయాలని నిర్ణయించి జిల్లా కలెక్టరుకు, ఉత్తరాంధ్రుల పట్టభద్రుల ఎమ్మెల్సీ ఎంవిఎస్ శర్మకి ఫిర్యాదుచేసి, పిఓకు నోటీసు ఇవ్వడం జరిగింది.

ఐటిడిఏ సీతంపేట పరిధిలో ఉన్న సమస్యలను పరిష్కరించాలని ప్రధానంగా 78 జిపిఎస్ పాఠశాలల్లో ఉన్న ఉపాధ్యాయ ఖాళీలను ఏఎన్ఎం, క్లాస్ IV ఉద్యోగుల ఖాళీలను భర్తీ చేయాలని, అక్రమ డెప్యూటేషన్‌లు రద్దు చేయాలని, ఆశ్రమ పాఠశాలలో పనిచేస్తున్న సిఆర్‌టిలను రెగ్యులర్ చేయాలని, 2012 స్పెషల్ డిఎస్‌సిలో డిఇడి పోస్టులకు అభ్యర్థులు లేనందున, నియమించిన బిఇడి వారికి పెండింగ్‌లో ఉన్న వార్షిక ఇంక్రిమెంట్లను మంజూరు చేయాలని, జిఓ 233 ప్రకారం అప్‌గ్రేడ్ చేసిన పోస్టులకు హెడ్ ఆఫ్ అక్కౌంట్ రాష్ట్ర ప్రభుత్వం నుంచి వచ్చేందుకు చర్యలు చేపట్టాలి. రూ.398/-లు జీతంతో జిపిఎస్ పాఠశాలల్లో పనిచేసిన ఉపాధ్యాయులకు, ఆ కాలానికి నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలనే డిమాండ్లపై పిఓ డిసెంబర్ 22న యుటియఫ్‌తో చర్చలు జరిపారు. పిఓ తన పరిధిలో ఉన్న సమస్యలను తక్షణం పరిష్కరిస్తానని, జిపిఎస్ పాఠశాలలకు డిఎస్‌సి ప్రకటన చేస్తానని, రాష్ట్ర ప్రభుత్వం నుంచి రావలసిన వాటికి, ప్రభుత్వం దృష్టికి తీసుకువెళ్ళి వచ్చే విధంగా చేస్తానని యుటియఫ్ నాయకులకు హామీ ఇవ్వడంతో ధర్నాను తాత్కాలికంగా వాయిదా వేశారు.

పిఓతో జరిగిన చర్చలలో యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి గొంటి గిరిధర్, జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు రెడ్డి మోహనరావు, చౌదరి రవీంద్ర, జిల్లా కార్యదర్శులు ఆరికి భాస్కరరావు, ఎస్.జగదీశ్వరరావు, డి.ప్రకాశరావు, ఎస్.మహేష్, ఐటిడిఏ యుటియఫ్ నాయకులు బి. సోమయ్య, పి.క్రిష్ణారావు, కె.కృష్ణారావు, పి.నారాయుడు, వి.చంద్రిక తదితరులు పాల్గొన్నారు.

**విజయనగరం**

## మహిళా టీచర్ల సమస్యపై పోస్టుకార్డు క్యాంపెయిన్

తాజాగా విడుదల చేసిన హెల్త్‌కార్డుల స్కీమ్‌లో మహిళా టీచర్ల అత్తమామలను డిపెండెంట్స్‌గా గుర్తించాలని, పనివేళలు మార్చు చేయాలని, అన్ని పాఠశాలల్లో మరుగుదొడ్లు, రన్నింగ్ వాటర్ సౌకర్యం కల్పించాలని, మహిళలకు రక్షణ కల్పించాలని, రక్షణ కోసం తెచ్చే చట్టాలను సమగ్రంగా అమలు చేయాలని కోరుతూ రాష్ట్ర మహిళా సదస్సు పిలుపుమేరకు రాష్ట్ర ముఖ్యమంత్రికి పోస్టుకార్డు క్యాంపెయిన్ చేపట్టారు. విజయనగరం జిల్లాలో సాలూరు, మక్కువ, బొబ్బిలి ప్రాంతాలలో గల ఆశ్రమ, ఉన్నత, సంక్షేమ పాఠశాలల్లో రాష్ట్ర సహాధ్యక్షులు కె.విజయగౌరితోపాటు, స్థానిక మహిళా నాయకత్వం ఇ.దేవి, కృష్ణకుమారి, ఎరకమ్మ, జ్యోతి, భానుమతి, సువర్ణ, అమ్మడమ్మలు బృందంగా పర్యటించి ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా మహిళా టీచర్ల, బాలికల సమస్యలను సేకరించారు.

**కడప**

## విద్యారంగ పరిరక్షణ వేదిక ఏర్పాటు

కడప జిల్లాలోని ఉపాధ్యాయ సంఘాలన్నీ ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ కోసం ఒక వేదిక ఏర్పాటు చేయటానికి డిసిఇబి హాల్‌లో రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించారు. ప్రభుత్వ విద్యారంగం బలోపేతం మరియు ప్రభుత్వ పాఠశాలల పరిరక్షణ కోసం జిల్లాలోని ఉపాధ్యాయ సంఘాలన్నీ నడుం బిగించాయి. ప్రభుత్వ విద్యారంగాన్ని బలోపేతం చేయటానికి విద్యా పరిరక్షణ వేదిక ఏర్పాటు చేశారు. ఇది నిరంతరం విద్యారంగం అభివృద్ధికి చేస్తుందని తెలిపారు. ప్రధానంగా ప్రభుత్వ పాఠశాలల పట్ల ప్రజలకు నమ్మకం కలిగించటానికి రౌండ్‌టేబుల్ మీటింగ్‌లు, సదస్సులు, జాతాలు నిర్వహిస్తామని తెలిపారు. జిల్లా స్థాయిలో "ప్రభుత్వ విద్యారంగం – పరిరక్షణ" సదస్సు జనవరిలో నిర్వహిస్తామని తెలిపారు.

హెచ్ఎం అసోసియేషన్, యుటియఫ్, ఎస్‌టియు, పిఆర్‌టియు, ఏపిటిఎఫ్, డిటిఎఫ్, ఏపియుఎస్, ఏపిప్రైవేఎస్‌ఆర్‌టిఎఫ్, ఎస్‌యుటిఏ, ఆర్‌యుటిఏ, ఆర్‌యుపిపి, ఎస్ఎల్‌టిఏ, ఎస్‌సి, ఎస్‌టియుఎస్ సంఘాల నాయకులు పాల్గొన్నట్లు యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి లక్ష్మీరాజా తెలిపారు.

## కెజిబివి టీచర్స్ ఫెడరేషన్ ఏర్పాటు

కెజిబివి (కస్తూర్బా గాంధీ బాలికల విద్యాలయం) టీచర్ల సమావేశం యుటియఫ్ కడప జిల్లా కార్యాలయంలో నిర్వహించారు. ఈ సమావేశంలో జిల్లా ప్రధానకార్యదర్శి బి.లక్ష్మీరాజ మాట్లాడుతూ ప్రభుత్వ ఉపాధ్యాయులకు వర్తింపజేసే అన్ని సౌకర్యాలను వర్తింప చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ప్రధానంగా శాశ్వత ఉపాధ్యాయులుగా గుర్తించాలి. మహిళా ఉపాధ్యాయులకిచ్చే సెలవులు వర్తింపజేయాలి. వేతనంతో కూడిన ప్రసూతి సెలవు ఇవ్వాలి, పాఠశాలల సమయాన్ని కుదించాలని కోరారు. యుటియఫ్ జిల్లా ఉపాధ్యక్షురాలు ఆర్.ఉషాతులసి మాట్లాడుతూ కెజిబివి ఉపాధ్యాయుల పక్షాన అండగా నిలబడతామని తెలిపారు.

అనంతరం కెజిబివి టీచర్స్ సమస్యల పరిష్కారానికి కెజిబివి టీచర్స్ ఫెడరేషన్ ఏర్పాటు చేశారు. జిల్లా కమిటీని ఎన్నుకున్నారు. గౌరవ సలహాదారుడు బి.లక్ష్మీరాజ, గౌరవాధ్యక్షులు ఆర్.ఉషాతులసి, అధ్యక్షురాలు బి.రాధాదేవి, ప్రధానకార్యదర్శి కె.కౌసర్, ట్రెజరర్ కె.స్వర్ణలత 15మందితో కమిటీ ఏకగ్రీవంగా ఎన్నికయ్యింది.

**తూర్పుగోదావరి**

## 69% ఫిట్‌మెంట్‌తో 10వ పీఆర్‌సీని అమలు చేయాలి
## తూర్పుగోదావరి జిల్లా కార్యవర్గం డిమాండ్

డిసెంబర్ 7న తూర్పుగోదావరి జిల్లా కార్యవర్గ సమావేశం కాకినాడ యుటియఫ్ హోమ్‌నందు జిల్లా అధ్యక్షులు డి.వి.రాఘవులు అధ్యక్షతన జరిగింది. ముఖ్య అతిథిగా యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు మరియు జెఏసి సెక్రటరీ జనరల్ ఐ.వెంకటేశ్వరరావు హాజరైనారు. 10వ పీఆర్‌సీ రిపోర్టును బహిర్గతం చేయాలని మరియు కమిటీలతో కాలయాపన చేయకుండా ఫిట్‌మెంట్ ఫార్ములాను జెఏసితో చర్చలు జరిపి నిర్ధారించాలని ప్రభుత్వాన్ని ఆయన డిమాండ్ చేశారు. అలాగే ఆరోగ్య కార్డులతో వైద్యం నిరాకరించే కార్పోరేట్ ఆసుపత్రులపై చర్యలు తీసుకోవాలని ప్రభుత్వాన్ని కోరారు. టీచర్ ఎమ్మెల్సీ అభ్యర్థి రాము సూర్యారావు లాంటి మానవతావాదిని గెలిపించాలని కార్యకర్తలకు పిలుపునిచ్చారు.

ఎమ్మెల్సీ అభ్యర్థి రాము సూర్యారావు మాట్లాడుతూ పేద విద్యార్థులను చదవించడానికి, పేదవారికి సరియైన వైద్యం అందించడానికి ఇప్పటి వరకు కృషి చేశానని, ఇప్పటి నుండి బడుగుబలహీన వర్గాల పిల్లలకు విద్యను అందించే ప్రభుత్వ విద్యారంగమును కాపాడటానికి కృషి చేస్తానని హామీ ఇచ్చారు. రాష్ట్ర కార్యదర్శి కె.ఎస్.ఎస్.ప్రసాద్ కర్తవ్యాల నివేదికను ప్రవేశ పెట్టారు. జిల్లా ప్రధానకార్యదర్శి టి.కామేశ్వరరావు కార్యదర్శి నివేదికను, పని విభజనను, ఉపసంఘాల ప్రతిపాదనలను ప్రవేశ పెట్టారు. జిల్లా గౌరవాధ్యక్షుడు జి.ప్రభాకరవర్మ తీర్మానాలను, యుటియఫ్ వార్తల విశేషాలను ప్రవేశ పెట్టారు. ఎయిడెడ్ ఉపసంఘం కన్వీనర్ జోగా అప్పారావు ఎయిడెడ్ నివేదికను, ఏజెన్సీ ఉపసంఘం కన్వీనర్ ఇ.చైతన్య కిరణ్ ఐటిడిఏ వద్ద జరిగే పోరాట వివరాలను తెలియజేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా అసోసియేట్ అధ్యక్షురాలు ఎన్.అరుణకుమారి, జిల్లా కోశాధికారి కె.వి.ప్రసాద్‌బాబు, కుటుంబ సంక్షేమ ప్రధాన కార్యదర్శి సిహెచ్.వి.రమణ, జిల్లా కార్యదర్శులు ఎస్.జ్యోతిబసు, జనిపెల్ల సత్యనారాయణ, ఎం.వెంకటేశ్వరరావు, ఎం. విజయగౌరి, ఒ.నాగేశ్వరరావు, చక్రవర్తి, షరీఫ్, వాషింగ్టన్, వి.సోనీ, ఎస్.ఎస్.వి.చలపతి, పి.నాగేశ్వరరావు, పెంకే వెంకటేశ్వరరావు, జిల్లా ఆడిట్ కమిటీ కన్వీనర్ తోలేటి సూర్యానారాయణ, పశ్చిమగోదావరి జిల్లా కోశాధికారి పి.వి.నరసింహారావు, రాష్ట్ర కార్యవర్గ సభ్యురాలు వి.కనకదుర్గ పాల్గొన్నారు.

### ప్రకాశం

## ఫిట్‌మెంట్ 69 శాతం ఇవ్వాలి



పీఆర్సీపై తక్షణమే చర్యలు తీసుకొని ఉద్యోగులకు గ్రాట్యుటీ రూ. 15 లక్షలు ప్రకటించి ఫిట్‌మెంట్ 69శాతం ఇవ్వాలని యుటియఫ్ జిల్లా గౌరవాధ్యక్షుడు మీగడ వెంకటేశ్వర్‌రెడ్డి డిమాండ్ చేశారు. పట్టణంలోని కస్తూరిబా మున్సిపల్ బాలికోన్నత పాఠశాలలో జనవరి 4న యుటియఫ్ చీరాల ప్రాంతీయ ముఖ్య కార్యకర్తల సమావేశాన్ని యుటియఫ్ రాష్ట్ర కౌన్సిలర్ కె.వీరాంజనేయులు అధ్యక్షతన నిర్వహించారు. ఈ సందర్భంగా యుటియఫ్ జిల్లా గౌరవాధ్యక్షులు మాట్లాడుతూ జులై 2013 నుంచీ పీఆర్సీ సిఫారసులను అమలు చేయాలని కోరారు. పీఆర్సీలో కనీస వేతనంగా రూ.15వేలు చేయాలని, గ్రాట్యుటీని పెంచాలన్నారు. ఎయిడెడ్ పాఠశాలల ఉపాధ్యాయుల ఖాళీలను వెంటనే భర్తీ చేయాలన్నారు. పండిట్, పీఈటీ పోస్టులను వెంటనే అప్‌గ్రేడ్ చేయాలని, ఉపాధ్యాయుల ప్రమోషన్లు, సర్వీస్ క్రమబద్ధీకరణ చేయాలన్నారు. అరియర్స్‌ను వెంటనే ఇవ్వాలన్నారు. అకడమిక్ ఇన్‌స్ట్రక్టర్లకు వెంటనే జీతాలు చెల్లించాలన్నారు. ఉద్యోగులకు బడ్జెట్ సమావేశాలకు ముందు మెరుగైన పీఆర్సీ ప్రకటించాలని డిమాండ్ చేశారు. కార్యక్రమంలో జిల్లా ప్రధానకార్యదర్శి పి.రమణారెడ్డి, జిల్లా కార్యదర్శులు జి.నాగేశ్వరరావు, ఎస్.పాపారావు, శ్రీనివాసరెడ్డి, చీరాల, చీరాల రూరల్, వేటపాలెం, కారంచేడు, పర్చూరు, చినగంజాం, ఇంకొల్లు, ఉపాధ్యాయులు, సభ్యులు పాల్గొన్నారు.

### తూర్పుగోదావరి

## విజయవంతమైన కాకినాడ కార్పొరేషన్ వద్ద జరిగిన ధర్నా

డిసెంబర్ 11న కాకినాడ మున్సిపల్ కార్పొరేషన్ పరిధిలో పెండింగ్ సమస్యల పరిష్కారానికి యుటియఫ్ కాకినాడ నగరశాఖ చేసిన ధర్నా విజయవంతమైనది. అక్రమ బదిలీలు రద్దు చేయాలనీ, అర్హులైన ఉపాధ్యాయులకు పదోన్నతులు ఇవ్వాలని, కౌన్సిలింగ్ పద్ధతిలోనే బదిలీలు నిర్వహించాలనే తదితర 22 డిమాండ్స్ సాధన కొరకు కాకినాడ నగర శాఖ ధర్నా చేయడం జరిగింది. ధర్నా శిబిరానికి కాకినాడ నగరశాఖ అధ్యక్షులు ఆర్.సూర్యచక్రం అధ్యక్షత వహించారు. యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి టి.కామేశ్వరరావు ధర్నా శిబిరాన్ని ఉద్దేశించి మాట్లాడుతూ సమస్యల పరిష్కారంలో అధికారులు అలసత్వం వహిస్తే యుటియఫ్ పోరాట పటిమను చవిచూడాల్సి వస్తుందన్నారు. కుటుంబ సంక్షేమ ప్రధానకార్యదర్శి సిహెచ్.వి.రమణ సమస్యలను వివరించారు. మధ్యాహ్నం వరకు ధర్నా కొనసాగింది. కమీషనర్ లేకపోవడంతో డిప్యూటీ కమిషనర్ చర్చలు జరిపారు. జిల్లా ప్రధానకార్యదర్శి టి. కామేశ్వరరావు, కుటుంబ సంక్షేమ ప్రధానకార్యదర్శి సిహెచ్.వి.రమణ, జిల్లా కార్యదర్శి జోగా అప్పారావు, కాకినాడ నగరశాఖ ప్రధాన బాధ్యులు ఆర్.సూర్యచక్రం, జెవివి సుబ్బారావు. రాష్ట్ర కౌన్సిలర్ కెవివి నగేష్, ఇమ్మానియేల్, బివివి ప్రసాద్‌లు చర్చల్లో పాల్గొన్నారు. బదిలీలు, పదోన్నతులు మినహా మిగిలిన డిమాండ్లపై చర్చించి మిగిలిన సమస్యలపై మరునాడు కమీషనర్‌తో చర్చించవలసినదిగా డిప్యూటీ కమీషనర్ కోరినారు. మిగిలిన సమస్యలపై లిఖిత పూర్వక హామీ లభించడం మరియు చర్చల వివరములను, హామీలను స్వయంగా ధర్నా శిబిరానికి వచ్చి డిప్యూటీ కమిషనర్ తెలియజేయడంతో ధర్నా శిబిరాన్ని విజయవంతంగా ముగించడమైనది. మరునాడు కమీషనర్ స్వయంగా చర్చలకు ఆహ్వానించారు. జిల్లా ప్రధానకార్యదర్శి టి.కామేశ్వరరావు, జిల్లా గౌరవాధ్యక్షులు జి.ప్రభాకరవర్మ, జిల్లా కార్యదర్శి జోగా అప్పారావు, కుటుంబ సంక్షేమ ప్రధానకార్యదర్శి సిహెచ్.వి.రమణ, కాకినాడ నగరశాఖ ప్రధాన బాధ్యులు ఆర్.సూర్యచక్రం, జెవివి సుబ్బారావు, మహిళా కార్యదర్శి సుధారాణి మరియు పదోన్నతులకు అర్హులైన ఉపాధ్యాయులతో కలసి ప్రతినిధి బృందంగా చర్చలకు వెళ్ళడం జరిగింది. వెంటనే పదోన్నతులు, బదిలీల దస్త్రం స్పెషల్ అధికారి అయిన జిల్లా కలెక్టర్ వారికి అదేరోజు సాయంత్రం పంపుతామని స్పష్టమైన హామీ ఇవ్వడంతో ఈ పోరాటం విజయవంతమైనది.

### విజయనగరం

## క్లస్టర్ పాఠశాలల విధానాన్ని విరమించుకోవాలని దశలవారీ పోరాటం

జనవరి 23వ తేదీన క్లస్టర్ పాఠశాలల విధానాన్ని విరమించుకోవాలని విజ్ఞప్తి చేస్తూ మంత్రి కిమిడి మృణాళినికి జిల్లాశాఖ ఆధ్వర్యంలో వినతిపత్రాన్ని అందజేశారు. జిల్లా శాఖ ఆధ్వర్యంలో జనవరి 29వ తేదీ నుండి మండల కేంద్రాలలో ధర్నాలు

నిర్వహించాలని, ఫిబ్రవరి 9న చలో కలెక్టరేట్ నిర్వహించాలని, తల్లి దండ్రులతో, ఎస్ఎంసిలతో, ప్రజాప్రతినిధులతో రౌండ్‌టేబుల్ సమావేశాల జరపాలని దశలవారీ పోరాటాన్ని ప్రకటించారు.

ఆందోళనా కార్యక్రమంలో ప్రజలను భాగస్వామ్యం చేయాలని సర్పంచులకు, ప్రజాప్రతినిధులకు ప్రత్యేక లేఖలు ముద్రించి అంద జేయాలని. 10వేల కరపత్రాలు, 3వేల పోస్టర్లు వేయించి విస్తృత ప్రచారం నిర్వహించారు.

**గిరిజన సంక్షేమ పాఠశాలల ఉపాధ్యాయుల అక్రమ సస్పెన్షన్లను, డెప్యుటేషన్లను రద్దు చేయాలని ఐటిడిఏ ఎదుట ధర్నా - పోరాట ఫలితంగా సస్పెన్షన్లు రద్దు**



విజయనగరం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో జనవరి 5న ఐటిడిఏ కార్యాలయం ఎదుట ధర్నా జిల్లా అధ్యక్షులు ఎస్.మురళీమోహన్ అధ్యక్షతన జరిగింది. ఈ ధర్నాలో రాష్ట్ర నాయకులు కె.విజయగౌరి, డి.రాము, జిల్లా ప్రధానకార్యదర్శి కె.శేషగిరి, జిల్లా కార్యదర్శులు జి. వెంకటనాయుడు, టి.రమేష్, ఎన్.శ్రీరాములు, జె.ఈశ్వరరావు, పి. మధుసూధనరావులు పాల్గొన్నారు.

ఐటిడిఏ యాజమాన్యం అశాస్త్రీయంగా, ఆకాశరామన్న ఉత్తరాలతో టీచర్లను సస్పెండ్ చేయడం అన్యాయమని ధ్వజమెత్తారు. అకారణంగా ఉపాధ్యాయుల పట్ల కక్ష్యపూర్వకంగా వ్యవహరించడాన్ని నిరశిస్తున్నా మని, అక్రమ సస్పెన్షన్లు, డెప్యుటేషన్లు తక్షణమే రద్దు చేయాలని, లేకపోతే పోరాటం ఉధృతం చేస్తామన్నారు.

నిబంధనలకు విరుద్ధంగా డెప్యుటేషన్లు వేయటాన్ని తీవ్రంగా ఖండించారు. టీచర్ల కొరత తీవ్రంగా ఉండటానికి శాశ్వత పరిష్కారాలు చేయని ప్రభుత్వాలు, యాజమాన్యాలు అక్రమ డెప్యుటేషన్లకు పూను కుంటున్నారని ఆరోపించారు. ఐటిడిఏలో ఖాళీగా ఉన్న స్కూల్ అసిస్టెంట్ పోస్టులను పదోన్నతుల ద్వారా భర్తీ చేయాలని డిమాండ్ చేశారు. కామన్ సీనియార్టీ లిస్టు తయారుచేసి కౌన్సిలింగ్ నిర్వహించాలన్నారు. పిల్లల సంఖ్య తక్కువగా ఉందనే పేరుతో ఎస్‌టి సంక్షేమ హాస్టల్సును మూసేవేయడం సరికాదన్నారు.

అనంతరం జరిగిన చర్చల్లో సస్పెషన్లు రద్దు చేస్తున్నట్లు ప్రకటించారు. కామన్ సీనియార్టీ లిస్టు విడుదల చేస్తామని హామీ ఇచ్చారు. యుటిఎఫ్ పోరాట ఫలితంగా రెండు సమస్యలు పరిష్కారం అయ్యాయి. మిగిలిన సమస్యల పరిష్కారానికి భవిష్యత్ కార్యాచరణ ప్రకటిస్తామని జిల్లాశాఖ ప్రకటించింది. ఈ కార్యక్రమంలో సాలూరు, పార్వతీపురం, కొమరాడ, జియ్యమ్మవలస, కురుపాం, జివిఎల్ పురం, మక్కువ మండలాల అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు, నాయకులతో పాటు 120మంది టీచర్లు పాల్గొన్నారు.

**విజయవంతమైన ఐటిడిఏ రంపచోడవరం ధర్నా**

డిసెంబర్ 8న ఐటిడిఏ రంపచోడవరం పరిధిలో పెండింగ్ సమస్యల పరిష్కారం కోరుతూ యుటిఎఫ్ తూర్పుగోదావరి జిల్లాశాఖ చేసిన ధర్నా విజయవంతమైనది. అక్రమ డిప్యుటేషన్ రద్దు చేయాలని, సుదీర్ఘకాలం పోస్టింగ్ లేకుండా సస్పెన్షన్‌లో ఉన్న ఉపాధ్యాయులకు రీపోస్టింగ్ ఇవ్వాలనీ, అక్రమ సస్పెన్షలో విధించిన శిక్షలను ఎత్తి వేయాలనీ, డిప్యూటీ వార్డెన్ల నియామకంలో జరిగిన అక్రమాలను రద్దు చేయాలనే మొత్తం 14 డిమాండ్ల సాధనకొరకు యుటిఎఫ్ తూర్పు గోదావరి జిల్లా శాఖ ఐటిడిఏ యాజమాన్యానికి ధర్నా నోటీసు ఇచ్చి ధర్నా చేయడం జరిగింది. ధర్నా శిబిరానికి ఏజెన్సీ ఉపసంఘం కో- కన్వీనర్ ప్రేమ్‌కుమార్ అధ్యక్షత వహించారు. రాష్ట్ర కార్యదర్శి కెఎస్ఎస్ ప్రసాద్, జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు డి.వి.రాఘవులు, టి. కామేశ్వరరావు, ఏజెన్సీ ఉపసంఘం కన్వీనర్ మరియు జిల్లా కార్యదర్శి ఇ.చైతన్య కిరణ్ తదితరులు ధర్నా శిబిరాన్ని ఉద్దేశించి ప్రసంగించారు. డిప్యూటీ డైరెక్టర్ మణికుమార్‌తో జరిగిన చర్చలు ఫలితం లేనందున చర్చలకు ముగింపు పలికి పోరాట రూపాన్ని మార్చి డిడి కార్యాలయాన్ని ముట్టడి చేయడం జరిగింది. సుమారు 2 గంటలపాటు కార్యాలయాన్ని ముట్టడి చేయడంతో స్థానిక శాసన సభ్యురాలు వంతల రాజేశ్వరి మరికొంత మంది స్థానిక ప్రజా ప్రతినిధులు, జెఏసి నాయకులు చిట్టిబాబు ముట్టడి కార్యక్రమానికి వచ్చి సంఘీభావాన్ని తెలిపారు. చివరికి ప్రాజెక్ట్ అధికారి గంధం చంద్రుడు, డిడి మణికుమార్, స్థానిక శాసన సభ్యు రాలు తదితరులు ముట్టడి జరుగుతున్న శిబిరంలో కార్యకర్తల మధ్యనే చర్చలు జరిపారు. డిమాండ్ నోటీసులోని ప్రతి అంశముపై చర్చకు పట్టుబట్టడంతో పిఓ ప్రతి అంశముపై స్పష్టమైన హామీనిచ్చారు. మూడు రోజుల్లోగా అన్ని సమస్యలను పరిష్కరించాలని డిడిని ఆదేశించారు. ధర్నా ఫలితంగా 14 అక్రమ డిప్యుటేషన్స్ రద్దు, మూడు సంవత్సరాల నుండి సస్పెన్షన్‌లో ఉన్న ఉపాధ్యాయుని రీపోస్టింగ్, అక్రమంగా నియామకం జరిపిన డిప్యుటేషన్ వార్డెన్ల రద్దు వంటి సమస్యలు మొత్తం పరిష్కారం అయినాయి. ఈ పోరాటం ఏజెన్సీలోని ఏడు మండలాల కార్యకర్తలకు మంచి స్ఫూర్తిని కలుగజేసింది. జిల్లా కార్యదర్శులు ఎం. విజయగౌరి, టి.జి.వాషింగ్టన్, పి.నాగేశ్వరరావు, రాష్ట్ర కౌన్సిలర్స్ పి.మంగరాజు, పి.రాంబాబు, ఎంటిఎస్ రస్కిన్, కుటుంబ సంక్షేమ డైరెక్టర్లు పి.మురళీకృష్ణ, ఎం.వి.సాయిరామ్, ఎస్.నాగప్రసాద్, పి.ఎస్. నెల్సన్, మండలశాఖల బాధ్యులు విశ్వరాజ్, కె.సూరిబాబు, గవర్రాజు, గాంధీ, కృష్ణ, సోమిరెడ్డి, వెంకన్నదొర, ఇ.శ్రీమణి, సాయిబాబుదొర, శివబాబులు పాల్గొన్నారు.

**కడప**

**పిఎఫ్ ఖాతాలను ఆన్‌లైన్ చేయాలి**

యుటిఎఫ్ కడప జిల్లాశాఖ ఆధ్వర్యంలో దాదాపు 12వేలమంది ఉపాధ్యాయుల జిల్లా పరిషత్ ప్రావిడెంట్ ఫండ్ (జెడ్‌పిపిఎఫ్)

ఖాతాలను ఆన్‌లైన్ చేయాలని జిల్లా పరిషత్ కార్యాలయం వద్ద బైటాయింపు చేసి నిరసన తెలిపారు. జిల్లా పరిషత్ ముఖ్య కార్యనిర్వహణాధికారికి వ్యతిరేకంగా పెద్దఎత్తున నినాదాలు ఇచ్చారు. ఈ సందర్భంగా జిల్లా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు ఎస్.ఓబుల్‌రెడ్డి, బి.లక్ష్మిరాజ మాట్లాడుతూ ఉపాధ్యాయు ల ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలను ఆన్‌లైన్ చేయాలని అనేకమార్లు కోరటం జరిగింది. అలాగే ఆగస్టు 8న ధర్నా నిర్వహించాము. అయినా జిల్లా పరిషత్ ముఖ్యకార్యనిర్వహణాధికారి ఉపాధ్యాయుల పిఎఫ్ ఖాతాలను ఆన్‌లైన్ చేయటానికి ఎలాంటి చర్యలు తీసుకోకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిం చారు. అందుకు నిరసనగా ఈ బైఠాయింపు కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నామని తెలిపారు.

కోట్ల రూపాయల గ్రాంట్లు ఉంటే జిల్లా పరిషత్ కార్యాలయపు నిధుల నుండి పిఎఫ్ ఆన్‌లైన్ చేయటానికి 20వేల రూపాయలు ఖర్చు పెట్టటానికి నిధులు లేకపోవటం శోచనీయం. గతంలో నిధులు లేకున్నా కమీషన్ల కోసం అనేక పనులు మంజూరు చేసిన ఘనత మన ముఖ్య కార్యనిర్వహణాధికారి గొప్పతనమన్నారు. నేషనల్ ఇన్ఫర్మేషన్ సెంటర్ (ఎన్ఐసి) నుండి ఒప్పందం చేసుకొని పిఎఫ్ ఖాతాలను ఆన్‌లైన్ చేయాలని డిమాండ్ చేశారు. అలాగే గత సంవత్సరం పిఎఫ్ స్లిప్పులు ఇవ్వాలని, పిఎఫ్ లోన్లు సీనియార్టీ ప్రకారం మంజూరు చేయాలని కోరారు.

ఈ కార్యక్రమంలో రాష్ట్ర కౌన్సిలర్లు పి.చంద్రశేఖర్, డి.మృత్యుంజయ రాజు, రమణమూర్తి, జిల్లా సహాధ్యక్షులు ఎం.విజయ్‌కుమార్, ట్రెజరర్ ఎస్.వి.సుబ్బరాజు, కార్యదర్శులు ఎస్.జాబీర్, రవికుమార్, హరిప్రసాద్, మండల నాయకులు శ్రీనివాసులు రెడ్డి, శ్రీకాంత్, రమ;ాణ, రఫీ, రమణ, శ్రీహరి, దానయ్య, రజాక్, మహబూబ్ భాషా, ఖాన్, శ్యాంసుందర్, హరినాథ్‌బాబు, గంగిరెడ్డి, విజయ్‌కుమార్, జిలాని తదితరులు పాల్గొన్నారు.

### గుంటూరు

### ఎయిడెడ్ ఉపాధ్యాయుల పదవీ విరమణ వయస్సు పెంపుపట్ల యుటియఫ్ హర్షం

ఎయిడెడ్ ఉపాధ్యాయుల పదవీ విరమణ వయస్సు 60 సం॥లు పెంపుదల పట్ల యుటియఫ్ జిల్లా శాఖ హర్షం ప్రకటించింది. జనవరి 4న యుటియఫ్ హాల్‌లో జిల్లా గౌరవాధ్యక్షులు ఎ.నాగేశ్వరరావు అధ్యక్షతన అభినందన సభ జరిగినది. ఈ సమావేశంలో ఎమ్మెల్సీ కెఎస్ లక్ష్మణరావు ముఖ్య అతిథిగా హాజరయి మాట్లాడుతూ యుటియఫ్ రాష్ట్ర సంఘం, పిడిఎఫ్ ఎమ్మెల్సీల ప్రత్యేక కృషి వల్ల ఎయిడెడ్ ఉపాధ్యాయుల పదవీ విరమణ వయస్సు పెంపుదల చేయడం జరిగిందన్నారు. ఈ సందర్భంగా ఎమ్మెల్సీ లక్ష్మణరావు కేక్ కట్‌చేసి అందరికి అభినందనలు తెలపడం జరిగింది. రాష్ట్ర సహాధ్యక్షులు ఎన్.వెంకటేశ్వర్లు, జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.హనుమంతరావు, యుటియఫ్ జిల్లా కోశాధికారి పి.ప్రేమ్‌కుమార్, యుటియఫ్ రాష్ట్ర ఆడిట్ కమిటీ సభ్యులు ఎండి గౌస్, యుటియఫ్ సీనియర్ నాయకులు ఎన్.తాండవకృష్ణ, జిల్లా కార్యదర్శులు పాల్గొన్నారు.

### మోడల్ స్కూల్ ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి డైరెక్టర్ హామీ - ఎపిఎంఎస్‌టిఎఫ్

ఆంధ్రప్రదేశ్‌లోని మోడల్ స్కూల్స్‌లో పనిచేయుచున్న ఉపాధ్యాయుల సమస్యలను పరిష్కరిస్తామని పాఠశాల విద్యాశాఖ కమీషనర్ & డైరెక్టర్ కె.సంధ్యారాణి హామీ యిచ్చినట్లుగా ఎపిఎంఎస్‌టిఎఫ్ రాష్ట్ర అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఆర్.ఈశ్వరరావు, ఎన్.బోసుబాబులు తెలియ జేశారు. జనవరి 21న కమీషనర్‌ను కలిసి మోడల్ స్కూల్ టీచర్ల సమస్యలను చర్చించడం జరిగింది. 2014 జనవరి నుండి తాత్కాలిక భృతి మరియు మూడు విడతల డిఏ బకాయిలను చెల్లించాలని కోరగా వెంటనే విడుదల చేస్తామని హామీ ఇచ్చారు. ప్రసూతి మరియు పితృత్వ సెలవులకు సంబంధించి ఉపాధ్యాయుల జీతాల బకాయిలను చెల్లించాలని, ఇన్-సర్వీస్ ఉపాధ్యాయులకు పాత పెన్షన్, పిఎఫ్ విధానాన్ని కొనసాగించాలని, ఔట్‌సోర్సింగ్ సిబ్బందికి డిసెంబర్ నెల జీతాలను చెల్లించాలని కోరారు.

జీతాలకు సంబంధించిన బిల్లులను ప్రిన్సిపాల్స్ ఆన్‌లైన్‌లో పంపే విధంగా ఆదేశాలు ఇవ్వనున్నట్లు కమీషనర్ తెలిపారని చెప్పారు. ఈ చర్చలలో యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఐ.వెంకటేశ్వరరావు పాల్గొన్నారు.

### విజయనగరం

### జాతీయస్థాయి విజ్ఞాన శాస్త్రమేళాకు ఎంపికైన జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల విద్యార్థిని అభినందించిన యుటియఫ్ ప్రతినిధి బృందం

విజయనగరం జిల్లా బలిజిపేట మండలం జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల వంతరాం గ్రామంలో 9వ తరగతి చదువుతున్న వెంకట శివరాందాసు స్వంత ఆలోచనతో అద్భుతాలు సృష్టించి అందరినీ ఆకర్షించాడు. తెగిపడిన విద్యుత్ వైర్ల ప్రమాదాన్ని ముందస్తుగా గుర్తించే "ఆటోమేటిక్ సిగ్నల్సు సిస్టమ్"ను తయారుచేసి పబ్లిక్ అలర్టుగా ప్రదర్శిం చాడు. విజ్ఞాన మేళాలు జిల్లా, రాష్ట్ర స్థాయిలలో ప్రథమ స్థానంలో నిలిచి జాతీయస్థాయికి ఆ ప్రాజెక్టు ఎంపిక అయింది. యుటియఫ్ ప్రతినిధి బృందం పాఠశాలను సందర్శించి జాతీయ స్థాయికి ఎంపిక అయిన విద్యార్థి వెంకట శివరాందాసును, సహకరించిన ప్రధానోపా ధ్యాయునికి, ఉపాధ్యాయ సిబ్బందికి అభినందనలు తెలియజేశారు. అనంతరం పాఠశాలలో విద్యార్థులతో నిర్వహించిన అసెంబ్లీలో రాష్ట్ర సహాధ్యక్షులు కె.విజయగౌరి సందేశమిస్తూ శివరాందాసుకి బహుమతి ప్రధానం చేశారు. ఈ కార్యక్రమంలో పాఠశాల ప్రధానోపాధ్యాయులు ఎన్.సీతారం, యుటిఎఫ్ నాయకులు వి.ప్రసన్నకుమార్, జి.వెంకట నాయుడు, వై.స్వామినాయుడు, జె.తాతబాబు, ఉపాధ్యాయ సిబ్బంది పాల్గొన్నారు.

### తెర్లాం యుటియఫ్ మండలశాఖ ఆధ్వర్యంలో ఘనంగా శ్రీనివాస రామానుజన్ జయంతి కార్యక్రమాలు

విజయనగరం జిల్లా తెర్లాం మండల యుటియఫ్ శాఖ గణిత శాస్త్ర పితామహుడు శ్రీనివాస రామానుజన్ జయంతి సందర్భంగా క్విజ్, వ్యాసరచన పోటీలను స్థానిక మండల పరిషత్ సమావేశ మందిరంలో అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎం.సింహాచలం నాయుడు, ఎన్.అజయ్‌కుమార్ ఆధ్వర్యంలో నిర్వహించారు. గణిత ఉపాధ్యాయు లు, జెవివి నాయకులు దప్పునాగేశ్వరరావు, రాంబాబు పాల్గొన్నారు. ఈ సందర్భంగా రామానుజన్ చేసిన కృషిని వివరించారు. అనంతరం పోటీ పరీక్షలలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు, ప్రశంసా పత్రాలను అందజేశారు.

# 10వ తరగతి మోడల్ పేపర్లు ఆవిష్కరణ

## గుంటూరు



యుటియఫ్ ప్రచురించిన ఎస్ఎస్సి మోడల్ టెస్ట్ పేపర్ల ఆవిష్కరణ ఫెడరేషన్ జిల్లా కార్యాలయంలో జరిగింది. టెస్ట్ పేపర్లను ఆవిష్కరించిన ఎమ్మెల్సీ కెఎస్ లక్ష్మణరావు మాట్లాడుతూ 25 యేళ్లుగా వీటిని యుటియఫ్ ప్రచురిస్తోందని, ఇవి ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ప్రయోజనకారిగా ఉంటున్నాయన్నారు. ఎంతో శ్రమతో మోడల్ టెస్ట్ పేపర్లను రూపొందిస్తున్న యుటియఫ్ రాష్ట్ర, జిల్లా శాఖలకు అభినందనలు తెలిపారు. జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.హనుమంతరావు మాట్లాడుతూ చదువులో బాగా వెనుకబడిన విద్యార్థులు కూడా ఈ పేపర్లను చదవడం ద్వారా ఉత్తీర్ణులు కావచ్చునని, అందరికీ అందుబాటులో ఉండేలా అతితక్కువ ధర రూ.50/-లకే అందిస్తున్నట్లు చెప్పారు. జిల్లా అధ్యక్షులు కె.నాగమల్లేశ్వరరావు మాట్లాడుతూ ఫెడరేషన్ కేవలం ఉపాధ్యాయ సమస్యలపైనే గాక విద్యా పరంగా కూడా నిరంతరం కృషి చేస్తోందన్నారు. కార్యక్రమంలో కోశాధికారి పి.ప్రేమ్ కుమార్, జిల్లా సీనియర్ నాయకులు కెఎస్వి దుర్గారావు, ఎస్కె అన్వర్ తదితరులు పాల్గొన్నారు.

## కడప



యుటియఫ్ ఎస్ఎస్సి తెలుగు & ఇంగ్లీష్ మోడల్ టెస్ట్ పేపర్లను కడప రీజినల్ జాయింట్ డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ (ఆర్జెడి) సిహెచ్. రమణ కుమార్ విడుదల చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ 10వ తరగతి పరీక్షలకు సిద్ధమయ్యే విద్యార్థులకు ఉపయోగకరంగా ఉన్నాయన్నారు. నూతనంగా ప్రవేశపెట్టిన సిసిఇ పద్ధతిలో ఈ ప్రశ్నాపత్రాలు ఉన్నాయి. యుటియఫ్ విద్యార్థులకు మాదిరి ప్రశ్నాపత్రాలు తయారుచేసి వుంచటం అభినందనీయం అన్నారు. జిల్లా ప్రధానకార్యదర్శి బి.లక్ష్మిరాజ మాట్లాడుతూ ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులకు తక్కువ ధరలో అందించాలని ఈ ప్రయత్నం చేశాం. ఈ అవకాశాన్ని తెలుగు & ఇంగ్లీష్ మీడియం విద్యార్థులు వినియోగించుకోవాలని తెలిపారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర కౌన్సిలర్ పి.చంద్ర శేఖర్, జిల్లా ట్రెజరర్ ఎస్వి సుబ్బరాజు, మండల నాయకులు దానయ్య, శంకరబాబు, హరినాథ్, శ్రీహరి, శ్రీనివాసులురెడ్డి, సూర్యప్రకాశ్ తదితరులు పాల్గొన్నారు.

## అనంతపురం



యుటియఫ్ రాష్ట్ర అకడమిక్ సెల్ ఆధ్వర్యంలో రూపొందించిన 10వ తరగతి మోడల్ టెస్ట్ పేపర్స్ పుస్తకాన్ని జిల్లా విద్యాశాఖాధికారి ఎం.అంజయ్య చేతుల మీదుగా విడుదల చేశారు. ఈ సందర్భంగా డిఇఓ ప్రసంగిస్తూ యుటియఫ్ సంఘం కేవలం ఉపాధ్యాయుల హక్కుల సాధన కోసమే కాకుండా సామాజిక బాధ్యతగా అకడమిక్ విషయాల పట్ల కూడా ప్రత్యేక శ్రద్ధ వహించి 10వ తరగతి విద్యార్థుల కోసం మోడల్ టెస్ట్ పేపర్స్ పుస్తకాన్ని రూపొందించడం అభినందనీయమని, ఉపాధ్యాయులందరూ వారికి సబ్జెక్టులలో వందశాతం ఫలితాలు సాధించడానికి పట్టుదలతో గట్టి కృషి చేయాలని కోరారు.

జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు మహమ్మద్ జిలాన్, కోటేశ్వరప్పలు మాట్లాడుతూ యుటియఫ్ అకడమిక్ సెల్ ఆధ్వర్యంలో గత 25 సంవత్సరములుగా 10వ తరగతి మోడల్ టెస్ట్ పేపర్స్ పుస్తకాలను రూపొందించి అతి తక్కువ వెలకు విద్యార్థులకు అందిస్తున్నామని, కొందరు దాతలు ద్వారా ఉచితంగా ఈ పుస్తకాలను అందిస్తున్నామని, ఎ,బి,సి గ్రేడ్ విద్యార్థులు మంచి స్కోర్ సాధించడానికి, డి,ఇ గ్రేడ్ విద్యార్థులు సునాయాసంగా ఉత్తీర్ణులు కావడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుందని తెలియజేశారు.

ఈ కార్యక్రమంలో జిల్లా గౌరవాధ్యక్షులు నాగేంద్రబాబు, ఉపాధ్యక్షురాలు సుజాతమ్మ, కార్యదర్శులు నాగేంద్ర, రూత్‌లు, రాష్ట్ర కౌన్సిల్ సభ్యులు భాస్కర్, ఉషారాణిలు ఆడిట్ కమిటీ కన్వీనర్ సాయినాథ్ బాబు తదితరులు పాల్గొన్నారు.

## ఏపిఎంఎస్టిఎఫ్ - 2015 క్యాలెండర్ ఆవిష్కరణ




ఆంధ్రప్రదేశ్ మోడల్ స్కూల్స్ టీచర్ ఫెడరేషన్ - 2015 సంవత్సరపు క్యాలెండర్స్‌ను విజయనగరం జిల్లా విద్యాశాఖాధికారి జి. కృష్ణారావు ఆవిష్కరించారు. ఈ ఆవిష్కరణ సభలో ఏపిఎంఎస్టిఎఫ్ రాష్ట్ర అధ్యక్షులు రావాడ ఈశ్వరరావు, జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు కె.ఎ.సత్యనారాయణ, వారణాశి శ్రీనివాసరావులతోపాటు యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి డి.రాము, యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి కె.శేషగిరి పాల్గొన్నారు.

# చెన్నుపాటి వర్ధంతి సభలు

**తూర్పుగోదావరి**

**ప్రభుత్వ విద్యారంగంను కాపాడుకోవడమే చెన్నుపాటికిచ్చే ఘనమైన నివాళి - కె.సత్తిరాజు**

డిసెంబర్ 21న తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురం మున్సిపల్ పట్టణ కళ్యాణ మండపమునందు అమరజీవి చెన్నుపాటి లక్ష్మయ్య వర్ధంతి సభ జిల్లా అధ్యక్షులు డి.వి.రాఘవులు అధ్యక్షతన జరిగింది. ఉపాధ్యాయ ఉద్యమంలో చెన్నుపాటి పాత్రను గురించి సీనియర్ నాయకులు కె.సత్యనారాయణ తెలియజేశారు. ముఖ్య అతిథిగా హాజరైన యుటియఫ్ రాష్ట్ర ఆడిట్ కమిటీ కన్వీనర్ కె.సత్తిరాజు మాట్లాడుతూ విద్యార్థులలో సామాజిక స్పృహ కల్గించేవి ప్రభుత్వ పాఠశాలలేనని కాబట్టి ప్రభుత్వ విద్యారంగమును కాపాడుకోవలసిన బాధ్యత మనదేనన్నారు.

ఈ సందర్భంగా జిల్లా గౌరవాధ్యక్షులు జి.ప్రభాకరవర్మ ఉభయ గోదావరి జిల్లాల టీచర్ ఎమ్మెల్సీ అభ్యర్థి రాము సూర్యారావును సభకు పరిచయం చేశారు. కార్పోరేట్ అభ్యర్థులను ఎదుర్కొని ఉన్నత విద్యా రంగం నుండి వచ్చిన మన అభ్యర్థిని గెలిపించుకోవడానికి కార్యకర్తలు కృషి చేయాలని పిలుపునిచ్చారు. ఎమ్మెల్సీ అభ్యర్థి రాము సూర్యారావు మాట్లాడుతూ ఒక నిజాయితీ గల సంఘం తరపున పోటీ చేయడం తనకు లభించిన మంచి అవకాశంగా భావిస్తున్నానన్నారు. జరిగే పోటీ ప్రభుత్వ విద్యారంగమునకు, ప్రైవేట్ కార్పోరేట్ శక్తులకు జరిగేదిగా అభివర్ణించారు. జిల్లా ప్రధానకార్యదర్శి టి.కామేశ్వరరావు, జిల్లా రిపోర్టులో జిల్లాలో చేసిన ప్రాతినిధ్యాలను, రాయబారాలను తెలియ జేశారు. జిల్లా కోశాధికారి కె.వి.ప్రసాద్‌బాబు ఆహ్వానం పలకగా కుటుంబ సంక్షేమ పథకం కార్య నిర్వహక అధ్యక్షులు తోటకూర రవి చక్రవర్తి వందన సమర్పణ చేశారు. పిఠాపురం రూరల్ & టౌన్, యు.కొత్తపల్లి, గొల్లప్రోలు శాఖల బాధ్యులు కొండబాబు, ఎం.వి.వి. సత్యనారాయణ, బి.వి.సుబ్రహ్మణ్యం, టి.శ్రీనివాసరావు, వి.వెంకటరెడ్డి, కె.నాగేశ్వరరావు, సిహెచ్.సూరిబాబు, వి.పి.వి.వి.సత్య నారాయణ, పి.వి.ఎన్.గణేశ్వరరావులు పాల్గొన్నారు.

**కపిలేశ్వరపురం**

డిసెంబర్ 10న కపిలేశ్వరపురం మండల శాఖ ఆధ్వర్యంలో చెన్నుపాటి వర్ధంతి సభ మండలశాఖ అధ్యక్షులు ఎస్ఎస్ఎన్ మూర్తి అధ్యక్షతన జరిగింది. జిల్లా అధ్యక్షులు డి.వి.రాఘవులు ముఖ్య అతిథిగా హాజరై చెన్నుపాటి జీవిత విశేషాలను తెలియజేశారు. మండలశాఖ ప్రధానకార్యదర్శి పి.సురేంద్రకుమార్ తదితరులు పాల్గొన్నారు.

**రాజమండ్రి**

డిసెంబర్ 10న రాజమండ్రి పరిసర శాఖల ఆధ్వర్యంలో దానవాయి పేట మున్సిపల్ ఉన్నత పాఠశాలయందు చెన్నుపాటి వర్ధంతి సభ జిల్లా కార్యదర్శి ఎ.షరీఫ్ అధ్యక్షతన జరిగింది. ఈ కార్యక్రమంలో రాష్ట్ర కార్యదర్శి కెఎస్ఎన్ ప్రసాద్, జిల్లా గౌరవాధ్యక్షులు జి.ప్రభాకరవర్మ, అసోసియేట్ అధ్యక్షురాలు ఎన్.అరుణకుమారి, జిల్లా కార్యదర్శి ఎం. విజయగౌరి, కుటుంబ సంక్షేమ డైరెక్టర్ పి.మురళీకృష్ణ తదితరులు పాల్గొన్నారు.

**కాకినాడ**

డిసెంబర్ 9న జిల్లా యుటియఫ్ హోమ్‌నందు చెన్నుపాటి వర్ధంతి సభ జరిగింది. జిల్లా గౌరవాధ్యక్షులు జి.ప్రభాకరవర్మ చెన్నుపాటి జీవిత విశేషాలను తెలియజేశారు. జిల్లా కార్యదర్శులు తోటకూర రవిచక్రవర్తి ఎస్ఎస్వి చలపతి పాల్గొన్నారు.

**అమలాపురం**

డిసెంబర్ 4న ఎంప్లాయీస్ హోమ్ అమలాపురంనందు చెన్నుపాటి వర్ధంతి సభ జిల్లా కార్యదర్శి ఎం.వెంకటేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. సీనియర్ నాయకులు కె.సత్యనారాయణ చెన్నుపాటి ఆశయాలను, ఆదర్శాలు, త్యాగాలు గురించి వివరించారు. జిల్లా కార్యదర్శి పెంకే వెంకటేశ్వరరావు జిల్లా రిపోర్టును ఇచ్చారు. రాష్ట్ర కౌన్సిలర్ ఎంటిఏఎస్ సుబ్బారావు, కుటుంబ సంక్షేమ పథకం డైరెక్టర్ బిఎన్ వెంకటేశ్వరరావు, అమలాపురం రూరల్, అమలాపురం టౌన్, అల్లవరం, ఉప్పలగుప్తం మండల శాఖల బాధ్యులు పాల్గొన్నారు.

**అంబాజీపేట**

డిసెంబర్ 12న మండల ప్రజాపరిషత్ ప్రాథమిక పాఠశాల, అంబాజీపేట (మెయిన్)నందు చెన్నుపాటి వర్ధంతి సభ నిర్వహించారు. జిల్లా కార్యదర్శి పెంకే వెంకటేశ్వరరావు ఉపాధ్యాయ ఉద్యమంలో చెన్నుపాటి పాత్రను గురించి తెలియజేశారు. అంబాజీపేట మండల శాఖ బాధ్యులు జి.వి.రమణ, పి.నారాయణమూర్తి, సిహెచ్.లోకేశ్వర రావు, ఎం.శ్రీరామమూర్తి తదితరులు పాల్గొన్నారు.

**మామిడికుదురు**

డిసెంబర్ 12న మండల వనరుల కేంద్రము, మామిడికుదురు నందు మండలశాఖ అధ్యక్షులు వై.నాగేశ్వరరావు అధ్యక్షతన చెన్నుపాటి వర్ధంతి సభ జరిగింది. చెన్నుపాటి చిత్రపటానికి సీనియర్ నాయకులు బి.గోపాలకృష్ణమూర్తి పూలమాలవేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమ ంలో కుడిపూడి సత్యనారాయణ, సిహెచ్.కేశవరావు, టి.రాజారావు, కొండయ్య తదితరులు పాల్గొన్నారు.

**రావులపాలెం**

డిసెంబర్ 9న జిల్లా ప్రజాపరిషత్ ఉన్నత పాఠశాల, రావులపాలెం నందు చెన్నుపాటి వర్ధంతి సభ మండలశాఖ అధ్యక్షులు కె.లక్ష్మీపతి రావు అధ్యక్షతన జరిగింది. చెన్నుపాటితో కలిసి ఉద్యమంలో పనిచేసిన సుబ్బారాయుడు చెన్నుపాటి జీవిత విశేషాలను తెలియజేశారు. జిల్లా ప్రధానకార్యదర్శి టి.కామేశ్వరరావు జిల్లా రిపోర్టును తెలియజేశారు. జిల్లా కార్యదర్శి ఎస్.జ్యోతిబసు, కుటుంబ సంక్షేమ పథకం డైరెక్టర్ వై.వి.ఎస్.ఎన్.బాలాజీ, ఎన్.దేవిడ్‌రాజు, కొప్పిశెట్టి శ్రీను తదితరులు పాల్గొన్నారు.

**కొత్తపేట**

డిసెంబర్ 10న మండల వనరుల కేంద్రం, కొత్తపేటనందు చెన్ను పాటి వర్ధంతిసభ మండలశాఖ అధ్యక్షులు వి.లక్ష్మణరావు

అధ్యక్షతన జరిగింది. జిల్లా ప్రధానకార్యదర్శి టి.కామేశ్వరరావు చెన్నుపాటి లక్ష్మయ్య జీవిత విశేషాలను, జిల్లా రిపోర్టును తెలియజేశారు. జిల్లా కార్యదర్శి పెంకే వెంకటేశ్వరరావు, మండలశాఖ బాధ్యులు పి.మురుగేశ్వరరావు, వై.మురళి, గమిడి ప్రసాద్, ఎంవివి సత్యనారాయణ, ఇందిరాబాయి తదితరులు పాల్గొన్నారు.

**తుని**

డిసెంబర్ 7న తుని రూరల్, తుని టౌన్, రౌతులపూడి, తొండంగి శాఖల ఆధ్వర్యంలో చెన్నుపాటి వర్థంతి సభ జరిగింది. సీనియర్ నాయకులు జి.చిట్టిబాబు ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రను, సర్వీస్ రూల్స్‌ను కె.సత్తిరాజు బోధించారు. జిల్లా కార్యదర్శులు జి.అప్పల నాయుడు, ఆర్‌వి రమణమూర్తి, మండల శాఖల బాధ్యులు జి.సత్య నారాయణ, ఎర్రాపాత్రుడు, బాపన్న తదితరులు పాల్గొన్నారు.

**జగ్గంపేట**

డిసెంబర్ 28న స్థానిక ముస్లిం కళ్యాణ మండపంలో జగ్గం పేట మండల శాఖ అధ్యక్షులు పి.వి.సత్యనారాయణ అధ్యక్షతన చెన్నుపాటి వర్థంతి సభ జరిగింది. జిల్లా గౌరవాధ్యక్షులు జి.ప్రభాకరవర్మ చెన్నుపాటి జీవిత విశేషాలను తెలియజేశారు. జిల్లా అధ్యక్షులు డి.వి.రాఘవులు లీవ్‌రూల్స్, జిల్లా ప్రధానకార్యదర్శి టి.కామేశ్వరరావు కంట్రిబ్యూటరీ పెన్షన్ పథకము, రాష్ట్ర కార్యదర్శి కెఎస్ఎస్ ప్రసాద్ నిబంధనావళి - నిర్మాణము, సర్వీస్ రూల్స్ పాఠాలను కార్యకర్తలకు బోధించారు. కుటుంబ సంక్షేమ పథకం డైరెక్టర్ ఎం.వి.సాయిరాం, జిల్లా కార్యదర్శి పి.నాగేశ్వరరావు, జగ్గంపేట, కిర్లంపూడి, ఏలేశ్వరం, గోకవరం, గండేపల్లి మండలాల కార్యకర్తలు పాల్గొన్నారు.

**రాజోలు**

డిసెంబర్ 22న మండల వనరుల కేంద్రం, రాజోలునందు చెన్నుపాటి వర్థంతి సభ మండలశాఖ అధ్యక్షులు ఎం.నరసింహారావు అధ్యక్షతన జరిగింది. కుటుంబ సంక్షేమ పథకం డైరెక్టర్ ఏ.కాశీ విశ్వేశ్వరరావు, సిహెచ్.దుర్గాప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.

**మలికిపురం**

డిసెంబర్ 11న మండల వనరుల కేంద్రం మలికిపురంనందు చెన్నుపాటి వర్థంతి సభ మండలశాఖ అధ్యక్షులు బివి సుబ్రహ్మణ్యం అధ్యక్షతన జరిగింది. జిల్లా కార్యదర్శి బి.శ్రీనివాసరావు, మండల శాఖ ప్రధానకార్యదర్శి కె.కిషోర్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు.

## గుంటూరు

నేటితరం ఉపాధ్యాయులు ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాత చెన్నుపాటి లక్ష్మయ్యను ఆదర్శంగా తీసుకుని ఉద్యమాలు కొనసాగించాలని యుటియఫ్ పూర్వ రాష్ట్ర అధ్యక్షులు కె.జోజయ్య కోరారు. జిల్లా అధ్యక్షులు కె.నాగమల్లేశ్వర రావు అధ్యక్షతన ఏర్పాటు చేసిన చెన్నుపాటి సంస్మరణ సభలో జోజయ్య ప్రసంగించారు. సర్వీస్ రూల్స్ లేని కాలంలో అతి తక్కువ జీతాలు పొందుతున్న నేపథ్యంలో ఉపాధ్యాయుల ఉన్నతికి నిరంతరం కృషి చేసిన ఉద్యమ పితామహుడు చెన్నుపాటి అని కొనియాడారు. ఒక నిబద్ధత కలిగిన కార్యకర్తగా కాలినడకన ప్రయాణించి బలమైన ఉద్యమాలు నిర్మించిన త్యాగధనుడు చెన్నుపాటి అని నివాళులర్పించారు. యుటియఫ్ సీనియర్ నాయకులు టి.అంజిరెడ్డి మాట్లాడుతూ ఉపాధ్యాయ సంఘానికి ఒక ప్రామాణికత రూపొందించిన గొప్ప వ్యక్తి లక్ష్మయ్య అని పేర్కొన్నారు. మరో సీనియర్ నాయకులు వి.విశ్వనాథం మాట్లాడుతూ అన్ని కేడర్లు, అన్ని మేనేజ్‌మెంట్‌లను ఒకేతాటిపైకి తెచ్చేందుకు చెన్నుపాటి కృషి చేశారని వివరించారు. ఎమ్మెల్సీ కెఎస్ లక్ష్మణ రావు మాట్లాడుతూ సీనియర్ నాయకుల త్యాగాలను నేటితరం వారు ఆదర్శంగా తీసుకొని ముందుకు సాగాలన్నారు. నాయకులు సాధించిన హక్కులను కాపాడుకోవాల్సిన అవసరం ఉందన్నారు. యుటియఫ్ పూర్వ జిల్లా అధ్యక్షులు జి.ప్రభుదాసు మాట్లాడుతూ సరైన రవాణా సౌకర్యాలు, సాంకేతికత అందుబాటులోలేని రోజుల్లో ఉపాధ్యాయుల పక్షాన పోరాడిన గొప్పవ్యక్తి చెన్నుపాటి అని అన్నారు. కార్యక్రమంలో జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.హనుమంతరావు, కోశాధికారి పి.ప్రేమ్‌కుమార్, కార్యదర్శులు జి.శివపూర్ణయ్య, పాల్‌రాజు, జగదీష్, వివిధ శాఖల బాధ్యులు పాల్గొన్నారు.

**సత్తెనపల్లి**

ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాత స్వర్గీయ చెన్నుపాటి లక్ష్మయ్య వర్థంతి సభను సత్తెనపల్లి ప్రాంతీయ శాఖల ఆధ్వర్యంలో స్థానిక జిల్లా పరిషత్ బాలికోన్నత పాఠశాల సత్తెనపల్లినందు డిసెంబర్ 10న జరిగింది. సత్తెనపల్లి మండల అధ్యక్షులు సులేమాన్ అధ్యక్షతన జరిగిన ఈ సభలో రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు పి.వి.కోటేశ్వరరావు, జిల్లా కార్యదర్శులు డి.థోమాసయ్య, బి.నరసింహారెడ్డి, సీనియర్ నాయకులు కె.పోతు లూరయ్య మాట్లాడుతూ చెన్నుపాటి లక్ష్మయ్య సంఘం కోసం, ఉపాధ్యాయుల శ్రేయస్సు కోసం, ప్రజా సంఘాలతో కలిసి సమాజ సేవ కోసం పాటుపడిన విధానాన్ని సోదాహరణంగా వివరించారు. ఈ కార్యక్రమంలో సత్తెపల్లి, ముప్పాళ్ళ, బెల్లకొండ, క్రోసూరు, అచ్చం పేట మండలాల అధ్యక్ష, కార్యదర్శులు మరియు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**తుళ్లూరు**

ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాతగా చెన్నుపాటి లక్ష్మయ్య చిరకాలం ఉపాధ్యాయుల గుండెల్లో నిలిచిపోతారని యుటియఫ్ జిల్లా ఆడిట్ కన్వీనర్ రవిచంద్రశేఖర్ కొనియాడారు. తుళ్ళూరులో డిసెంబర్ 11న చెన్నుపాటి లక్ష్మయ్య సంస్మరణ సభ జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో ఉపాధ్యాయ సంఘాన్ని స్థాపించుకునే హక్కును న్యాయస్థానాల ద్వారా సాధించిన ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాతగా లక్ష్మయ్య గుర్తిండిపోతా రన్నారు. తుళ్ళూరు మండల యుటియఫ్ అధ్యక్షులు సతీష్, ప్రధాన కార్యదర్శి శ్రీనివాసరావు తదితరులు పాల్గొన్నారు.

## ప్రకాశం

**కనిగిరి**

డిసెంబర్ 9న యుటియఫ్ కనిగిరి ప్రాంతీయ కార్యాలయంనందు అమరజీవి చెన్నుపాటి లక్ష్మయ్య వర్థంతి సభ జరిగినది. ఈ సభకు అధ్యక్షత వహించిన యుటియఫ్ జిల్లా కార్యదర్శి ఎన్.రామచంద్రారెడ్డి మాట్లాడుతూ చెన్నుపాటి ఉద్యమ జీవితాన్ని వివరించారు. రాష్ట్ర కౌన్సిలర్ ముక్కు తిరుపతిరెడ్డి మాట్లాడుతూ ఉద్యమ స్ఫూర్తితో ప్రభుత్వ

పాఠశాలలను అభివృద్ధి చేయాలన్నారు. వి.మాలకొండారెడ్డి యుటియఫ్ సీనియర్ నాయకులు అమరజీవుల, త్యాగధనులను స్ఫూర్తిగా తీసుకొని సంఘ అభివృద్ధికి తోడ్పాలన్నారు.

ఈ సమావేశంలో కనిగిరి, పిసి పల్లి, హెచ్ఎం పాడు మండల అధ్యక్ష, కార్యదర్శులు పాల్గొన్నారు. జి.మోషే, సుబ్బారావు (జిల్లా కుటుంబ సంక్షేమ పథకం డైరెక్టర్) తదితరులు ప్రసంగించారు. జిల్లా ఆడిట్ కమిటీ సభ్యులు ఎం.రాము పాల్గొన్నారు.

**పొదిలి**

డిసెంబర్ 9న యుటియఫ్ పొదిలి, మర్రిపూడి, కొనకనమిట్ల మండలాల ప్రాంతీయ కార్యాలయం పొదిలినందు ఉపాధ్యాయ ఉద్యమ పితామహుడు చెన్నుపాటి లక్ష్మయ్య 46వ వర్ధంతిని ఘనంగా నిర్వహించారు. జిల్లా కార్యదర్శి ఎస్వి కొండారెడ్డి మాట్లాడుతూ ఉపాధ్యాయుల సమస్యల కొరకు మొదటి సారిగా గళమెత్తిన వ్యక్తి చెన్నుపాటి అని వారి యొక్క ఆశయాలను ముందుకు తీసుకెళ్లాలని తెలియజేశారు. ఈ కార్యక్రమాని కి మూడు మండలాల అధ్యక్షులు జి. రమణారెడ్డి, ఎస్కె నాసర్ అహమ్మద్, పి.వెంకటేశ్వర్లు, ప్రధాన కార్యదర్శులు ఎస్కె అబ్దుల్హై, ఆర్.కోటేశ్వరరావు, బి.బుజ్జిబాబు మరియు సీనియర్ ఉపాధ్యాయులు కార్యకర్తలు పాల్గొన్నారు. చెన్నుపాటి ఆశయాలను ముందుకు తీసుకెళ్ళి నెరవేర్చుతామని ప్రతిజ్ఞ చేస్తూ వారికి ఘనంగా నివాళులర్పించారు.

**కంభం**

యుటియఫ్ కంభం, బేస్తవారిపేట, అర్ధవీడు మండలాల ఆధ్వర్యం లో చెన్నుపాటి లక్ష్మయ్య 46వ వర్ధంతి సభ సిహెచ్.వెంక టేశ్వర్లు అధ్యక్షతన జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా సీనియర్ నాయకులు ఆవుల సుబ్బారెడ్డి, యుటియఫ్ జిల్లా కార్యదర్శి మేకల రామమోహన్రావు హాజరై చెన్నుపాటి లక్ష్మయ్యకు నివాళులర్పిం చారు. వారు చేసిన సేవలను స్ఫూర్తిగా తీసుకొని వారి అడుగుజాడలలో నడవాలని సూచించారు. ఈ కార్యక్రమాలలో కంభం ప్రధానకార్యదర్శి వి.తిరుపతయ్య, బేస్తవారిపేట అధ్యక్షులు సయ్యద్ షబ్బీర్, ప్రధాన కార్యదర్శి ఐ.వి.రామిరెడ్డి, అర్బన్ ప్రధానకార్యదర్శి కె.రాంభూపాల్రెడ్డి జిల్లా కుటుంబ సంక్షేమ డైరెక్టర్ సిహెచ్.శివశంకర్, మూడు మండలాల ఉపాధ్యాయులు హాజరయ్యారు.

### విజయనగరం

డిసెంబర్ 9న విజయనగరం, బొబ్బిలి, సాలూరు, రామభద్రపురం తాలూకా కేంద్రాలలో చెన్నుపాటి వర్ధంతి సభలను నిర్వహించారు. ఉపాధ్యాయ సంఘం పెట్టుకోవడానికి, ఉపాధ్యాయుల మెరుగైన జీవన స్థితి కోసం అనేక నిర్బంధకాండలను ఎదిరించి, ఉపాధ్యాయ ఉద్యమానికి దిశానిర్దేశం చేసిన మహనీయుడు లక్ష్మయ్య. అందుకే ఆయన ఉద్యమ పితామహుడు అయ్యారు. వారి ఆదర్శవంతమైన జీవనం, నిరాడంబరత, ఖచ్చితత్వం, సంఘ అభివృద్ధికి దారితీసిందని, అటువంటి విలువలను నేటితరం కొనసాగించడమే చెన్నుపాటికి నిజమైన నివాళులని, బొబ్బిలిలో జరిగిన వర్ధంతి సభలో రాష్ట్ర సహాధ్యక్షురాలు కె.విజయగౌరి, జిల్లా కార్యదర్శులు పి.మధుసూదన రావు, వి.ప్రసన్నకుమార్, బొబ్బిలి, సీతానగరం, బాడంగి మండలాల నాయకు లు కె.రామకృష్ణ, పి.సత్యన్నారాయణ, జి.గంగులు, వి.రామకృష్ణ, చంటి, జి.శ్రీనివాస్, జగదీష్లు పాల్గొన్నారు. సాలూరు కేంద్రంలో సాలూరు, పాచిపెంట మండలాల నాయకులు బి.విజయ్ కుమార్, ఎ.సీతయ్య, సింహాచలం, శ్యామ్, మధు, గణపతి, కె.జానకీ రావులు పాల్గొన్నారు.

విజయనగరంలో జిల్లా పరిషత్ మినిస్టీరియల్ హాలులో చెన్నుపాటి చిత్రపటానికి పూలమాలలువేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమంలో జిల్లా గౌరవాధ్యక్షులు ఎ.శివ వర్మ, జిల్లా ప్రధానకార్యదర్శి కె.శేషగిరి, సహాధ్యక్షులు జి.నిర్మల, కోశాధికారి కె.శ్రీను నాయకులు, డి.రాము, రమేష్, త్రినాథ, పి.శ్రీను తదితరులు పాల్గొన్నారు.

### టీచర్ ఎమ్మెల్సీ అభ్యర్థి రాము సూర్యారావు తూర్పుగోదావరి జిల్లాలో విస్తృత ప్రచారం

ప్రోగ్రెసివ్ డెమోక్రటిక్ ఫ్రంట్ తరపున అధ్యాపక, ఉపాధ్యాయ సంఘాలు బలపరచిన ఉభయ గోదావరి జిల్లాల టీచర్ ఎమ్మెల్సీ రాము సూర్యారావు తూర్పుగోదావరి జిల్లాలో సఖినేటిపల్లి, మలికిపురం, రాజోలు, పి.గన్నవరం, అంబాజీపేట, అమలాపురం, కొత్తపేట, రావులపాలెం, ఆత్రేయపురం, ఆలమూరు, కపిలేశ్వరపురం, మండపేట, మండపేట టౌన్, రామచంద్రపురం, పెద్దాపురం టౌన్, తుని, తుని టౌన్ శాఖల పరిధిలోని ఉన్నత పాఠశాలలు, కళాశాలలకు వెళ్ళి ఓట్లను అభ్యర్థించారు. ఉపాధ్యాయులు, అధ్యాపకుల నుండి వీరి ప్రచారానికి విశేష స్పందన లభించింది. ఈ ప్రచార కార్యక్రమంలో జిల్లా బాధ్యులు ఎన్.విశ్వనాథ్, బి.శ్రీనివాసరావు, ఎస్.జ్యోతిబసు, పెంకే వెంకటేశ్వరరావు, డి.వి.రాఘవులు, ఎంఆర్సి మోహన్, జి.అప్పల నాయుడు, ఎస్ఎస్వి చలపతి, టిజి వాషింగ్టన్, సీనియర్ నాయకులు జి.చిట్టిబాబు తదితరులు పాల్గొన్నారు.

### అనంతపురం

ఉపాధ్యాయ ఉద్యమ పితామహుడు చెన్నుపాటి లక్ష్మయ్య 46వ వర్ధంతి సందర్భంగా యుటియఫ్ కార్యాలయంలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో చెన్నుపాటికి జిల్లా గౌరవాధ్యక్షులు సి.కె. నాగేంద్రబాబు నివాళులు అర్పించారు. అనంతరం జిల్లా అధ్యక్షులు ఎస్.మహమ్మద్ జిలాన్ ప్రసంగిస్తూ ఉపాధ్యాయుల హక్కుల కోసం, సౌకర్యాల కోసం, కృషిచేసిన తొలితరం నాయకుడు చెన్నుపాటి లక్ష్మయ్యనని శ్లాఘించారు. ఈ కార్యక్రమంలో జిల్లా ప్రధానకార్యదర్శి కోటేశ్వరప్ప, కార్యదర్శి కె.నాగేంద్ర, ఆడిట్ కన్వీనర్ సాయినాథ్బాబు, నగర నాయకు లు జనార్ధన్, కదిరప్ప, రామకృష్ణ, రాప్తాడు మండలశాఖ అధ్యక్షులు వెంకటేష్, గార్లదిన్నె శేషు, రూరల్ మండలం వెంకటస్వామి నాయుడు, పామిడి సురేష్, నాయకులు కృష్ణయ్య, తిప్పయ్య, రాజన్న, తాడిమర్రి తదితర మండల నాయకులు, కార్యకర్తలు, ఉపాధ్యాయులు హాజరైనారు.

# సావిత్రీబాయి జయంతి ఉత్సవాలు

**విజయనగరం**

యుటియఫ్ రాష్ట్ర సంఘం పిలుపు మేరకు విజయనగరం జిల్లాలో 24 మండల, పట్టణ శాఖలు స్పందించి 24 కేంద్రాలలో సావిత్రిబాయి జయంతి సభలు నిర్వహించారు. 2వేల కరపత్రాలను ముద్రించి జిల్లాలో విస్తృతంగా పంపిణీ చేశారు. ఈ సందర్భంగా వ్యాసరచన, వక్తృత్వ పోటీలను నిర్వహించి బహుమతి ప్రదానాలు చేశారు.

**విజయనగరం టౌన్ :** జిల్లా కేంద్రంలో 3 మున్సిపల్ ఉన్నత పాఠశాలల్లో జయంతి సభలను జరిపారు. కస్పా, బిపిఎం, కంటోన్మెంట్ పాఠశాలల్లో టీచర్లందరూ పాల్గొన్న సభలో జిల్లా ప్రధానకార్యదర్శి కె.శేషగిరి సావిత్రిబాయి కృషిని, నేటితరం తెలుసుకోవలసిన అంశాలను, ప్రస్తుత విద్యారంగ పరిస్థితుల గురించి మాట్లాడారు. జిల్లా కార్యదర్శి పి.శ్రీనివాసరావు, పట్టణ శాఖ నాయకులు కె.రాము, టి.సూర్యనారాయణ, పద్మావతి, లక్ష్మణరావులు పాల్గొన్నారు.

**విజయనగరం మండలం :** మండలంలో గాజులరేగ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో మండల శాఖ ఆధ్వర్యంలో నిర్వహించారు.

**బొబ్బిలి :** పట్టణ కేంద్రంలో టిపి మున్సిపల్ పాఠశాలలో డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో పట్టణశాఖ ప్రధానకార్యదర్శి పి.సత్యనారాయణ అధ్యక్షతన జరిగింది. బొబ్బిలి మున్సిపల్ చైర్‌పర్సన్ టి.అచ్చుతవల్లి మాట్లాడుతూ నేటి తరానికి ఆమె ఆదర్శనీయురాలన్నారు. రాష్ట్ర సహాధ్యక్షులు కె.విజయగౌరి మాట్లాడుతూ జాతీయ మహిళా ఉపాధ్యాయ దినోత్సవంగా ప్రకటించాలని డిమాండ్ చేశారు. బాలికల విద్య అభివృద్ధికి మరింత చర్యలు అవసరమని ఎంఇఓ ప్రసాద్, యుటియఫ్ నాయకులు ఇ.దేవి, ఉషారాణి, కృష్ణకుమారి, జివి నాయుడు, రామకృష్ణ, ప్రసన్నకుమార్, అచ్యుతరావు తదితరులు పాల్గొన్నారు.

**దత్తిరాజేరు :** దత్తిరాజేరు మండలంలో యుటియఫ్ జిల్లా కార్యవర్గ సభ్యులు ఎసిహెచ్ అప్పలనాయుడు ఆధ్వర్యంలో జయంతి సభను జరిపారు.

**బొండపల్లి :** మండల కేంద్రంలో బొండపల్లి హైస్కూల్‌లో సావిత్రిబాయి చిత్రపటానికి పూలమాలను ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులు వి.శ్రీనివాసరావు వేసి నివాళులర్పించి, సభను జరిపారు. యుటియఫ్ మండల నాయకులు చక్రపాణి, నాగేశ్వరరావు, ఈశ్వరరావు, వివిఎస్ చలం తదితరులు పాల్గొన్నారు.

**గంట్యాడ :** మహిళలు చదువుకుంటేనే సమాజాభివృద్ధి అని, దాని కోసం మొదట కంకణం కట్టుకున్న సావిత్రిబాయి నేటితరానికి ఆదర్శమని యుటియఫ్ జిల్లా గౌరవాధ్యక్షులు ఎ.శివవర్మ అన్నారు. పెదమజ్జి పాలెం పాఠశాలలో ప్రధానోపాధ్యాయులు ఇ.ఆనంద్ అధ్యక్షతన జరిగిన సభలో ప్రధానకార్యదర్శి మహేష్, లక్ష్మి, నిరుపమా లత, సతీష్, శ్రీదేవి, పాఠశాల విద్యార్థులు పాల్గొన్నారు.

**తెర్లాం :** మండల రిసోర్సు భవనంలో యుటియఫ్ మండల అధ్యక్షులు ఎం.సింహాచలం నాయుడు అధ్యక్షతన జయంతి సభను నిర్వహించారు. సావిత్రిబాయి చిత్రపటానికి పూలమాలవేసి అంజలి ఘటించారు. పాఠ్యాంశాలలో ఆమె జీవిత చరిత్రను పొందుపరచాలని అభిప్రాయ పడ్డారు. ప్రధానకార్యదర్శి నల్ల అజయ్, ఉమామహేశ్వరరావు, చిన్నమ్మలు, లక్ష్మి, జ్యోతిలక్ష్మి తదితరులు పాల్గొన్నారు.

**రామభద్రపురం :** మండలం కేంద్రంలో ఉన్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయిని వి.భానుమతి అధ్యక్షతన జయంతి సభ జరిగింది. ఈ సభలో వక్తగా రాష్ట్ర సహాధ్యక్షులు కె.విజయగౌరి పాల్గొని ప్రసంగించారు. భారత దేశంలో బడుగులకు బడులను పెట్టి, బాలికావిద్య అభివృద్ధికి కృషి చేసిన మహామనిషి అని, ఆమె ఆశయాలను మనమంతా నెర వేర్చాలని అన్నారు. యుటియఫ్ నాయకులు జి.శ్రీనివాస్, సురేష్, ప్రసన్నకుమార్, ఎన్.వి.రమణ, సర్వలక్ష్మి, ఉమ, నూకాలు, లక్ష్మి సుచరిత తదితరులు పాల్గొన్నారు.

**భోగాపురం :** మహిళలకు ఆదర్శం సావిత్రిబాయి అని జిల్లా మహిళా విభాగం కన్వీనరు జి.నిర్మల అన్నారు. స్థానిక కెజిబివి పాఠశాలలో జరిగిన సభలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి ఇ.రాములప్పడు, నాయకులు ప్రసాద్, వైకుంఠరావు, సుధారాణి, బంగారులక్ష్మి, రమణమ్మ, విద్యార్థినులు పాల్గొన్నారు.

**పూసపాటిరేగ :** మండల కేంద్రంలో ఉన్నత పాఠశాలలో జయంతి సభ ఘనంగా నిర్వహించారు. పూలే చిత్రపటానికి పూలమాలలువేసి నివాళులర్పించారు. పాఠశాల ప్రధానోపాధ్యాయిని సత్యవతి, రాష్ట్ర కార్యదర్శి డి.రాము, యుటియఫ్ నాయకులు జి.నిర్మల, నీలకంఠేశ్వర రావు, రమణమూర్తి, కుమిలిరెల్లివలస, పి.రేగ పాఠశాలల ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**కొత్తవలస :** యుటియఫ్ జిల్లా కార్యదర్శి జి.పార్వతి అధ్యక్షతన స్థానిక పాఠశాలలో సావిత్రిబాయి జయంతి సభ జరిగింది. విద్య సమాజంలో అందరికీ అందుబాటులోకి రావాలని అకుంఠిత దీక్షతో పని చేయాలన్నారు. లక్ష్మి, రాధాభాయి, తేజోవతి, వెంకటనాయుడులు పాల్గొన్నారు.

**సీతానగరం :** మండలంలో జోగింపేట కెజిబివి పాఠశాలలో ఎస్.ఓ నారాయణమ్మ అధ్యక్షతన సావిత్రిబాయి జయంతి సభ జరిగింది. ఈ కార్యక్రమంలో యుటియఫ్ రాష్ట్ర సహాధ్యక్షులు కె.విజయగౌరి పాల్గొని ప్రసంగించారు. సావిత్రిబాయి పనిచేసే కాలంలోనే విద్యా కమీషన్‌లకు పలు ప్రతిపాదనలు చేసి, అందరికీ విద్యనందించాలనే డిమాండ్‌ను తెచ్చారన్నారు. యుటియఫ్ నాయకులు గంగులు, ఆనంద్, మధు, రామకృష్ణ, సునీత, గౌరి, పద్మ తదితరులు పాల్గొన్నారు.

**సాలూరు :** మండల కేంద్రంలో బక్కుపేట ప్రాథమిక పాఠశాలలో యుటియఫ్ మండల ప్రధానకార్యదర్శి బి.విజయకుమార్ అధ్యక్షతన జరిగిన జయంతి సభలో మహిళా ఉపాధ్యాయులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. మహిళా విద్య కోసం అవమానాలు, నిర్బంధాలను ఎదిరించి సమాజానికి ధృవతారగా నిలిచారన్నారు. మహిళా నాయకులు సుశీల, శ్యామలాంబ, జి.సుజాత, సూర్యకుమారి, జగదీష్, మన్మథ రావులు పాల్గొన్నారు.

**పార్వతీపురం :** జూనియర్ కళాశాలలో డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో మహిళా నాయకురాలు జ్యోతి అధ్యక్షతన జయంతి సభ జరిగింది. ఈ సభకు ముఖ్యవక్తలు ప్రముఖ సాహితీవేత్త గంటేడ గౌరు నాయుడు, రాష్ట్ర సహాధ్యక్షులు కె.విజయగౌరిలు పాల్గొన్నారు. తొలి ఉపాధ్యాయిని గానే కాక, సంఘసంస్కర్తగా అనేక దురాచారాలను రూపుమాపడానికి పోరాడిందని అన్నారు. అటువంటి సావిత్రిబాయి జన్మదినాన్ని ప్రభుత్వమే అధికారికంగా నిర్వహించాలని కోరారు. ఈ కార్యక్రమంలో జిల్లా అధ్యక్షులు ఎస్.మురళీమోహన్, సహాధ్యక్షులు జి.నిర్మల, మహిళా నాయకులు జయలక్ష్మి, పద్మజ, జ్యోతిలతోపాటు పార్వతీపురం, కొమరాడ, గురుగుబిల్లి మండల నాయకులు కె.మురళీ, కె.భాస్కర రావు, జి.మురళి, జయలక్ష్మి, పద్మజ తదితరులు పాల్గొన్నారు.

**మెరకముడిదాం :** మండలంలో గర్భాం ఉన్నత పాఠశాలలో పాఠశాల ప్రధానోపాధ్యాయుని అధ్యక్షతన సభ జరిగింది. యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గ సభ్యులు ఎం.కృష్ణారావు సభనుద్దేశించి మాట్లాడారు. పాఠశాల ఉపాధ్యాయ సిబ్బంది, విద్యార్థులు పాల్గొన్నారు.

**జామి :** జిల్లా కార్యదర్శి జెవిఆర్‌కె ఈశ్వరరావు ఆధ్వర్యంలో జామి మండల కేంద్రంలో జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఘనంగా జరిపారు. సావిత్రి జీవితాన్ని, సామాజిక దృక్పధాన్ని ఆదర్శంగా తీసుకోవాలన్నారు. ఈ కార్యక్రమంలో హెచ్ఎం శంకరరావు, ఉపాధ్యాయులు, యుటియఫ్ నాయకులు తిరుపతి నాయుడు, రాము, సంతోషి, వనజ, గిరిజ, రామకృష్ణ తదితరులు పాల్గొన్నారు.

**చీపురుపల్లిలో :** జిల్లా కార్యదర్శి మీసాల అప్పలనాయుడు, భూపతి, బలరాంలు పాల్గొన్నారు.

**గుర్ల:** గుర్లలో జిల్లా కోశాధికారి కె.శ్రీనివాస్, మండల నాయకులు బంగార్రాజు, రామకృష్ణల ఆధ్వర్యంలో జరిగింది. పూలమాలలు వేసి ప్రస్తుత విద్యారంగం గురించి మాట్లాడారు. పద్మజ, లావణ్య, పద్మావతి తదితరులు పాల్గొన్నారు.

**మెంటాడ :** విఆర్‌కె పురం పాఠశాలలో ప్రధానోపాధ్యాయిని విమల కుమారి అధ్యక్షతన సభ జరిగింది. ఈ సభలో పి.లక్ష్మణ జిల్లా కార్యదర్శి బాలికా విద్య ప్రాధాన్యతను గురించి మాట్లాడారు. యుటియఫ్ నాయకులు శ్రీనివాస్, సత్యారావు, రాజులతోపాటు ఉపాధ్యాయ సిబ్బంది పాల్గొన్నారు.

**గజపతినగరం :** మండలంలో మండల నాయకులు జి.వి.నారాయణ అధ్యక్షతన జరిగింది.

**ఎస్.కోట :** జిల్లా సహాధ్యక్షులు జి.వెంకటరావు ఆధ్వర్యంలో జరిగింది. జి.వి.రమణ, ఉమ, బంగారు నాయుడులు పాల్గొన్నారు. ఎల్ కోటలో జరిపారు.

మొత్తంగా 23 కేంద్రాలలో 1 డివిజన్ కేంద్రంలో జరిగిన సావిత్రి బాయిపూలే జయంతి సభలకు మంచి స్పందన, భాగస్వామ్యం లభించింది. 600 టీచర్లు, 2100 విద్యార్థినులు పాల్గొన్నారు.

## కర్నూల్

### మహిళ చైతన్యవంతం కావాలి

సావిత్రిబాయి పూలే స్ఫూర్తితో మహిళలు చైతన్యవంతులైనప్పుడు మాత్రమే మహిళా సమస్యలు పరిష్కారమవుతాయని యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఐ.వెంకటేశ్వరరావు అన్నారు. శనివారం ఆదోని నేషనల్ విద్యాసంస్థ ఆవరణంలో జిల్లా సహాధ్యక్షురాలు బి.నాగమణి అధ్యక్షతన సావిత్రీబాయి పూలే జయంతి సందర్భంగా జిల్లాస్థాయి మహిళ సదస్సు నిర్వహించారు. యుటియఫ్ రాష్ట్ర గౌరవ అధ్యక్షులు ఎన్.నరసింహులు సదస్సును ప్రారంభించారు. ఐ.వెంకటేశ్వరరావు మాట్లాడుతూ సార్వత్రిక, ప్రాథమిక విద్య లక్ష్య సాధనలో మహిళలపాత్ర కీలకమైనదన్నారు. ఆనాడు సావిత్రిబాయి పూలే మహిళలకు చదువు చెప్పడం పెద్ద సాహసమని, ఆనాటి సామాజిక అసమానతలపై పెద్ద పోరాటమేనని గుర్తుచేశారు. దీనికోసం సావిత్రీబాయి అనేక అవమానాలు ఎదుర్కొని దీక్షతో జీవితాంతం మహిళల అభివృద్ధికి కృషి చేశారన్నారు. నేటి విద్యారంగంలో నెలకొన్న గందరగోళ పరిస్థితులకు పాలకులే కారణమన్నారు. ప్రభుత్వ పాఠశాలల్లో నేటికీ మంచినీరు, మరుగుదొడ్లు లేక విద్యార్థినీలు అనేక ఇబ్బందులు పడుతున్నా పాలకులు పట్టించుకోవడం లేదన్నారు. కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలు పాఠశాల విద్యను ప్రవేటీకరించారని, మార్కెట్ సరుకుగా మార్చి మహిళలకు విద్యను దూరం చేస్తుందన్నారు. యుటియఫ్ ఆధ్వర్యంలో దేశ తొలి మహిళా ఉపాధ్యాయిని సావిత్రిబాయి పూలే జయంతిని మహిళా ఉపాధ్యాయ దినోత్సవంగా జరుపుకుంటున్నా మన్నారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు డి.రామశేషయ్య, కె.సురేష్‌కుమార్, జిల్లా కార్యదర్శి జి.సుజాత, కెజిబివి నాయకురాలు నాగరత్నమ్మ, మాజీ జిల్లా కార్యదర్శి రాణి కుమిదినిదేవి, కళావతి తదితరులు పాల్గొన్నారు.

## విశాఖపట్టణం

క్వీన్ మేరీ ప్రభుత్వ పాఠశాలనందు ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) విశాఖ జిల్లా శాఖ ఆధ్వర్యంలో సావిత్రీబాయి పూలే జయంతి కార్యక్రమము పి.విజయలక్ష్మి అధ్యక్షతన జరిగింది. ఆమె మాట్లాడుతూ సావిత్రీబాయిపూలే చేసిన సామాజిక సేవా కార్యక్రమాలు మహిళలకు ఆదర్శమని పేర్కొన్నారు. మహిళలను అన్ని విషయాలలో చైతన్యపరచాలని తెలిపారు. పాఠశాల ఇన్‌చార్జ్ ప్రధానోపాధ్యాయులు మాట్లాడుతూ ప్రస్తుతము మన సమాజంలో బాలికలను చైతన్యపరచి భవిష్యత్‌లో వారిని సమాజం పట్ల అవగాహన కలిగిన వ్యక్తులుగా తీర్చిదిద్దటంలో ఉపాధ్యాయులుగా మనకు మంచి అవకాశం ఉందని ఆ అవకాశాన్ని అందరు సద్వినియోగం చేసుకోవాలని పిలుపునిచ్చారు. ఈ సమావేశంలో ప్రధానవక్తగా ఎం.బి.సూర్యం సావిత్రీబాయి పూలే స్వాతంత్ర్యానికి పూర్వం మత చాందసులను ఎదుర్కొని సమాజం నుండి అనేక వ్యతిరేకతలు వచ్చినప్పటికి పట్టుదలతో దళిత బాలికల కోసం పాఠశాలలను ఏర్పాటు చేయడం గొప్ప విషయమని ఆ మహానీయురాలి జీవిత చరిత్ర యావత్ మహిళా లోకానికే మార్గదర్శమని కొనియాడారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా అధ్యక్షులు కె.జాజులు, ఆనందపురం మండల ప్రధానకార్యదర్శి కె.వి.రామసత్యనారాయణ, కె.హెచ్.హెచ్.ఆర్. పద్మశ్రీ, శ్రీలక్ష్మి, కె.శ్యామల, శకుంతల, అనిల్, సుబ్బారావు ఇతర ఉపాధ్యాయినిలు సుమారు 51మంది పాల్గొన్నారు.

## నెల్లూరు

**సూళ్ళూరుపేట :** జనవరి 3న యుటియఫ్ తడ, సూళ్ళూరుపేట, దొరవారి సత్రం మండల శాఖల ఆధ్వర్యంలో సావిత్రిబాయ్‌పూలే 185వ జన్మదినాన్ని జాతీయ మహిళా దినోత్సవంగా జరపడం జరిగినది. ఈ కార్యక్రమానికి మూడు మండలాల మహిళా ఉపాధ్యాయినులు ఎక్కువ సంఖ్యలో పాల్గొని సావిత్రిబాయ్‌పూలే జీవిత విశేషాలు గురించి మాట్లాడటం జరిగినది. కార్యక్రమానికి జిల్లా పరిషత్ బాలికల ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయిని, మన్నారు పోలూరు ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయిని ఆర్.మెర్సిమాణిక్యం, ఇ.రాజేశ్వరి మండల విద్యాశాఖాధికారి సిహెచ్.చలపతి, దామా నెల్లూరు ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు ఆర్.రామచంద్రయ్య, యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి సి.చంద్రశేఖర్, మూడు మండలాల అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు మరియు ముఖ్యమైన కార్యకర్తలు పాల్గొన్నారు.

**గూడూరు :** సావిత్రిబాయ్‌పూలే 185వ జయంతి నెల్లూరు జిల్లా గూడూరు యుటియఫ్ ప్రాంతీయ కార్యాలయంలో నిర్వహించారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న జిల్లా ఉపాధ్యక్షులు వి.రమాదేవి మాట్లాడుతూ సాంఘీక దురాచారాలను రూపుమాపుటకు చదువే పరిష్కారంగా భావించి పాఠశాలను స్థాపించి బాలికల విద్యను ప్రారంభించి ఆదర్శ ఉపాధ్యాయినిగా నిలిచారని వారి పుట్టిన రోజును జాతీయ మహిళా ఉపాధ్యాయ దినోత్సవంగా జరపాలని డిమాండ్ చేశారు.

జిల్లా కార్యదర్శి టి.స్వర్ణలత మాట్లాడుతూ సావిత్రిబాయ్‌పూలే టీచర్‌గా, సాంఘీక సంస్కర్తగా, కవయిత్రిగా, కళాకారిణిగా, మానవతా మూర్తిగా నిలబడి సమాజానికి తగు సేవచేసి తరించినదని వారిని ఆదర్శంగా తీసుకొని ఉపాధ్యాయుల హక్కులకై జరుగు పోరాటంలో మహిళా ఉపాధ్యాయినిలు అధిక సంఖ్యలో పాల్గొనాలని పిలుపునిచ్చారు. జిల్లా కార్యదర్శి నవకోటేశ్వరరావు మాట్లాడుతూ మహారాష్ట్రలో

కరుడుగట్టిన సనాతన ధర్మాలను ఎదురొడ్డి నిలబడ్డ మానవతావాది అని ఆమె చరిత్రను పాఠ్యాంశంగా చేర్చాలని డిమాండ్ చేశారు. రాష్ట్ర కౌన్సిలర్ వాసుదేవరావు మాట్లాడుతూ అంబేద్కర్ లాంటి వారికే ఆదర్శ ప్రాయమైన పూలే దంపతులు ఆదర్శనీయులని కొనియాడారు. కార్యక్రమంలో శశికళ, శివకుమారి, నారాయణమ్మ తదితరులు ప్రసంగించారు. ప్రాంతీయ నాయకులు వెంకటరత్నం, రవి, మస్తాన్, సుధీర్, నాగేశ్వర రావు, బాబ్జి, శ్రీను, అనిల్, హరిబాబు, రామయ్య తదితరులు పాల్గొన్నారు.

## కడప

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) మహిళా విభాగం సావిత్రిబాయ్‌పూలే జయంతిని కడపలో జిల్లా కార్యాలయంలో నిర్వహించారు. ఈ కార్యక్రమానికి మహిళా విభాగం కన్వీనర్ కె. గాయత్రి అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ భారతీయ మహిళా విముక్తిపై 19వ శతాబ్దపు సంకెళ్ళను తెరిచి సమాజంలో దళితులు, మహిళలకు, వితంతువులకు, బాలికలకు విద్యనందించిన తొలి మహిళా ఉపాధ్యాయురాలు సావిత్రిబాయ్‌పూలే అన్నారు. భారతదేశపు తొలి మహిళా ఉపాధ్యాయిని సావిత్రిబాయ్ పూలే జన్మదినాన్ని జాతీయ మహిళా ఉపాధ్యాయ దినోత్సవంగా ప్రకటించాలని డిమాండ్ చేశారు.

జిల్లా ఉపాధ్యక్షురాలు ఆర్.ఉషాతులసి మాట్లాడుతూ మహిళా ఉపాధ్యాయులు, బాలికల పాఠశాలలు మరియు బాలికల సమస్యల పరిష్కారం కోసం సావిత్రిబాయ్‌పూలేని ఆదర్శంగా తీసుకొని ఉద్యమిం చాలన్నారు. మహిళా ఉపాధ్యాయులకు, బాలికల పాఠశాలల్లో ఉపాధ్యాయులకు, విద్యార్థులకు టాయ్‌లెట్స్, విశ్రాంతి గదులు ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శులు రూత్ ఆరోగ్యమేరి, వీణ పల్లవి, డి.సుజాతరాణి, లక్ష్మి మాధవి, మనోరమ తదితరులు పాల్గొన్నారు.

## పశ్చిమగోదావరి

**చింతలపూడి :** జనవరి 3న చింతలపూడి సుబ్బరాజు స్కూల్‌లో భారత దేశ తొలి మహిళా ఉపాధ్యాయిని సావిత్రిబాయ్‌పూలే 185వ జయంతి వేడుకలు యుటియఫ్ మండల శాఖ ఆధ్వర్యంలో ఘనంగా జరిగాయి. స్కూల్ ఇన్‌చార్జ్ హెడ్ మాస్టర్ ఎం.వి.అప్పారావు అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో సావిత్రిబాయ్‌పూలే చిత్రపటానికి పూలమాలవేసి, పుష్పాంజలితో ఘననివాళి అర్పించారు. ఉన్నత మరియు ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులు ఎక్కువగా పాల్గొన్న సభలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి పూరేటి శ్రీనివాసరావు మాట్లాడుతూ సావిత్రిబాయ్‌పూలే కులాలకు, మతాలకు అతీతంగా సామాజిక సేవ చేసిన మొదటి మహిళ. భారతీయ మహిళా జీవన వికాసానికి కృషి చేసిన తొలి మహిళా ఉపాధ్యాయిని, ఆమె జీవితంలో ముఖ్య సంఘటనలను వివరంగా తెలియజేసి, ప్రస్తుతం మహిళా ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న అనేక సమస్యలను ప్రస్తావిస్తూ ఉద్యమాలకు ముందుకు రావాలని, ఉపాధ్యాయ ఉద్యమంలో మీ వంతు కృషి చేసి మీకున్న ప్రస్తుత సౌకర్యాలను నిలుపుకోవాలని సావిత్రిబాయ్ పూలే జీవితం స్ఫూర్తితో ముందుకు రావాలని సూచించారు. కార్యక్రమంలో మహిళా కార్యకర్తలు వి.రాజేశ్వరి, పి.రాహేలమ్మలు సావిత్రిబాయ్‌పూలే గురించి మాట్లాడారు. మహిళా ఉపాధ్యాయులు పెద్ద సంఖ్యలో పాల్గొని సభను విజయవంతం చేశారు.

**పాలకొల్లు :** యుటియఫ్ పాలకొల్లు మండల శాఖ సావిత్రిబాయ్‌పూలే 185వ పుట్టినరోజు సందర్భంగా జనవరి 3న జిల్లా ప్రజాపరిషత్ ఉన్నత పాఠశాల, చింతపరు, పాలకొల్లు మండలంనందు వ్యాస రచన పోటీని నిర్వహించి విజేతలకు బహుమతులు అందించడం జరిగింది. ఈ కార్యక్రమంలో పాఠశాల ప్రధాన ఉపాధ్యాయులు వరినీడ బ్రహ్మాజీ రావు మాట్లాడుతూ సావిత్రిబాయ్‌పూలే జీవిత విశేషాలు, బాలికల విద్య కొరకు ఆవిడ చేసిన కృషి కొనియాడారు. ఈ కార్యక్రమం నిర్వహిస్తున్న యుటియఫ్‌ని ప్రశంసించారు. ఈ కార్యక్రమంలో పాలకొల్లు మండలశాఖ ప్రధానకార్యదర్శి కె.రాజశేఖర్ మాట్లాడుతూ సావిత్రిబాయ్‌పూలే భారతదేశ మొట్టమొదటి మహిళా ఉపాధ్యాయిని, నిరంతర స్ఫూర్తిదాయిని, ఆదర్శమూర్తి అని సామాజిక విప్లవకారిణి అని అన్నారు. పేదలు, పీడితులు, అంటరాని వారి పక్షాన నిలిచి నందుకు అవమానాలు, హత్యా యత్నాలు కూడా ఎదుర్కొని స్త్రీల సాధికారిత కోసం, బాల వితంతువుల పునర్వివాహము, పునరావాసం కల్పించుటకు ఎంతో కృషి చేసారు. ఎన్ని ఆటంకాలు వచ్చిన ధృఢ సంకల్పంతో నిలబడ గలిగారు అని, నేటి బాలికలు కూడా అలాంటి ధృడమైన సంకల్పం, పట్టుదల, సామాజిక సేవా దృక్పధాన్ని అలవర్చు కోవాలని కోరారు. అనంతరం విజేతలకు బహుమతులు ప్రదానం చెయ్యడం జరిగింది. వ్యాసరచన పోటీలో పాల్గొని బహుమతులు సాధించిన విద్యార్థినులకు ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ పాలకొల్లు మండల శాఖ తరపున కె.రాజశేఖర్ అభినందనలు తెలిపారు. ఈ కార్యక్రమంలో ఉపాధ్యాయులకు కె.సత్యనారాయణ, జిబిజె ప్రసాదు, కె.వి.నారాయణ, ఎస్వి రామయ్య, కె.శ్రీనివాస కుమార్, కె.సురేష్, వి.వి.రావు, సిహెచ్.ఎం.జె.స్వరూప రాణి, జె.సరోజిని, బి. బేబీ సరోజని, పి.దుర్గాంబిక, పి.నిర్మలకుమారి, విద్యార్థిని, విద్యార్థులు పాల్గొన్నారు.

**పెరవలి :** దేశంలో మొదటి మహిళా ఉపాధ్యాయిని సావిత్రిబాయ్‌పూలే జయంతిని మహిళా ఉపాధ్యాయ దినోత్సవంగా నిర్వహించారు. యుటియఫ్ రాష్ట్రశాఖ కార్యదర్శి ఎస్.జయప్రభ తెలిపారు. పెరవలి నం.2 పాఠశాలలో జనవరి 5న మహిళా ఉపాధ్యాయ దినోత్సవాన్ని నిర్వహించారు. జయప్రభ మాట్లాడుతూ 1800వ సంవత్సరంలో దేశంలో మహిళకు స్వేచ్ఛ ఉండేది కాదని, మనో ధర్మం ప్రకారం భర్త అడుగుజాడల్లో భార్యలు నడిచేవారని తెలిపారు. అదే విధంగా సావిత్రిబాయ్‌పూలే కూడా భర్త అడుగుజాడల్లో నడిచినా భర్త ఆదర్శాల్లో పాలుపంచుకున్నారని చెప్పారు. సమాజంలో స్త్రీలపై జరుగుతున్న సాంఘిక దురాచారాలు, కన్యాశుల్కం, సతీసహగమనం వంటివి రూపు మాపాలనే ధ్యేయంతో పనిచేశారని చెప్పారు. యుటియఫ్ శాఖ మండల అధ్యక్షుడు ఎం.శేఖర్‌రాజు మాట్లాడుతూ సమాజంలో స్త్రీలు ఎంతో అభివృద్ధిని సాధించాలన్నారు. ఇంకా మహిళలను వరకట్నం కోసం వేధిస్తుండటం దారుణమన్నారు. యుటియఫ్ శాఖ మండల కార్యదర్శి వి.వెంకటరమణ, వి.రాముడు, జి.సుజాత, డి.రాజకుమారి, వి.ధన లక్ష్మి, యు.జయలక్ష్మి పాల్గొన్నారు.

## గుంటూరు

ఆధునిక కాలానికి చెందిన మొదటి మహిళా ఉపాధ్యాయురాలు సావిత్రిబాయ్‌పూలే జయంతిని యుటియఫ్ జిల్లాశాఖ ఆధ్వర్యంలో గుంటూరులో జిల్లా కార్యాలయంలో నిర్వహించారు. జిల్లాకార్యదర్శి ఆదిలక్ష్మి అధ్యక్షతన ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ముందుగా సావిత్రిబాయ్ పూలే చిత్రపటానికి యుటియఫ్ సీనియర్ నాయకురాలు కృష్ణతులసి పూలమాలవేసి నివాళు లర్పించారు. రాష్ట్ర సహాధ్యక్షులు ఎస్.వెంకటేశ్వర్లు మాట్లాడుతూ మహిళా లోకానికి సావిత్రిబాయ్‌పూలే ఆదర్శమని, ఆమె ఎన్నో ఇబ్బందులెదుర్కొని విద్యని బోధించారని, విద్య ద్వారానే సమాజం మారుతుందని సావిత్రిబాయ్‌పూలే చెప్పారన్నారు. జిల్లా అధ్యక్షులు కె.నాగమల్లేశ్వరరావు సావిత్రిబాయ్ అందరికీ స్ఫూర్తి అని, మహిళలు ఉద్యమాల్లోకి రావాలన్నారు. ఎపిటిఎ నాయకులు వెంకటరత్నం మాట్లాడుతూ అప్పట్లో మహారాష్ట్రలో నెలకొన్న పరిస్థితుల్లో సావిత్రీబాయ్ ఎన్నో అవమానాలు ఎదుర్కొని వాటిని ఎదిరించి మరీ విద్యా బోధన చేశారన్నారు. రాష్ట్ర కౌన్సిలర్ సిహెచ్ పద్మావతి మాట్లాడుతూ సావిత్రిబాయ్ ఈతరం మహిళలకు ఒక మార్గదర్శి అని, ఆమె చరిత్రను అధ్యయనం చేయాలని చెప్పారు. నేటి పాలకులు మహిళలను రకరకాల భ్రమలతో వంచిస్తున్నారని, విద్యారంగాన్ని తిరోగమనంవైపు తీసుకెళ్తున్నారన్నారు. రకరకాల పేర్లతో రేషనలైజేషన్, క్లస్టర్ స్కూల్స్ లాంటి పేర్లతో ప్రభుత్వ పాఠశాలను మూసివేస్తున్నారని, వీటిని చైతన్యంతో పోరాటంతో ఎదుర్కోవాలని చెప్పారు. రాష్ట్ర కౌన్సిలర్ ఎన్.తాండవకృష్ణ మాట్లాడుతూ చట్టసభల్లో మహిళల సంఖ్య చాలా తక్కువని చెప్పారు. కార్యక్రమంలో జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.హను మంతరావు, కోశాధికారి పి.ప్రేమ్‌కుమార్, జిల్లా కార్యదర్శి డి.లక్ష్మీ పార్వతి, వాణిశ్రీ, బుల్లెమ్మ, మరియమ్మ, నిర్మల తదితరులు పాల్గొన్నారు.



హెల్త్‌కార్డు స్కీమ్‌పై వివరణ ఉత్తర్వులు

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

Health, Medical & Family welfare – Employees Health scheme – Further clarification - Orders –Issued.

**HEALTH, MEDICAL & FAMILY WELFRE (L1) DEPT**

**G.O.MS.No. 159 Dated:22 -12-2014.**

**Read the following:**

1. G.O.Ms.No.174 HM&FW (M2) Dept dated 01-11-2013.
2. G.O.Ms.No.175 HM&FW (M2) Dept dated 01-11-2013.
3. G.O.Ms.No.176 HM&FW (M2) Dept dated 01-11-2013.
4. G.O.Ms.No.134 HM&FW (I1.1) Dept dated 29-10-2014.
5. G.O.Ms.No.135 HM&FW (I1.1) Dept dated 29-10-2014.
6. G.O.Rt.No.3578 GA(SW) Dept dated 30-10-2014.
7. G.O.Ms.No.210 Fin (TFR) Dept dated 15-11-2014.
8. G.O.Ms.No.150 HM&FW (I.1) Dept dated 04-12-2014.
9. G.O.Rt.No.4092 GA (SW) Dept dated 18-12-2014.

****

**ORDER:**

In the Government orders 1st and 4th read above, orders were issued for implementing 'Employees Health scheme' to provide 'cashless' treatment to the State Government employees, pensioners and their eligible dependent family members in replacement of the medical reimbursement system under APIMA Rules, 1972.

2. The employees' Associations and Pensioners' Associations represented certain grievances on implementation of the Employees Health scheme. After careful consideration of the grievances, Government have taken the following decisions:

a. Health cards should be issued to all eligible employees and pensioners immediately in consultation with Finance and Medical & Health Departments.

b. Necessary steps should be taken by Medical & Health Department and Aarogyasri Health Care Trust to ensure treatment by all NABH accredited hospitals and other corporate hospitals to the card holders.

c. Cashless treatment to card holders and medical reimbursement systems should run parallel for two more months, till cards are issued to all eligible employees and pensioners and the Employees Health scheme is established.

d. The meeting of steering committee constituted for this purpose be held shortly to get more feedback and suggestions from the employees and pensioners.

3. Accordingly, in accordance with the above decisions Government, hereby, issue the following orders:

(i) Finance Department shall make available to Aarogyasri Health Care Trust, the data of all the employees, including the provincialised work charged employees, together with the details relating to their eligible dependent family members including their aadhaar data, so as to enable Aarogyasri Health Care Trust to generate health cards to all the employees. In case of any delay in getting the data of employees through CFMS., and furnishing to the Aarogyasri Health Care Trust, the eligible employees who have not yet got health cards may be allowed to enroll themselves and their family members with Aarogyasri Health Care Trust, in the ehs-portal, as in the case of pensioners.

(ii) Finance Department, in consultation with the Director of Treasuries and Accounts, shall evolve a procedure for enrolment of the pensioners of Andhra Pradesh State who settled in the neighbouring States of Tamilnadu and Karnataka. **Till such time they are issued health cards under Employees Health scheme, they will continue to be covered under APIMA Rules, 1972.**

(iii) The Aarogyasri Health Care Trust shall take action, in consultation and coordination with Director of Medical Education, to negotiate with the NABH accredited hospitals and other corporate hospitals, (which have not come forward to provide treatment to the patients under Employees Health scheme), to participate in Employees Health scheme.

(iv) Aarogyasri Health Care Trust shall take action for empanelment of corporate hospitals in the neighbouring States, which are already providing services to the respective State Governments under the relevant health schemes.

(iv) General Administration (SW) Department shall take action to convene the meeting of the Steering Committee constituted in the G.Os.6th and 9th read above.

(v) The Employees Health scheme and medical reimbursement system under APIMA Rules, 1972 shall run parallel till 28-02-2015 and the medical claims of the employees / pensioners under reimbursement system shall be processed in accordance with the APIMA Rules, 1972 and the orders issued thereunder.

(vi) Staff working in A.P.Bhavan, New Delhi will, however, continue to be covered by reimbursement under the existing APIMA Rules, 1972.

(vii) Even in the case of employees / pensioners who are having 'health cards', if they avail treatment in non-empanelled hospitals, **in emergency**, they may be allowed reimbursement, as per the package rates of Employees Health scheme.

(viii) Employees working in Nellore, Chittoor and Anantapur, having health cards, and seek treatment in the Super Specialty hospitals in Chennai, Vellore and Bangalore, respectively, especially in case of complicated diseases, will be allowed reimbursement as per the package rates of Employees Health scheme.

4. This order issues with the concurrence of Finance PFS (R&E) No.10501/PFS/(R&E), Dated. 20-12-2014.

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)**

**L.V.SUBRAHMANYAM**

**PRINCIPAL SECRETARY TO GOVERNMENT**

***

